# నా విదేశ యాత్రానుభవాలు

ఓ. కామేశ్వరి

మరికొన్ని కథలు



ప్రచురణ :

**డి. కామేశ్వరి**

407 తిరుమల అపార్టుమెంట్, హిమాయత్ నగర్,

హైదరాబాద్-29

1 వ ముద్రణ :
1997 ఏప్రియల్

ధర : 30-00

ప్రతులకు :

**1. విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్**
4-1-435, బ్యాంక్ స్ట్రీట్,
హైదరాబాద్-500 001

**2. నవోదయ బుక్ హౌస్**
కాచిగూడ, హైదరాబాద్-27

**3, అరుణా పబ్లిషింగ్ హౌస్**
ఏలూరురోడ్, విజయవాడ-2

# అంకితం

నా 'అరుణ' నవలని సినిమాగా తీయాలని నాకంటే ఎక్కువగా

ఆరాటపడి ఆఖరికి పట్టువదలని విక్రమార్కుడిలా

"డాక్టర్ మమత"గా టి. వి. సీరియల్

తీసిన నా అభిమాన నటి

**శ్రీమతి జమునకి**

అభినందనలతో

—డి. కామేశ్వరి

# ఇందులో....

# శుభాకాంక్షలు

శ్రీమతి కామేశ్వరిగారు విదేశ యాత్రానుభవాలను గుదిగుచ్చి ఈ గ్రంథరూపంలో మన చేతుల్లో ఉంచటం ఆనందించదగ్గ విషయం. ఇటువంటి రచనలు ఆధునిక కాలాన ఎక్కువగా కనిపించవు.

మనిషికి అత్యవసరమైన లక్షణాలు రెండు. అందులో మొదటిది ప్రతిభ. రెండోది వ్యుత్పన్నత. ప్రతిభ స్వాంతసిద్ధమైన గుణమని మనం అంగీకరిస్తే, వ్యుత్పన్నత లోకాన్నీ కావ్యజాలాన్నీ అపేక్షించటం వలన సంక్రమించే గుణం. లోకాన్ని పరిశీలించటమంటే చేతనైనంత విస్తృతంగా లోకాన్ని చుట్టి తమకు అంతకుముందు పరిచితులు కాని మనుష్యుల్ని గురించి తెలుసుకోవటం, ప్రదేశాలను మాలిమి చేసుకోవడం, తద్వారా తనది అనుకుంటున్న తన చిన్న ప్రపంచంతో తులనాత్మక విశ్లేషణను సాధించడం!

మన దేశంలో ఇంచుమించు అందరూ ఏదో ఒక కార్యవ్యగ్రతవల్ల ఆ ఊరూ, ఈ ఊరూ తిరుగుతూనే వుంటారు. కొందరు పనేమీ పెద్దగా లేకపోయినా మనోల్లాసం కోసం వినోద పర్యటనలు చేస్తూనే వుంటారు. అయితే వీరందరూ పర్యటనానుభవంవల్ల తమకు తాము ఆనందాన్ని పొందుతుంటారే కాని, దాన్ని అక్షరబద్ధం చేసి నలుగురికీ పంచిపెట్టాలనుకోరు. ఆ పనిని ఈ గ్రంథంద్వారా చేసినవారు కామేశ్వరిగారు. ఈ గ్రంథ రచనా కాంక్ష వెనకగల ఉత్సాహ సంరంభాన్ని నేను అర్థం

చేసుకోగలను. తన అనుభవాలవల్ల మరో నలుగురు పర్యాటకులకు అవ సరమైన సమాచారం లభించాలన్నది ఆమె లక్ష్యం. ఆ విషయం ఈ గ్రంథంలో స్పష్టంగా తెలుస్తూనే వుంది.

యూరప్ అమెరికాలు చూచి రావాలనుకునే వారికి ఇది చక్కని ఆకర గ్రంథం. ఒక రకంగా మంచి 'కరదీపిక' యాత్ర ఎట్లా మొదలు పెట్టాలి నలుగురితో కలిసి ఏర్పాటు చేయబడిన యాత్రా కార్యక్రమంలో చేరిపోతే కలిగే సుఖాలు-చుట్టపక్కాలమీద ఆధారపడితే కలిగే అసౌక ర్యాలూ, ఊళ్ళో తిరిగేటప్పుడు పాటించాల్సిన చిట్కాలు-వీటన్నిటినీ ఈ పుస్తకంలో వివరంగా చూడగలం. ఈ రోజుల్లో ప్రతి కుటుంబం నుండీ ఒకరో ఇద్దరో పిల్లలు చదువుకోసమో, పెళ్ళి చేసుకోవడం వల్లనో, వెళ్ళి విదేశాలలో స్థిరపడిపోతున్నారు. అక్కడికి వెళ్ళాక స్వదేశానికి వచ్చే ప్రయత్నా లెవరూ చేయడంలేదు. అందువల్ల అటువంటి పిల్లల తలి దండ్రులో బంధువర్గమో, డబ్బు ఖర్చుకు వెనకాడకుండా విదేశీ సంద ర్శనం చేసే అవకాశాన్ని చేజిక్కించుకుంటున్నారు.

నిజానికి నేను కూడా మూడుసార్లు అమెరికా అంతా చుట్టచుట్టి వచ్చాను. డైరీలు వ్రాసుకున్నాను. జనజీవనాధ్యయనం చేశాను. కానీ ఆ వ్రాతల్ని గ్రంథరూపంలో కూర్చడానికి జాప్యం జరుగుతూ ఉంది. అందుకు రచనా ప్రక్రియపట్ల నాబద్ధకం ఒక వంకా, తీరికలేనితనం ఒకవంకా కారణాలు. ఈ విషయంలో ఈ గ్రంథాన్ని కూర్చిన కామేశ్వరిగారిని మన సారా అభినందిస్తున్నాను.

మన జీవన విధానంలో-రోజువారీగా చూసే చర్విత చర్వణతత్వం ఒక భూతంలా కనిపిస్తూ ఉంటుంది. "ఏం బ్రతుకులెస్తూ, గానుగెద్దుతంతు" అనుకునే క్షణాలు ఎదురవుతూనే ఉంటాయి. అందుకే జనం కొత్త ఉత్సా హాన్ని చిగురాకుల్లా మెలిపించుకోవడానికి ఈ యాత్రా కార్యక్రమం ఒక దోహదప్రక్రియ. అసలివి మన సంస్కృతిలో భాగం! కేవలం మనస్సుకు ఉల్లాసంకోసం కొన్నాళ్ళపాటు ఇల్లు వదిలి అటూ యిటూ తిరిగి రమ్మంటే ఎవరూ ముందుకుర్రారు. అందుకని తీర్థయాత్రలని పేరుపెట్టి పుణ్యసంపా

టన కోసమని మిషపెట్టి నడివయస్సు వారిని, వయోవృద్ధుల్ని యాత్రలకు తరిమే కార్యక్రమం మన సంస్కృతిలో భాగమే. ఈ పర్యటన విశేషా లన్నీ మన సంస్కృతి చరిత్రకు చేర్చదగిన కొత్త కొత్త అధ్యాయాలు.

అయితే మనదేశానికీ, ఇతర దేశాలకూ మధ్యగల సామాజిక నేప థ్యాల విభిన్నతలకు ఈ పర్యటన గ్రంథాలలో సముచితమైన స్థానం ఉండాలి. అప్పుడే విభిన్నతల మధ్య పూసలలో దారంలాగా కనిపించే ఏకత్వం. ఏ సంస్కృతినైనా పరిపుష్యం చేయగలుగుతుంది. మనుష్య జాతికి గల మౌలికమైన సమైక్యతత్త్వాన్ని ప్రకాశితం చేయగలుగు తుంది.

కామేశ్వరిగారు ముందు ముందు ఎన్నెన్నో పర్యటనలు చేయగల్గు తారు. అప్పుడు మాత్రం, పై అంశాన్ని సంభావించి, ఆమె రూపుదిద్దగోరే యాత్రాచరిత్రను సామాజిక సంస్కృతి చరిత్రగా కూడా తీర్చగలరని ఆశిస్తున్నాను. ఈ గ్రంథాన్ని జిజ్ఞాసువుల మధ్యకు ఆహ్వానం పలుకు తున్నాను. రచయిత్రికి శుభాకాంక్షలు అందిస్తున్నాను.

—నాయని కృష్ణకుమారి

5-4-97

# నా విదేశ యాత్రానుభవాలు

## [రచయిత్రి ముందుమాట]

ఈ 'నా విదేశ యాత్రానుభవాలు' వనిత మాసపత్రికలో సీరియల్‌గా వచ్చి అందరిమెప్పు పొందింది. చాలామంది మీ అనుభవాలు చదివాక విదేశయానం చెయ్యాలన్న కోరిక పుట్టింది, రచయిత మల్లాది అయినా నా అనుభవాలు వనిత చదివాకే యూరప్ చూడాలన్న కోరిక కలిగిందని చెప్పారు-ఇది ఎప్పటినుంచో పుస్తకంగా అచ్చొత్తించాలన్న కోరిక తీరలేదు. పబ్లిషర్ల యిబ్బందులు పబ్లిషర్‌వి-యిప్పుడింక నేనే ఆ పనికి పూనుకుని అచ్చొత్తించుకున్నాను. యూరప్, అమెరికా విదేశాలలో ప్రదేశాల వర్ణన (జాగ్రఫీ) కంటే అక్కడ అనుభవాలని పొందుపరిచేందుకు ప్రయత్నించాను. అమెరికాకంటే యూరప్ చూడాల్సిన దేశాలు—ప్రకృతిసిద్ధం అయితేనేం, చారిత్రాత్మకంగానైతేనేం, యూరప్ అందమైన దేశాల సముదాయం-డబ్బున్న ప్రతివాళ్ళు యూరప్ ఒక్కసారైనా చూసి రావాలి. ముఖ్యంగా హాలండ్, స్విట్జర్లాండ్ చూడాల్సిన అందమయిన దేశాలు. ఆ దేశాలు చూసివచ్చిన ఎవరికన్నా మనదేశం అన్ని విషయాల్లో ఎంత వెనకబడి వుందన్నది తట్టి బాధనిపిస్తుంది. ప్రజలకి చైతన్యం ప్రభుత్వంలో నిజాయితీ, ప్రజలలో సివిక్ సెన్స్ కొరవడినన్నాళ్ళూ ఏ దేశ ప్రగతి సాధించలేదన్నది స్పష్టం అవుతుంది—అరోడ్లు, అపరిశుభ్రత ప్రజలలో శుభ్రతపట్ల అవగాహన మనం యింకో వంద సంవత్సలకైనా సాధించగలమా అన్న ఆవేదన కలుగుతుంది. ఎన్నిదేశాలు తిరిగినా, ఎంత అందంగా, శుభ్రంగా ఆ దేశాలు వున్నా మళ్ళీ మన మాతృదేశాన్ని మించినది లేదనిపిస్తుంది. జననీ జన్మభూమిశ్చ అన్న నానుడి నిజం.



# తొలిసారిగా చూసిన నిజాయితీ

నిజాయితీ గురించి వ్రాస్తున్నప్పుడు అమెరికాలో బోస్టన్ర్లో మా అక్కకూతురు యింట్లో వున్నప్పుడు జరిగిన ఓ చిన్న సంఘటన చెపితే ఆ దేశంలో మనుష్యుల నిజాయితీ, ఆ దేశంలో వృత్తిపట్ల ఆఫీసర్లవనీండీ, వర్కర్లవనీండి వాళ్ళకున్న శ్రద్ధ, గౌరవం తెలియచేస్తుంది.

ఒక సాయంత్రం మా శారద, వాళ్ళాయన ఆఫీసునుంచి వచ్చి బ్రీఫ్‌కేస్‌లు, హాండ్ బేగ్ అవి మేడమీద బెడ్‌రూములో పెట్టివచ్చి డ్రాయింగ్ రూములో కూర్చుని అందరం మాట్లాడుతున్నాం. గాలికి కాబోలు బెడ్ రూమ్ తలుపులు మూసుకుపోయాయి. అవి ఆటోమాటిక్ లాకింగ్ సిస్టమ్ డోర్స్-ఆ డోరు ఎలా పడిపోయిందోగాని మొత్తానికి లాక్ అయిపోయింది అంటే తాళం లేనిదే డోరు మళ్ళీ తెరుచుకోదు. వాళ్ళిద్దరి దగ్గర చెరో తాళంచెవులు హాండ్‌బేగ్‌లో వుండిపోయాయి. బ్యాగ్‌లు బెడ్‌రూమలో వుండిపోయాయి. కారు తాళాలు కూడా బ్యాగ్‌లోనే ఉన్నాయి. రాత్రి వేరే రూమ్‌లో పడుకుని ఉదయంలేచి ఆఫీసుకి వెళ్ళాలన్నా బట్టలు-కారు తాళాలు అన్నీ అందులో వుండిపోవడంతో ఏం చేయాలో తోచక గాభరా పడిపోయాడు. అప్పటికే రాత్రి ఎనిమిదయింది. జీర్‌లాక్ కంపెనీకి ఫోన్ చేసి వేరే తాళాలకోసం ప్రయత్నించాలన్నా రాత్రి ఎవరుంటారు. ఓ గాడ్ అనుకుంటూ యిద్దరూ తలపట్టుకున్నారు. హటాత్తుగాశారద "ఫైర్ సర్వీస్ వాళ్ళకి ఫోన్‌చేద్దాం! అంటూ లేచి నెంబరు చూసి ఫోన్‌లో సంగతి చెప్పి హెల్ప్ చెయ్యమని కోరింది.

అంతే, ఐదునిమిషాలలో ఓ ఫైర్‌సర్వీస్ నించి ఓ ఆఫీసరు వచ్చేసాడు. ఫైర్ కాదుకనక గంటలు కాకుండా సైలెంట్‌గా వచ్చేసాడు. అతను

ఆరడుగుల పొడుగుతో బలిష్ఠంగా, బ్లూయూనిఫారం ధరించాడు. అతను లోపలికొచ్చి తాళం చూసి, రెండు మూడు రకాలుగా తీయడానికి ప్రయత్నించి రాకపోవడంతో చకచక బయటకి వెళ్ళి ఫైర్ లాడర్ (నిచ్చెన, అల్యూమినియంది) తీసుకుని బయటనించి బెడ్‌రూము కిటికీ దగ్గర నిచ్చెన వేసి స్క్రూడ్రైవర్‌తో విండో ఫ్రేం స్క్రూలు తీసాడు. (అక్కడ అన్నీ కర్ర ఇళ్లు విండో ఫ్రేం కర్రది, గోడలు, ఫ్లోరింగ్ అన్నింటికి చాలా మటుకు కలపే ఉపయోగిస్తారు. చందనాలవడం వల్ల కలప వుపయోగిస్తారు ఇళ్ళకి.( విండో ఫ్రేం తీసేసి లోపలికి దూకి డోర్‌లాక్ తీసేసాడు. రెండు నిమిషాలలో రాత్రి అయినా పాపం పిలవగానే వచ్చాడు. తన డ్యూటీ కాకపోయినా (ఫైర్, ఏక్సిడెంట్స్ అవి అయితేనే సాధారణంగా వాళ్ళని పిలుస్తారు) వచ్చి చేశాడు అన్న కృతజ్ఞతతో శారద ఓ పది డాలర్ల నోటు యివ్వబోయింది అతనికి "ఎక్స్యూజ్ మి, ఇఫ్ యుడోంట్ మైండ్ అంటూ ఆతను ఆ నోటు వంక ఒకసారి చూసి "వై మేడమ్, ఆర్ యునాట్ పేయింగ్ టాక్సెస్" అన్నాడు చిరునవ్వుతో. "అఫ్‌కోర్స్" అంది శారద. "దెన్ వైటుయు చేదర్ టూ పేమి, నో థ్యాంక్స్....గుడ్‌నైట్" అంటూ చకచక వేను తీసుకుని వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి ఆదృశ్యం నా మీద ఎంత గాఢ ముద్రవేసిందో చెప్పలేను. ఆ దృశ్యం చూస్తుంటే "ఎప్పటికయినా మన దేశం, మన ప్రజలు, మన గవర్నమెంట్, మన ఆఫీసర్లు ఆ స్థాయికి ఎదుగుతారా అన్న ఆలోచన వచ్చింది. అప్రయత్నంగా అతని మాటలకి కళ్ళు చమర్చాయి. ఎప్పడైనా ఇలాంటి దృశ్యం మనదేశంలో చూడగలనా అనిపించి కళ్ళు తడిఅయ్యాయి

ఎందుకంటే....అసలు నిప్పంటుకుంటేనే ఫోను చేసిన అరగంటకో గంటకో నిమ్మళంగా గంట గణగణ మోగించుకుంటూ వచ్చి ఆరిపోయిన నిప్పు మీద నీళ్ళు చల్లి బురదచేసి పోతుంది మన ఫైర్ డిపార్టుమెంటు ఇలాంటివి మా పని కదంటారు మన దేశంలో అయితే....అథవా వచ్చినా అరడజను మందిదిలాఇలలాడుతూవచ్చి—ఒకడు వేన్ డ్రైవ్ చేస్తే, మరొకడు

నిచ్చెన తెస్తాడు. మరోకడు నిచ్చెనపట్టుకుంటే, ఇంకోడుఎక్కుతాడు ఒకడు స్క్రూడ్రైవరు అందిస్తాడు. పని అయ్యాక నల్గురూ వచ్చి నిలబడి చేతులు చాస్తారు. పదో పదిహేనో ఇస్తే "ఇంతేనా, మేం నల్గురం" అంటూ దబాయించి మరీ పుచ్చుకుంటారు. అక్కడలా డ్యూటీలో వున్న ఒక్క ఆఫీసరూ తనే వ్యాన్ నడుపుకుంటూ, ఒక్కడే అంత బరువు నిచ్చెన అవలీలాగా మోసి కిటికీ ఎక్కి పని పూర్తి చేసి, డబ్బిచ్చినా తీసుకోకుండా మీరు పన్నులు కడ్తున్నది ఇలాంటి అవసరాలకోసమే అంటూ మృదువుగా తిరస్కరించి వెళ్ళిపోయినా ఆ ఆఫీసరు డ్యూటీ బాధ్యత మనదేశంలో ఎప్పటికయినా చూడగలమా అన్పించింది.



# నా విదేశ యాత్రానుభవాలు

## — డి. కామేశ్వరి

---

ఇది వరకు చాలామంది దేశాలు తిరిగి వచ్చి ఆ వింతలు, విశేషాలు, అనుభవాలు గురించి చాలాసార్లు పత్రికలలో వ్యాసాలు రాశారు-'వనిత'లోనూ వచ్చాయి. ఈనాడు చదువుకున్న అందరికి విదేశాల గురించిన జాగ్రఫి-హిస్టరి కాస్తో కూస్తో తెలుసు— అందులో మన చిన్నప్పుడు ఇంగ్లండు, యూరప్ దేశాల గురించి చదువుకున్న వాళ్ళం కనక చాలామటుకు ఆ దేశాల నైసర్గిక స్థితులు, చరిత్రలు తెలుసు— అందుకే ఈసారి నేను చూసిన స్థలాలకి ఎక్కువ ప్రాముఖ్యం యివ్వకుండా అక్కడి ప్రజల గురించి, వారి పురోభివృద్ధి—మనకు వారికి గల మౌలికమైన తేడాలు, అక్కడి స్త్రీల గురించి, వారి జీవన రీతుల గురించి, విదేశాలు చూడాలనుకున్నవారికి ఎలా వెడితే సౌకర్యమో, డబ్బుతక్కువో వగైరా గురించి రాద్దామనుకుంటున్నాను.

ఇంచుమించు పదేళ్ళబట్టి విదేశాలు చూడాలన్న నా కోరిక యీనాటికి తీరింది. నేను రచయిత్రి నయ్యాక కాస్తోకూస్తో డబ్బు కూడ బెట్టిన దగ్గిరనించి దేశాలు తిరిగి చూడాలనుకునేదాన్ని ఇష్టం వచ్చినట్టు వేలు లక్షలు ఖర్చుచేసి తిరిగి రావడానికి లక్షలు లేవు. కానీ నా స్వంత సంపాదన చేతికి వచ్చాక అది కూడబెట్టి ఆ డబ్బు యింత బాగా సద్వినియోగపరచగల్గినందుకు నిజంగా నాకు చాలా సంతోషంగా గర్వంగా వుంది. ఇన్నాళ్ళు సంసార బాధ్యతలు పిల్లల చదువులు, అమ్మాయిల పెళ్ళిళ్ళు అబ్బాయి ఉద్యోగం అన్ని అయ్యాక బాధ్యత తీరి ఖాళీ దొరికింది. మామామయ్య న్యూయార్క్‌లో వున్నాడు. ఎన్నోసార్లు అమెరికా

రా అంటూ పిలిచేవాడు గత పదేళ్ళుగా. మూడేళ్ళ క్రితం మా అక్క బావ అమెరికా వెడుతూ రమ్మని పిలిస్తే అప్పుడు కుదరక వెళ్ళడం పడలేదు. "అమెరికా ఏం చూస్తావు చూడాలనుకుంటే యూరప్ చూడాలి. అమెరికా ఉత్త మోడర్న్ సిటీస్ తప్ప ఏం వుంది" అన్నారు యూరప్ చూసొచ్చిన మావారు, మిగతా కొందరు. ఆయన ఉద్యోగరీత్యా యూరప్‌లో అన్ని దేశాలు చూసొచ్చారు కనక ఆయనకి మళ్ళీ చూడాలని లేదు. యూరప్ అంటే కంపెనీ కావాలి. ఆర్గనైజ్‌డ్ టూర్స్‌లో అన్ని ఏర్పాట్లు వాళ్ళు చూసినా మన బంధువులో, ఫ్రెండ్సో ఎవరూ లేకుండా ఒంటరిగా వెడితే ఏం ఎంజాయ్ చేయగలను అని వాయిదా వేశాను చాలా రోజులు. ఆఖరికి ఈ జూలైలో మా అక్క బావ ఈసారి యూరప్ చూసి అమెరికా వెడతాం నీవు రా అన్నారు (వాళ్ళ అమ్మాయి శారద బోస్టన్‌లో వుంది.) సరే తోడు దొరికింది అని సంతోషంగా ప్రయాణం నిశ్చయించాను. మేం బయలు దేరుతున్నాం అని తెల్సి మా వైజాగ్ చెల్లెలు కూడా ప్రయాణం అయింది.

మేము యూరప్ టి.సి.ఐ. గ్రూపు ఆర్గనైజ్‌డ్ టూర్‌లో వెళ్ళాలని నిర్ణయించుకున్నాం. ఆ ఏర్పాటులన్నీ బావగారు చేశారు. మనకి ముందుగా ఏ దేశం వెళ్ళాలన్నా కావల్సింది పాస్‌పోర్టు. తరువాత వీసా. మనం తల్చిస్తే టి.సి.ఐ. సీతా ట్రావల్స్, ట్రేడ్ వింగ్స్ లాంటివారు పాస్ పోర్టు ఏర్పాట్లు చేస్తారు. అక్కడికి వెడితే ఆ వివరాలు, నింపాల్సిన ఫారాలు, ఫోటోలు వివరాలన్ని వాళ్ళే చెపుతారు. పాస్‌పోర్ట్ వచ్చే ఏర్పాట్లు వాళ్లే చూస్తారు. పాస్‌పోర్ట్ వచ్చాక వీసా కోసం (అమెరికాకి) మద్రాసు వెళ్ళి తెచ్చుకోవాలి. యూరప్‌లో అన్ని దేశాలకి, ఇంగ్లండుకి టి.సి.ఐ. వారే అరేంజ్ చేశారు. మేం యూరప్ అంతా టి.సి.ఐ. ఆర్గనైజ్‌డ్ టూర్‌లో వెళ్ళడానికి నిర్ణయించాం— విదేశాలు వెళ్లాలనుకున్నప్పుడు మనంతట మనం అన్ని ఏర్పాట్లు చేసుకు వెళ్లడం చాలా కష్టం, శ్రమ ఖర్చుతో కూడుకున్న పని. మరీ మన దగ్గర లక్షలుండి, విచ్చలవిడిగా ఖర్చుపెట్టగలిగే స్తోమత వున్నప్పుడు ఎవరంతట వాళ్ళ

వెళ్ళి యిష్టం వచ్చిన హోటళ్ళలో వుండి, చూడదల్చినవి చూసి రావచ్చు. అదీ హోటల్ బుకింగ్స్ భాష సైట్ సీయింగుకి ఏఏ ప్రదేశాలు, ఎక్కడ ఎలా వెళ్ళి రావాలి అన్నదంతా చాలా ప్రయాసతో కూడినది. మన బడ్జెట్ లిమిటెడ్ అయినపుడు విదేశాలలో బోర్డింగ్, లాడ్జింగులు, ప్లేను చార్జీలు మనంతట మనం ఏర్పాటు చేసుకోడం చాలా ఖర్చు ముఖ్యంగా యూరప్ అంతా భాషతో చాలా ప్రాబ్లమ్స్. ఫ్రాన్స్, జర్మనీ, హాలండ్, రోమ్, స్విజర్లెండు యీ దేశాలన్నింటిలో యింగ్లీషు వచ్చినంత మాత్రాన ప్రయోజనం వుండదు. మనం యింగ్లీషులో అడిగితే చాలామందికి అర్థం కాదు! భాష సంగతి అలా వుంచి, ఓ మామూలు రకం హోటలు రు. 100 డాలర్లు మనం బుక్ చేసుకుంటే అవుతుంది. అదే గ్రూప్ బుకింగ్ చేస్తే వారికి నలభై డాలర్లకే వస్తుంది. ఈ ఆర్గనైజ్‌డ్ టూర్స్‌లో ప్లేన్ టిక్కట్లు, హోటలు వసతులు అవన్నీ చాలా కన్సెషన్స్‌లో దొరుకుతాయి వారికి. మనంతట మనం వెడితే గ్రూప్‌లో వెళ్ళినదానికి రెట్టింపుపైనే అవుతుంది. అంచేత ఎవరయినా సరే విదేశయాత్రకి వెళ్ళదల్చిన వారు ఆర్గనైజ్‌డ్ టూర్స్‌లోనే వెడితే సుఖం. ఈ టి.సి.ఐ. టూర్ రెండు రకాలుంటుంది. కేవలం యూరప్ ఇంగ్లడ్ టూరు అయితే మొత్తం 11 ప్రదేశాలు, 21 రోజులు టూర్. ఇంగ్లండు, ఫ్రాంక్‌ఫర్ట్, ఆమెస్టర్‌డామ్, జూరిచ్, ఆస్ట్రియా, పారిస్, రోమ్, వెనీస్, పీసా, స్విజర్లెండు, కొలోన్ ప్రదేశాలు చూపిస్తారు ఇంగ్లండు వరకు ప్లేన్, అక్కడి నించి మళ్ళీ ఆమ్‌స్టర్‌డామ్‌కు యింకో ప్లేను. ఆమ్‌స్టర్‌డామ్ నించి మొత్తం యూరప్ అంతా రోడ్డు మీద కోచ్‌లో తిప్పి చూపించుతారు—ఆఖర్న డోవర్ మీద బోటు ప్రయాణం చేసి లండన్ చేర్చుతారు. యూరప్, అమెరికా కంబైన్డ్ టూర్ అయితే అమెరికాలో 11 స్థలాలు, యూరప్ లండన్, పారిస్, రోమ్, స్విజర్లండ్ మాత్రం చూపిస్తారు. అమెరికా పూర్తిగా టూర్‌లో వెళ్ళి చూడాలనుకునే వారికి కంబైన్డ్‌టూరు సరిపోతుంది—కాని యూరప్ పూర్తిగా చూడాలనుకుంటే యూరప్, యు.కె. టూర్‌లో వెళ్ళాలి. వెళ్ళదల్చిన వారికి ఈ యూరప్ టూర్‌తో రెండు రోజులు మాస్కో కూడా చూపించుతారు చాలా కన్సెషన్ రేటుతో.

మేము యూరప్ పూర్తిగా చూడాలి అనుకున్నాం— అమెరికాలో మా బంధువులు చాలా మంది చాలా చోట్ల వున్నారు— బోర్డింగు, లాడ్జింగ్‌కి ఫరవాలేదు. అమెరికా ఎలాగైనా చూసేయగలం. యూరప్ కండక్టడ్ టూర్‌లో వెళ్లి అమెరికా మా అంతట మేం చూడచ్చు అని నిర్ణయించుకున్నాం. మా అక్క వాళ్ళు అమెరికా మూడేళ్ల కిందటే చూశారు కనక వాళ్ళు యూరప్ అంతా చూడాలని నిర్ణయించుకున్నారు.

వాళ్ళ యూరప్ టూర్ అయ్యాక అమెరికాలో వాళ్ళ అమ్మాయి దగ్గర వుండిపోతే నేను మా చెల్లెలు అమెరికా అంతా ఒక్కొక్కటీ నెమ్మదిగా చూడాలని నిర్ణయించుకున్నాం.

ఈ టూర్స్ సాధారణంగా జూన్ నించి సెప్టెంబరు వరకు వుంటాయి. ఎందుకంటే యూరప్, అమెరికాలలో జులై నించి సెప్టెంబరు వరకు వారికి ఎండాకాలం. ఆ టైములో అయితే చలి లేకుండా హాయిగా వుంటుంది. అక్కడ కూడా అది టూరిస్ట్ సీజన్. వాళ్ళ సమ్మర్ మన వింటర్‌లా వుంటుంది. జూన్ వరకు కూడా కొన్ని చోట్ల చాలా చలిగా వుంటుంది— మే వరకు అసలు మంచు కరగదు కనక బెస్ట్ సీజన్— జులై, ఆగస్టు నెలలు ప్రయాణానికి.

ఈ యూరప్ టూర్‌కి మొత్తం మనిషికి ముప్ఫైవేలు అవుతుంది. రాను పోను టిక్కట్టు 18,500 + 2 వేలు వీసా చార్జీలు. అది కాక ప్రతి ప్రయాణీకునికి రిజర్వ్ బ్యాంకు 500 డాలర్లు ప్రయాణం ఖర్చుల కింద రూపాయలు తీసుకుని డాలర్లు యిస్తుంది. ఆ 500 డాలర్లలో 300 డాలర్లు మనం టి. సి. ఐ. వారికి యివ్వాలి. ఎందుకంటే అక్కడ మన బసవసతి. భోజన సదుపాయాలకి డాలర్లతో వారు ఖర్చు పెట్టాలి. ఆ డాలర్లు వాళ్ళకి ప్రభుత్వం యివ్వదు. అంచేత ఆ డబ్బు మన దగ్గర వసూలు చేస్తారు. మూడు వందల డాలర్లు అంటే రు. 6,500 అంటే మొత్తం 18,500 + 2,000 + 6,500 = 27,000 అవుతుంది వారికివ్వాల్సింది. అంటే మనకి ఖర్చుకి యింకా 200 డాలర్లుంటుంది. అదీ కాక బొంబాయి గాని, ఢిల్లీ వరకు చేరడం మనదే బాధ్యత. టి.సి.ఐ.

వాళ్ళు మనకి ఏ హోటల్లో దిగితే ఆ హోటల్లో ఉదయం బ్రేక్‌ఫాస్టు అరేంజ్ చేస్తారు. రాత్రి డిన్నరు వాళ్ళదే—ఇండియన్ రెస్టరెంట్సు వున్న చోట (నార్త్ యిండియన్ టైపు భోజనం) రాత్రి డిన్నరుకి తీసుకు వెడతారు. బ్రేక్‌ఫాస్ట్. డిన్నరు వాళ్ళదే....కాని లంచ్‌కి మనమే ఖర్చు పెట్టుకోవాలి సాధారణంగా లంచ్ టైముకి సైట్ సీయింగులో వుంటాం కనక ఏ స్నాక్సో తినే వాళ్ళం. పొటెటో ఫ్రెంచి ఫ్రై, కోక్, బిస్కట్లు, బ్రెడ్ జామ్, లేదంటే కావల్సిన వారికి ఎక్కడబడితే అక్కడ రెస్టరెంట్స్ వుంటాయి—ఎవరికేది కావాలంటే అది కొనుక్కు తినచ్చు-అంటే లంచ్ ఖర్చు మనది. వెళ్ళిన గుర్తుగా ఏదో ఒక చిన్న సావనీర్ కొనక మానం. మధ్యలో కూల్‌డ్రింక్స్, కాఫీలు వగైరా ఖర్చులుంటాయి—అవి కాక పారిస్ "లిడోషో" (నైట్ క్లబ్బు డాన్సులు) 80 డాలర్లు ఎవరిది వారే పెట్టుకోవాలి. అక్కరలేని వారు మానవచ్చు-కాని పారిస్ దాకా వెళ్ళాక లిడోషో చూడకుండా రావడం ఏమిటి? మళ్ళీ మళ్ళీ మనం వెళ్ళం కదా అన్పిస్తుంది-అదీ కాక కొన్ని కొన్ని చోట్ల వాళ్ళ ఇటినరీ (ప్రోగ్రాం చార్ట్) లో లేని మ్యూజియంలు వగైరా చూడాలనుకుంటే ఎంట్రన్స్ ఫీజులు అవీ వుంటాయి. ఈ ఖర్చులన్నీ కల్పి మనం ఏం కొనకుండా క్లుప్తంగా ఖర్చుపెట్టుకుంటే యూరప్ యాత్రకి మాత్రం ముప్పై వేలు ఖచ్చితంగా అవుతుంది—అమెరికా కూడా వెళ్ళదలిస్తే 45 వేలు అవుతుంది. కంబైన్డ్ టూర్‌లో యూరప్ తక్కువ చూసి అమెరికా అంతా చూడదల్చిన వారికి 45 వేలు యిటు అటు అవుతుంది—అలా కాక యూరప్ అంతా టూరులో చూసి అమెరికా మీ అంతట మీరు చూడదల్చుకుంటే కూడా యించుమించు అంతే అవుతుంది. ఎటొచ్చీ అమెరికాలో మీరుండడానికి ప్రతి చోట బంధువులు వుండక పోతే బోర్డింగు, లాడ్జింగ్ చార్జీలు చాలా అవుతాయి. మేము అమెరికాలో చూడదల్చిన ప్రదేశాలకి ఇండియాలోనే 'వీసా' టిక్కట్లు కొనుక్కొన్నాము. 5,000 రూ॥లకి 7 చోట్లకి వెళ్ళడానికి ప్లేను చార్జీలు అవి. ఇక్కడ రూపాయిల్లో కాకుండా అక్కడికి వెళ్ళాక అమెరికాలో డాలర్లలో కొనుక్కోవాలంటే మనకి

వాలర్లుంటాలి. చాలా ఎక్కువ అవుతుంది. డబ్బు. మేము న్యూయార్క్- వాషింగ్టన్, లాస్ ఏంజిల్స్, శాన్‌ఫ్రాన్సిస్కో మియామి—ఓర్లెండో (డిస్నీవరల్డ్), బోస్టన్, హోస్టన్ వూర్లు చూశాం—మా బంధువులు న్నారు గనక మాకు కేవలం ప్లేను టిక్కెట్లు, తరువాత సైట్ సీయింగ్ ఖర్చులు, మ్యూజియం. డిస్నీలాండ్ లాంటి చోట్లకి ఎంట్రన్స్ టిక్కెట్లు, వగైరాలన్నీ కలిపి టిక్కెట్లు 5,000 కాక మరో 5 వేలు అయింది. మనం కొనుక్కొనే సామాను కాక కేవలం ప్రయాణం ఖర్చులకి 40 వేలు ఖచ్చితంగా అవుతుంది. అదీ మనం వెళ్ళిన ప్రతిచోటా ఎవరో బంధువు లుండి ఎయిర్ పోర్టుల నించి తీసుకొచ్చి. దిగబెట్టి, యింట్లో వుంచుకుని, చుట్టు పక్కలకి కార్లలో తీసికెళ్ళే బంధువులో, మిత్రులో వుంటేనే అంతలో అవుతుంది. లేదంటే కేవలం అమెరికా ట్రిప్పుకే 50 వేలు పైన అవుతుంది....అన్నిచోట్ల మాకు బంధువులు, స్నేహితులున్నా అయ్యో.... 'టి. సి. ఐ. టూర్ లోనే వెళ్ళి వుండాల్సింది తప్పు పని చేశాం యిలా వచ్చి' అన్పించింది. ఎంచేత అంటే ఎంత బంధువులైనా భోజనం అంటే పెట్టి ఇంట్లో వుంచుకుంటారు గాని వాళ్ళు మనతోపాటు వచ్చి తిప్పి చూపించాలంటే అమెరికాలో ఒక చోట నించి ఒక చోటకి చాలా దూరాలు అదీ కాక అక్కడ ఆడమగ అంతా ఉద్యోగాలు చేస్తారు. మనకోసం శలవు పెట్టాలంటే వాళ్లకి శలవులు దొరకవు. వాళ్ళని యిబ్బంది పెట్టి మనం మొహమాటపడే కంటే కాస్త ఎక్కువైనా కండక్టడ్ టూర్‌లో వెడితే నిశ్చింతగా వెళ్ళిరావచ్చు. ఆ బాధలన్నీ వాళ్ళేపడతారు— చూడా ల్సినవన్నీ వాళ్లే చూపిస్తారు. అంతగా మన దగ్గర బంధువులుంటే తిరిగి వచ్చేటపుడు ఓపెన్ టిక్కెట్టు తీసుకుని మన బంధువుల దగ్గర నాల్గు రోజులుండి మన యిష్టం వచ్చినపుడు తిరిగి వస్తే మనకి వాళ్లకి సుఖం. వాళ్ళు ఏదన్నా చుట్టుపక్కల చూపించాలంటే వీకెండ్స్‌లోకాని వాళ్ళకి వీలు కాదు. అంచేత నా సలహా ఏమంటే సైట్ సీయింగుకి వెడ్తున్నప్పుడు ఎవరి మీద ఆధారపడకుండా కండక్టడ్ టూర్‌లో వెళ్ళిరావడం చాలా మంచిది.

సరే, మేము జూలై 5 న, ప్లేనులో బొంబాయి నించి బయలు దేరి లండన్ వెళ్లడానికి టిక్కట్లు అన్నీ బుక్ అయ్యాయి. వెళ్లే ముందు మీకు సామాను గురించి కొంచెం చెప్పడం మంచిది. ముందుగా లండన్ వెడతాం గనుక అక్కడ 20 కేజీలకు మించిన సామానువుంటే చాలా ఎక్స్‌ట్రా చార్జి అవుతుంది. మీరు కేవలం యూరప్ మాత్రం వెళ్ళివచ్చే ట్లయితే ఏం సామాను తెచ్చుకోడానికి అవదు.. తెచ్చినా చాలా డబ్బు కట్టాల్సి వుంటుంది.

అంచేత వెళ్ళేటప్పుడు వీలయినంత పెద్దదితేలికగా వుండే సూట్ కేసు తీసుకెళ్ళండి. ఒక సూట్ కేసు, ఓ షోల్డర్ బ్యాగు వుంటే చాలు. షోల్డర్ బ్యాగు తూచరు కనక మీరు మోయగల్గినంత బరువు పెట్టచ్చు. అది డైరక్టుగా ప్లేనులోకి తీసుకెళ్ళొచ్చు. సూట్ కేస్ మాత్రం తూచి చెకిన్ చెయ్యాలి. అంటే ఆ లగేజి బాధ్యత వారిదే. మీరు వీలయినన్ని తక్కువ బట్టలు, లైట్ వెయిట్‌వి పట్టికెడితే వచ్చేటప్పుడు ఏం కొంచెం సామాను కొన్నా తీసుకొచ్చుకోడానికి వీలుంటుంది. జూలై, ఆగస్టు నెలలు అక్కడ చాలా తక్కువ చలి. (యించు మించు వుండదు). అనవసరంగా బోలెడు ఉలెన్స్ తీసికెళ్ళకండి—ఒక లైట్ స్వెట్టర్, ఒక షాల్, ఒక మఫ్లర్ చాలు అంతగా చలి అనిపించిన చోట వేసుకోడానికి. యూరప్ దేశాలలో వాతావరణం చాలా ఆహ్లాదంగా వుంటుంది. కనక చెమట వుండదు. రోడ్లు పరిసరాలు శుభ్రంగా వుంటాయి కనక దుమ్ము ధూళి. ప్రసక్తి లేదు కనక మీరెంత తిరిగినా మీ బట్టలు మాయవు. చెమట వాసన వుండదు. మీరు కాటన్ చీరలు ఎంత మాత్రం తీసికెళ్ళవద్దు. లైట్‌గా వుండే నైలెక్స్‌లు, షిఫాన్స్, జరీ లేని లైట్ పట్టు చీరలు, ప్రింటెడ్ సిల్కు చీరలు లాంటివి ఓ పది చాలు—ఇస్త్రీ అక్కర లేనివి, ఉతక నక్కరలేనివి చీరలు తీసికెడితే మార్చి మార్చి కట్టచ్చు. రంగులకి సరి పోయే పరికిణీలు 4,5 మ్యాచింగు జాకెట్లు పెట్టుకోండి. ప్రతి హోటలులో తువ్వాళ్ళ సప్లయ్ వుంటుంది కనక తువ్వాళ్ళు అక్కరలేదు. అంతగా కావాలనుకుంటే పల్చటిది ఒకటి తీసుకోండి. మీ పెట్టెలో సగం వరకే

సామాను పెట్టుకుంటే వచ్చేటప్పుడు ఏమన్నా తెచ్చుకునే వీలుంటుంది. వెళ్ళేటప్పుడే అనవసరంగా బోలెడు బట్టలు తీసికెడితే వచ్చేటప్పుడు ఏమన్నా కొనుక్కున్నవి తెచ్చుకోడానికి యిబ్బంది అవుతుంది. టాయ్‌లెట్ సామానులో ఒక నూనె సీసా, షాంపూ, ఒక పెద్ద టూత్ పేస్టు, మేకప్ సామాను చిన్న పోచ్ తయారు చేసుకోండి హోటలులో ప్రతిచోట సబ్బులు యిస్తారు. ఒక బట్టల సబ్బు మాత్రం తీసికెళ్ళండి—ఎంత ఎంత చెమట, దుమ్ము లేకపోయినా అండర్ వేర్స్, బనియన్స్, పరికిణీ, బ్రాసరీలు ఒకసారి వేసుకున్నవి ఉతక్కుండా వేసుకోడం మనకీ అలవాటు లేదు. అంచేత రాత్రి హోటలు చేరాక కాస్త ఉతికి బాత్‌రూంలో ఆరేస్తే ఉదయానికి ఎండిపోతాయి. యూరప్‌లో చాలా హోటళ్ళలో బాత్‌రూంలో హీటింగ్ సిస్టమ్ పైపులు, బార్స్ వుంటాయి. వాటి మీద ఎండేస్తే తొందరగా ఎండిపోతాయి—ఒక జత కెట్స్, ఒక చెప్పుల జత, ఒక బాత్‌రూమ్ స్లిప్పర్స్ మాత్రం వుండాలి. సైట్ సీయింగ్ అప్పుడు చాలా చోట్ల ఎక్కువ దూరం గబగబ నడవాలి కనక కెట్స్ వేసుకుంటే నడక సుళువు. చలి వున్నా అవి వేసుకుంటే బాగుంటుంది. రెండు నైట్ గౌన్లు పట్టుకెళ్తే రాత్రి జారిపోయే సిల్కు చీరలతో నిద్రపోనక్కరలేదు—పెట్టె సంగతి అయ్యాక యింక షోల్డర్ బ్యాగు సంగతి చూద్దాం—ఆ బ్యాగులో టాయ్‌లెట్ కిట్ అవి పెట్టాక వీలయినన్ని తినుబడి సామాను చేసి తీసికెళ్ళండి. మధ్యాహ్నం మనకి వాళ్ళు లంచ్ యివ్వరు గనక తిరుగుతున్నప్పుడు తినడానికి నిలువ వుండే జంతికలు, మిక్చర్, చేగోడీలు, రవ్వ లడ్డు, లడ్డు, మైసూరు పాక్, వేరుశనగ వుండలు యిలా 5,6 రకాలు 20 రోజులకి సరిపోయేవి ప్లాస్టిక్ బ్యాగుల్లో సర్ది సీల్ చేసి తీసికెళ్ళండి. యూరప్‌లో ఫుడ్ చాలా ఖరీదు. మనం ఏం కొనుక్కుని తినాలన్నా డాలర్లలో ఖర్చు పెట్టాలి—అనవసరంగా తిండి మీద డబ్బు అంతా ఖర్చు పెట్టకుండా వీలయినంతవరకు ఆ ఖర్చు తగ్గించుకుంటే ఏమన్నా సామాను కొనుక్కోవచ్చు ఆ డబ్బుతో. మనకి అక్కడ ఎవరన్నా బంధువులు, స్నేహితులు వుండి డాలర్లు యిస్తే పరవాలేదు. గాని లేకపోతే రూలు ప్రకారం రిజర్వ్

బ్యాంక్ యిచ్చిన 500 డాలర్లలో 300 టి. సి. ఐ. కిచ్చేస్తే మిగిలేది 200 డాలర్లు మనకు. ఇండియా నించి చాలా మంది చాటుగా డాలర్లు బ్లాకులో 15 రూ॥లకి కొని తీసికెడతారు—సామాను కొనడానికి. మీకు స్తోమత వుండి చాలా డాలర్లు తీసికెడితే తూచి తూచి ఖర్చు పెట్టక్కర లేదు గాని లిమిటెడ్ బడ్జెట్ అయితే మాత్రం తినుబడి సామాను తీసికెడితే మధ్యాహ్నం లంచ్ ఖర్చు తగ్గించవచ్చు. మాతో వచ్చిన గుజరాతీలు కొందరు నిలవవుండేట్టు గోధుమ రొట్టెలు, ఉప్పు, కారం, జీలకర్రపొడి అవీ వేసి పెనం మీద కాల్చినవి తెచ్చుకుని ఊరగాయ అవీ తెచ్చుకొని పది రోజులు తిన్నారు. ఒక అరవవాళ్ళు ఉప్మా పోపు, నూక అన్నీ వేయించి ఉప్పుతో సహా వేసి పేకట్టులో తెచ్చుకుని, చిన్న రైస్ కుక్కర్ తెచ్చుకుని రెడీమేడ్ ఉప్మా చేసుకున్నారు. మీతో ఒక ఫ్లాస్కు, నెస్‌కాఫీ, పాలపొడి, పంచదార తీసికెడితే టీ, కాఫీ లాంటివి చేసుకోవచ్చు. ఉదయం 8 గం॥ల వరకు బ్రెక్‌ఫాస్ట్ వరకు కాఫీ యివ్వరు. ఉదయమే కాఫీ అలవాటున్నవారు రూములో చేసుకోవచ్చు. అందరు చిన్న యిమ్మర్‌షన్ హీటర్ తెచ్చుకుని కాఫీ, టీలకి వాడుకున్నారు. మీ ఓపికని బట్టి సామాను తీసుకెళ్ళొచ్చు. అవన్నీ షోల్డర్ బ్యాగులో సర్దుకోవాలి. ఇరవై రోజులలో బ్రెడ్, నార్త్‌యిండియన్ భోజనం తిని నోరు చచ్చుబడ్తుంది కనక చిన్న జామ్ సీసాలతో రెండు మూడురకాల ఊరగాయలు నూనె కారనివి పెట్టుకోండి. పూర్తిగా తినుబండారాలతో ఆ బ్యాగు నింపితే వచ్చేటప్పుడు అన్నీ ఖాళీ అయితే కొనుక్కున్న వస్తువులు తెచ్చుకోవచ్చు—అసలు సామాను కొనుక్కోడానికి యూరప్‌లో చాలా ఖరీదు అన్నీ. యూరప్ మాత్రం చూసి తిరిగి వచ్చే వరకు ఏం కొనుక్కోవాలన్నా లండన్‌లో కొనుక్కునేట్టు ప్లాన్ చేసుకోండి. మిగతా చోట్ల కంటే లండన్ చవక. కొన్ని సామాన్లు స్విడ్జర్లెండ్‌లో చవక అన్పించింది. అన్నింటి కంటే పారిస్ మహా ఖరీదు. ఆహార పదార్థాల దగ్గరనించి ఏ వస్తువూ చాలా ఖరీదు—సరే సామాను సంగతి అయింది. ఇంక ప్రయాణానికి వద్దాం—

అన్నట్లు చిన్న చిన్న వాటికి మందులు తలనొప్పి. జలుబు, దగ్గు, విరోచనాలు, అరగడానికి కొంచెం మాత్రలు తీసికెళ్ళండి—యూరప్, అమెరికాలలో మందులు డాక్టరు ప్రిస్క్రిప్షన్ లేకుండా యివ్వరు—డాక్టరు చాలా ఖరీదు కనక కొద్దిగా మందులు తీసుకోండి. మీరే ఊరు నించి బయలు దేరినా బొంబాయి నించిగాని ఢిల్లీ నించి గాని ప్లేను బయలు దేరుతుంది. మేము హైదరాబాదు కనక బొంబాయి దగ్గరఅని బొంబాయి నించి Pan amలో బయలుదేరడానికి నిర్ణయించాం. మనం బొంబాయి వెళ్ళి అక్కడ టి. సి. ఐ. ఆఫీసులో మన టిక్కెట్లు, పాస్‌పోర్ట్, వీసాలు, మిగతా కాగితాలు, ఎయిర్ పోర్టులో యిచ్చే 20 డాలర్లు అన్నీ అక్కడ యిస్తారు. బొంబాయి నించి యూరప్‌తో వాళ్ళ గ్రూపు లీడరు ఒకరు మనతో బయలు దేరుతారు. ఒక్కొక్కసారి బొంబాయిలో మనతో బయలుదేరకపోయినా లండన్‌లో వచ్చి కలుస్తారు.

బొంబాయిలో ప్లేను తెల్లవారు ఝామున 5.50కి బయలు దేరుతుంది. అంటే మనం సెక్యూరిటి చెక్ కోసం 3 గంటలకల్లా బొంబాయి ఏర్‌పోర్టులో వుండాలి. అన్నట్టు బొంబాయిలో టి. సి. ఐ. ఆఫీసు వాళ్లు వాళ్ళ పేరున్న ఒక షోల్డర్ బ్యాగు ప్రతీవాళ్ళకీ యిస్తారు—మన సామాను ఆ బ్యాగులో సరిపోతే సర్దుకోవచ్చు. లేదంటే ఆ బ్యాగులో మన కాగితాలు, పాస్ పోర్టులు, చిన్న సామాను పెట్టుకోవచ్చు—ఆ బ్యాగుంటే ఫలానా టి. సి. ఐ. గ్రూపు వాళ్ళని అందరూ ఒక చోట చేరడానికి వీలుగా వుంటుందని యిస్తారు.

బొంబాయిలో ఎయిర్ పోర్టులో గ్రూప్ లీడర్ కనపడ లేదు. వాళ్ళ తాలూకు మనిషి వచ్చి లండన్‌లో వస్తారు అని చెప్పాడు. మాస్కో వెళ్ళిన ప్రయాణీకులతో వచ్చి కలుస్తారు లండన్‌లో—అని చెప్పాడు. బొంబాయి ఏర్‌పోర్టులో నలుగురైదుగురు టి. సి. ఐ. బ్యాగుల వాళ్లు కన్పించారు. పరవాలేదు మనతో కొందరున్నారు అనుకున్నాం. బొంబాయి నించి లండన్‌కి మొత్తం 12 గంటలు ప్రయాణం. మధ్యలో $1\frac{1}{2}$ ఫ్రాంక్‌ఫర్ట్‌లో ఒక గంట ఆగుతుంది. ఫ్యూయల్ నింపుకోడానికి, కాట

రింగ్ సామాను వగైరా నింపుకోడానికి. మనకి ఇంగ్లండ్, 5 1/2 గంటల తేడా వెనక్కి వుంటుంది. అంటే ఫ్రాంక్ ఫర్ట్ చేరే సరికి వారి టైము ప్రకారం ఉదయం 8 $\frac{1}{2}$ అన్నమాట. ఒకొక్కొక్కసారి ప్లేను మార్చేస్తారు. ఫ్రాంక్ ఫర్ట్ ముఖ్యమైన విమాన కూడలి స్థలం. ఇండియా నించి, రష్యానించి, అమెరికానించి, అమెరికాకి ఏ దేశం నించన్నా ప్రతి విమానం ఫ్రాంక్ ఫర్ట్ మీదుగా వెడ్తుంటాయి. సాధారణంగా—ప్రతి దేశం ప్లేనులు ఆగుతాయి—కనక్షన్ ఫ్లైట్స్ వుంటాయి—నిముషానికో ప్లేను వచ్చి ఆగుతుంటుంది అక్కడ. ఫ్రాంక్ ఫర్ట్ ఎయిర్ పోర్టు ఎంతో పెద్దది. ఆధునికంగా, అందంగా, నీట్ గా విశాలంగా, రెస్టరెంట్సు, లవుంజ్ లు—ఎస్కలేటర్స్, ఒక్కొక్క చోట నించి, టెర్మినస్ నించి ప్లేను ఎక్కడానికి ఎంతెంత దూరాలో నడవాలి.

ఫ్రాంక్ ఫర్ట్ నించి లండన్ చేరే సరికి ఇండియన్ టైమ్ ప్రకారం 5 $\frac{1}{2}$ అయింది. అక్కడ టైము ప్రకారం ఒకటిన్నర. అందరం సమయాన్ని సరిదిద్దుకున్నాం—వీసా చెకింగ్ లగేజ్ కలక్ట్ చేసుకుని లవుంజ్ లోకి వచ్చేసరికి 3 గంటలయింది. టి.సి.ఐ. లీడర్ కోసం ఎదురు చూస్తూ నిల్చున్నాం. మాలాంటి గ్రూపులు బ్యాగులు చూసి ఓ పది మంది వచ్చి అందరం గుంపుగా నిలబడి వెయిట్ చేయసాగాం. గంట గడిచినా అతని జాడ తెలియదు. బొంబాయి ఎయిర్ పోర్టులో మాతో కల్సి ప్రయాణం చేయవల్సింది పోయి లండన్ వచ్చి గంటయినా వచ్చి కల్సుకోని గ్రూప్ లీడర్ని అందరం తిట్టుకోడం ఆరంభించాం. మనిషి కనపడడు— మెసేజ్ లేదు.

ఆదిలోనే హంసపాదులా యిదేమిటి యిలా అయింది. వీళ్ళని నమ్ముకుని వచ్చాం—టూర్ అంతా యిలాగే బాధ్యతా రహితంగా ప్రవర్తిస్తారా? యిప్పుడేం చెయ్యడం, ఎంతకని యిక్కడ నిలబడడం? అందరి మనసుల్లోనూ యివే ప్రశ్నలు. అందరూ కల్సి తిట్టుకున్నాం, అదృష్టవశాత్తు మాకిచ్చిన కాగితాలలో ఏ ఏ వూళ్లలో ఏ హోటల్లో మమ్మల్ని దింపేదీ ముందుగా ప్రోగ్రాం వేసి వుంది. లండన్ లో ఫలానా హోటల్

మా కోసం ఏర్పాటు చేశారని చూసి ఆ హోటలుకి ఫోను చేశారు. రూమ్సు అయితే బుక్ అయ్యాయి గాని గ్రూప్ లీడర్ గురించి వాళ్ళకి తెలియదన్నారు. లండన్‌లో వున్న టి. సి. ఐ. ఆఫీసుకి ఫోను చేశారు. మా వాళ్ళు అక్కడ ఎవరూ ఫోనులో సరిగ్గా యిన్‌ఫర్‌మేషన్ యివ్వలేదు. అప్పటికే 5 గంటలయింది. గత రోజు, రాత్రి నిద్రలేకుండా పన్నెండు గంటలు ప్రయాణం చేసి అలిసిపోయిన అందరికీ యింకా ఎదురు చూసే సహనం లేక పోయింది. ఎవరంతట వాళ్ళం టాక్సీలు వేసుకుని హోటలుకి వెళ్ళిపోయి ఆ డబ్బు టి. సి. ఐ. వారి నించి తీసుకోవాలి అని నిర్ణయించుకున్నాం. అంతంత బరువు, పెట్టెలు, బ్యాగులు మోయడం అలవాటు లేని మేము చచ్చిచెడి సామాను మోసుకుని, టాక్సీల కోసం వెయిట్ చేసి ఎలాగో టాక్సీ ఎక్కి హోటలుకి బయలుదేరాం.

లండన్‌లో దిగేటప్పటికి అసలు చలి లేదు గదా ఎండ మన వూళ్ళోలా చురచుర మంటూ వుండేది. గతవారం రోజులుగా అక్కడ ఎండలు విపరీతంగావున్నాయన్నారు. ఎయిర్‌పోర్ట్ నించి హోటలుకి వస్తుంటే. నిజంగా అందమైన విశాలమైన రోడ్లు, యిటు అటు చక్కని విక్టోరియన్ స్టైలు యిళ్ళు. గ్లాస్ విండోస్‌లోంచి కనిపించే లేసు కర్టెన్స్, యింటి ముందు పసిరిక తివాచి పరిచినట్టు లాన్స్, గులాబి తోటలు, రోడ్డుకి యిటు అటు వున్న ఆ అందమైన యిళ్ళు కన్నుల పండుగగా కన్పించాయి. వెళ్ళేందుకు నాలుగు లైన్లు, వచ్చేందుకు నాలుగు లైన్లు వున్నా అంత విశాలమైన, నీట్‌గా వున్న రోడ్లు, పై ఓవర్స్ చూస్తుంటే అబ్బ ఎంత బాగుంది అన్పించింది. లండన్ బొంబాయిలా వుంటుంది అన్నమాట చాలా సార్లు విన్నాను—కాని చూశాక అసలు లండన్ ఎక్కడ బొంబాయి ఎక్కడ అన్పించేట్టు వుంది. మన గతుకుల రోడ్లు, కుళ్ళు కాల్వలు, పొంగి పొర్లే డస్ట్‌బిన్‌లు, రంగులు వెలిసిన క్రొంపలు, ప్రతిచోట వందలు వేల సంఖ్యలో వుండే పూరి గుడిసెలు.... అందమైన లండన్ నగరానికి బొంబాయికీ పోలికేమిటి? ఏదో పాత లండన్ శాస్త్ర యిరుకు సందులతో దగ్గిర దగ్గిర యిళ్ళతో పాత యిళ్ళతో వుంటుం

దిగాని మిగతా నగరం అంతా పరిశుభ్రంగా అందంగా వుంది. హోటల్ చెయిసీకి క్లోస్టర్ రోడ్డులో వుంది. అది పురాతనమైన విక్టోరియన్ హోటలు. విక్టోరియన్ సైపు ఫర్నిచర్ అలంకారాలతో చాలా చక్కని హోటలు—బుక్ చేసినరూముల తాళాలు తీసుకుని మళ్ళీ వచ్చిచెడి సామాను మోసుకుని రూములో చేర్చేసరికి మా పని అయిపోయింది. హోటలు బాయ్స్ వుంటారు సామాను తెమ్మంటే తెస్తారు గాని, వాళ్ళకి 3,4 డాలర్లు టిప్పులు యివ్వాలి— 3, 4 డాలర్లు అనగానే అమ్మో 39 రూ॥లనుకొని చచ్చినట్టు బరువులు మోసుకున్నాం-యూరప్, అమెరికా, ఏ విదేశాలలోనైనా సామాన్లు మోయ డానికిఇక్కడున్నట్లు కూలీలుండరు —ఎవరి సామాను వారు తెచ్చుకోవాలి. ఎయిర్ పోర్టులో అక్కడ ట్రాలీలు పట్టుకుని కొందరుంటారు గాని వాళ్ళు 5 డాలర్లు తక్కువ తీసు కోరు.

యూరప్‌లో సాధారణంగా యిళ్లల్లో హోటళ్లలో ఎక్కడా ఫేను లుండవు. యిప్పుడిప్పుడు కొన్ని హోటళ్ళు ఎయిర్ కండిషన్డ్ చేస్తు న్నారు. వాళ్లకి ఎంతసేపు ఫైర్ ప్లేసులు, హీటింగు సిస్టమ్ తప్ప ఫేను లవసరం వుండదు. ఏడాది మొత్తం ఓ నెల రోజులు కాస్త ఎండ వుంటుంది. ఆ ఎండ కూడా మన చలికాలంలా వుంటుంది కనక ఎవరికీ ఫేనుల అవసరం వుండదు. ఆరోజు అనలే ఎండగా వుంది.... ప్రయాణం చేసి వచ్చాం ఏమో, హోటలులో రూములో చాలా ఉక్క అన్పించింది. వున్న పెద్ద విండో కాస్త ఓపెన్ చేసి, స్నానం చేశాక కాస్త ఉక్క తగ్గింది.

ఆ సాయంత్రం లండన్‌కి నూట ఏభై మైళ్ల దూరాన వున్న Keventry (కెవెంట్రి) అనే పూళ్ళో మా అక్క అడపడుచు కూతురు అరవింద వుంది. మేం వచ్చాం అని పాపం అరవింద, భర్త కృష్ణ మోహన్ వచ్చారు. వాళ్ల అమ్మగారు (హైదరాబాదు) పంపిన ఊరగాయలు వాళ్ళకి అందించాం. రాత్రి భోజనానికి ఆ రోడ్డులోనేవున్న ఓ యిండియన్

రెస్టరెంట్‌కి తీసికెళ్ళారు మమ్మల్ని వాళ్ళు. రిటర్న్ జర్నీలో వాళ్ళ వూరు వెళ్ళి రెండు రోజులుండి రావాలి అని ప్లాను. కాసేపు కబుర్లు చెప్పి వాళ్ళు పదిన్నరకి వెళ్ళాక అప్పుడు అలిసిపోయిన మేం నిద్రకి ఉపక్రమించాం. టైమయితే రాత్రి 10½ అయింది గాని వెలుతురు మాత్రం మనకి సాయంత్రం 6, 6½ అయినంతలా వుంది. యూరప్‌లో అన్నిచోట్ల పారిస్, వగైరా చోట్ల అయితే 11 గంటల వరకు వెల్తురు వుంటుంది. చీకటితో సంబంధం లేకుండా అందరూ టైము చూసుకుని కర్టన్సు వేసుకొని నిద్ర పోవడం అక్కడి అలవాటు అవుతుంది. రాత్రి ఉక్క 12 గంటల తరువాత తగ్గి నిద్ర పట్టింది మాకు.

ఉదయం హోటల్‌లోనే బ్రేక్‌ఫాస్ట్— మొదటిరోజు అక్కడ బ్రెడ్, జామ్, తింటుంటే అబ్బ ఎంత బాగుంది మెత్తగా మృదువుగా అనుకుంటూ చాలా యిష్టంగా తిన్నాం. అదే బ్రెడ్ తక్కిన యిరవై రోజులు తినేసరికి బ్రెడ్ అంటే అయిష్టంపుట్టేసింది. హోటలులో అంతా సెల్ఫ్ సర్వీసు—ప్లేటు తీసుకుని మన యిష్టం వచ్చినంత తినచ్చు. ఆరంజ్ జ్యూస్, కాఫీ అది మనకి కావల్సినంత తాగచ్చు— అక్కడ ప్రతిచోట తాజా ఆరంజ్ జ్యూసు పెడతారు. ఆ జ్యూస్ మాత్రం చాలా యిష్టంగా తాగేవాళ్ళం. జామ్, బట్టర్, ఛీజ్ అన్ని చిన్న చిన్న ప్లాస్టిక్ కంటైనర్స్‌లో నీట్‌గా పాక్ చేసి పెడతారు. ప్రతి హోటలులో కాఫీకి, టీకి, కాఫీ, టీ మేకర్స్ వుంటాయి. అక్కడ బటన్ నొక్కి మనకి కావల్సింది తాగచ్చు.

ఆరోజు 12 గంటల ఫ్లైటులో ఆమ్స్టర్‌డామ్ వెళ్ళాలి మేం ప్రోగ్రాం ప్రకారం—పది గంటలయింది. మా లీడరుగారి జాడలేదు. మావాళ్ళు మళ్ళీ టి.సి.ఐ. ఆఫీసుకి ఫోను చేస్తే మీ కోసం ఎయిర్‌పోర్టుకి తీసికెళ్ళడానికి కోచ్ వస్తుంది. మిమ్మల్ని ఆమ్స్టర్ డామ్‌లో రష్యా వెళ్ళిన వాళ్ళని తీసుకుని గ్రూప్ లీడరు వచ్చి కలుస్తాడు అన్న వార్త చెప్పారు. ఏదో గుండెలో మెల్ల ఏదో వార్త తెల్సింది, ఎయిర్ పోర్టుకి వెళ్ళడానికి ఏర్పాటయిందని సంతోషించాం. కాసేపు చుట్టు పక్కల వీధులు తిరిగి వచ్చాం.

లండన్ సైట్ సీయింగ్ అంతా ఐటర్నైజర్నీలో పెట్టారు. ఎందుచేత అంటే రష్యా వెళ్ళి వచ్చిన వాళ్ళు, కంబైన్డ్ టూరులో వచ్చే వాళ్ళు రోమ్‌లో కలుస్తారు. అందరినీ కలిపి ఆఖరికి లండన్ తీసుకొచ్చి అప్పుడు లండన్ చూపెడతారు—అంచేత మేము లండన్ నించి ఆమ్‌స్టర్‌డామ్ వెళ్ళిపోవాలి.

లండన్‌లో టి.సి.ఐ. ఆఫీసువాళ్ళు లోకల్ 'కొయినీ ట్రావెల్స్'తో కొలాబరేట్ అవుతారు. యిండియన్ గ్రూపుకి అన్ని ఏర్పాట్లు టి.సి.ఐ. వారు చేసి పంపితే యూరప్‌లో అన్ని హోట్ల హోటలు బుకింగ్స్, ట్రాన్స్‌పోర్టు వగైరాలన్నీ 'కొయినీ ట్రావెల్స్' చూసుకుంటారు, కనక గైడ్స్‌ని వాళ్ళే ఏర్పాటు చేస్తారు. టి. సి. ఐ. వాళ్ళ బాధ్యత లండన్ వరకు. అక్కడ నించి మిగతా ఏర్పాట్లు వాళ్ళు చూసుకుంటారట.

మేం ఆమ్‌స్టర్‌డామ్ చేరే సరికి $3\frac{1}{2}$ గంటలయింది. మేం వెళ్ళిన అరగంటకి మాస్కో నించి ఫ్లైట్ వచ్చింది. లగేజి తీసుకునే సరికి మా కోసం కోచ్ తీసుకుని కొయినీ ట్రావెలర్స్ మనిషి వచ్చాడు. యింకో అరగంటలో మాస్కో ఫ్లైట్ వస్తుంది—లీడరు, ఆ గ్రూపు వచ్చేవరకు వెయిట్ చెయ్యాలని చెప్పాడు డ్రైవరు. మాస్కో ఫ్లైట్ వచ్చి పదిహేను మంది గ్రూపుతో లీడరు దిగాడు. అతడి మీద మూక ఉమ్మడిగా అందరం దాడి చేశాం, ఇంత బాధ్యతా రహితంగా ప్రవర్తిస్తారా? అంటూ. మొర్రో నాకేం తెలియదు, నేను ఈ గ్రూపుని తీసుకుని మాస్కో వెళ్ళాను. మీతో బొంబాయి నించి యింకొకరు రావాలి. అతను రాకపోతే నా తప్పా అంటూ అందరికీ నచ్చజెప్పి—సమాధానపరిచి శాంతింపచేశాడు. మా టూర్ ఎస్కార్ట్ పేరు జరీన్. యువకుడు స్మార్ట్‌గా మాటలతో అందరిని బోల్తాకొట్టించే నేర్పుకలవాడు. అరగంటలో పరిస్థితి అంతా సర్దుబాటు చేసేసి అరగంటలో బస్సులో అందరినీ హోటలు చేర్చాడు. అప్పటినించి టూర్ చివరి వరకు మాకు ఏ ప్రాబ్లమ్ లేకుండా తనే చూసుకున్నాడు. ఆరంభంలో అలా చిన్న ఇబ్బంది ఏర్పడిందే తప్ప మిగతా టూరు అంతా చాలా చక్కగా ఆర్గనైజ్‌డ్‌గా జరిగింది.

ఆమ్‌స్టర్‌డామ్ చేరేసరికి మా గ్రూపు మొత్తం 42 మందిమి అయ్యాం. గ్రూపులో తెలుగు, అరవం, మళయాళం, మార్వాడి, గుజరాతీ, బెంగాలీ, మహారాష్ట్రి యిలా అన్ని రకాల వాళ్ళు వున్నారు. హైదరాబాదు నించి యిద్దరు పోలీసు డి.ఐ.జి.లు, మరో యిద్దరు బిజినెస్ చేసే కుర్రాళ్ళు. మొత్తం మేం ఎనమండుగురు తెలుగు వాళ్ళం—పడుచు జంటలు ఐదారుగురున్నారు. నిజంగా వాళ్లు బాగా ఎంజాయ్ చేశారు.

ఆమ్‌స్టర్‌డామ్‌లో హోటలు IBIS బ్రహ్మాండమైనహోటలు. అడవి మధ్య వున్నట్టు చుట్టూ చెట్లూ, మంచి సీనరీ, పూలతోట, సరస్సు, ప్రకృతి దృశ్యాల మధ్య ఆధునికమైన హోటలు. ఆమ్‌స్టర్ డామ్ చాలా అందమైన నగరం—మంచి టూరిస్ట్ ప్లేస్—నగరం మధ్య కెనాల్స్—నది ఒడ్డున బారులు తీరిన అందమైన భవనాలు, కెనాల్స్ మధ్య ఆర్చిల లాంటి వంతెన—యిళ్ళ ముందు పూలతోటలు—రోడ్డు మీద యిటు అటు పెద్ద పెద్ద చెట్లు—ఎక్కడ చూసినా పచ్చిక బయళ్ళు—చూస్తుంటే పులకరింత కల్గుతుంది. ప్రతి యేటా సమ్మర్‌లో లక్షల మంది టూరిస్టులు వస్తారుట—ఒక్క ఆమ్‌స్టర్ డామ్‌లో 1300 రెస్టరెంట్సు వున్నాయట. అన్ని వున్నా అన్నీ కిటకిటలాడుతూ వున్నాయి టూరిస్ట్ సీజన్ కనక. ఆ వూర్లో 160 కెనాల్స్, 1000 బ్రిడ్జిలు వున్నాయట. ఆ రాత్రి యిండియన్ రెస్టరెంటులో భోజనం చేశాక బోట్ రైడింగ్ ఏర్పాటు చేశారు. రాత్రి 9 గంటల నుంచి 11 వరకు మొత్తం సిటీ మధ్య కెనాల్స్ నించి బోట్‌రైడింగ్ చాలా బాగుంది. దీపాలతోరణాల బ్రిడ్జిలు, నీటి ఒడ్డున అందమైన భవంతుల నించి కన్పించే దీపాకాంతులు....ఓహ్....నగరం శోభాయమానంగా వెల్గిపోతూ కన్పించింది. అక్కడ కూడా రాత్రి పదిదాటేదాకా చీకటి పడలేదు.

మర్నాడు 'ఆమ్‌స్టర్‌డామ్'—వూరు అంతా సైట్ సీయింగు—అక్కడ కర్రతోచేసే బూట్ల ఫ్యాక్టరీ, మ్యూజియం చూసాం—ఆ కాలం నాటి డచ్ పెయింటర్స్ ప్రతిభకి మాటలు చాలవు. తరువాత ఆమ్‌స్టర్ డామ్‌కి నలభై మైళ్ళ దూరంలో వున్న 'మదురా డామ్' అనేటటువంటి

మినియేచర్ హాలండ్ చూశాం—మదురాడామ్ అనేటటు వంటిది పిల్లల కోసం కట్టిన మినియేచర్ హాలండ్. అంటే హాలండ్‌లో ఏమేమేంనదులు, కొండలు, భవనాలు, చర్చీలు, ప్యాలస్‌లు, మ్యూజియంలు, ఎయిర్ పోర్టులు, షిప్ యార్డులు.... రోడ్లు, రైల్వేలు, కార్లు, బస్సులు....ఒక టేమిటి హాలండ్ మొత్తం చెట్లు, తోటలతో సహా అంతా మినియేచర్ వరల్డ్ తయారు చేశారు. ఆఖరికి రోడ్డు పక్కన ఎలాంటి వృక్షాలు వున్నాయో అలాంటివే అడుగు అడుగున్నర మించకుండా 'బొన్సాయ్' చెట్లలా కత్తిరించి అంతకంటే పెరగకుండా పెంచారు. ప్రతిది శ్రద్ధగా మన బొమ్మల కొలువుకు చిన్నకార్లు మనుష్యులు అని ఎలా ఏర్పాటు చేస్తామో అలా పెద్ద పార్కులో మినియేచర్ హాలండ్‌ని పిలల కోసం యాత్రాస్థలంలా తయారు చేశారు. 'మదురాడామ్' వెనక నున్న కథ ఏమి టంటే ఒక దంపతులకి ఒకడే కుమారుడు 'మదురా' అని. పదేళ్ళ వయ సులో ఆ అబ్బాయి జబ్బుచేసి చచ్చి పోయాడట. తరువాత మరి పిల్లలు కలగలేదుట. ఏకైక కుమారుని పోగొట్టుకున్న దుఃఖం నించి తేరుకో డానికి తమ సంపద అంతా వెచ్చించి కుమారుడి జ్ఞాపకార్థం పిల్లల యాత్రా స్థలం తయారు చేసి తమ కుమారుని అమరుడ్ని చేశారు ఆ దంపతులు. 1952లో కట్టిన మదురాడామ్‌ని ప్రతి ఏటా వేలమంది యాత్రికులు దర్శి స్తారు.

అవన్నీ చూసి అమస్టర్‌డామ్ తిరిగి వచ్చేసరికి 7 గంటలయింది. ఏకంగా యిండియన్ రెస్టరెంటులో భోజనం చేసి వెళ్ళిపోదాం, హోటలుకి వెళ్ళి మళ్ళీ రావాలంటే చాలామారం అన్నాడు మా లీడరు. సరే అన్నాం అందరం. తీరా వెళ్ళాక యింకో గంటవరకు డిన్నర్ తయారు కాదు అన్నాడు రెస్టరెంట్‌వాడు—సరే అని కుర్ర సజ్జంతా రోడ్లు చుట్టి రావ డానికి వెళ్లారు. కొందరు విండో షాపింగ్ అంటూ చుట్టుపట్ల తిరిగి రావ డానికి వెళ్లారు—మాలాంటి పెద్దవాళ్లం కొందరం రెస్టరెంటు బయట

చెట్లు మధ్య మధ్య సిమెంటు చపటాలున్నా చోట కూర్చున్నాం— మేం నల్గుర్ం మాతోపాటు హైదరాబాదుకి చెందిన డి.ఐ.జి. రెడ్డిగార్లి ద్దరూకూచుని కబుర్లు చెప్పుకుంటున్నాం. ఆ యిండియన్ రెస్టరెంటున్న ఏరియా అంత మంచి ఏరియా కాదు. రెస్టరెంటు ముందు డ్రగ్ ఎడిక్ట్స్, హిప్పీలు, ఏవేవో చవకబారు గిమిక్స్ చేస్తూ ప్రేక్షకులని పోగుచేసి డబ్బులడుక్కునే వాళ్ళు గుంపులు గుంపులుగా వున్నారు. మాకు యూరప్ వెళ్ళిన వాళ్ళు చాలా మంది అమ్స్టర్ డామ్‌లో దొంగతనాలు ఎక్కువ—పాస్‌పోర్టులు, పర్సులు జాగ్రత్తగా చూసుకోవాలి అంటూ హెచ్చరించారు. 'ఇదేమిటి ఈ రెస్టరెంటు ఇలాంటి చోట పెట్టారు—అయినా రెండు గంటల ముందునించి యిక్కడ మనల్ని తెచ్చిపడేశాడు జరీన్' అని విసుక్కున్నాం మేం. ఆ గుంపులు, హిప్పీలు చేస్తున్న వెర్రివేషాలు చూస్తూ ఏదో మాట్లాడుకుంటున్న మా దగ్గరకి ఎవరో ఒక చైనా తైవాన్ వాడిలాగా పొట్టిగా వున్న ఒకతను వచ్చి రెడ్డిగారి పక్కన కూర్చున్నాడు సిమెంటు చప్టామీద. ఎవరో మాలాంటి వాడే అనుకున్నాం. మరీ రెండు మూడు నిమిషాల తరువాత మరొక పొట్టి వాడు వచ్చి మమ్మల్ని ఏదో భాషలో ఏదో అడిగాడు. మాకు రాదు ఆ భాష, యింగ్లీషులో చెప్పు అన్నాం మేం—ఆహా అంటూ అతను వెళ్ళిపోయాడు. ఇంతలో రెడ్డిగారు బూట్ లేసు వదులయితే ముందుకు వంగి కట్టుకుని లేచి పక్కన చూసుకుంటే అక్కడ పెట్టిన ఆయన జిప్ బ్యాగు కనపడలేదు. అంతా ఒక నిముషం! 'అయ్యో నా బ్యాగు.... నా బ్యాగు' అని గాభరా పడ్డారు. ఆ పక్కన కూచున్నవాడు ఏమయ్యాడో ఎప్పుడు వెళ్ళాడో ఎవరం చూడలేదు—అరక్షణంలో ఆ బ్యాగు కాజేసి వాడు వెళ్ళిపోయాడు. జరిగింది ఏమంటే మేం టూరిస్టులం అని కనిపెట్టి ఆ యిద్దరూ ప్లాను వేసుకుని వచ్చారు. ఒకడు ముందు వచ్చి మా పక్కన కూర్చున్నాడు—రెండోవాడు మా ఎటెన్షన్ డైవర్టు చేయడానికి ఏదో అడిగి మాటల్లో పెట్టాడు. ఆ ఒక్క క్షణంలో రెండోవాడు రెడ్డిగారు పక్కన పెట్టిన ఆ బ్యాగు సంగ్రహించి ఒక్క క్షణంలో యిద్దరూ ఆ జనం గుంపుల మధ్య మాయమయ్యారు. ఆ బ్యాగులో ఆయన పాస్‌పోర్టు

టిక్కెట్లు, ట్రావలర్స్ చెక్స్ కొంచెం డాలర్లు అన్నీ మొత్తంవున్నాయి—పాస్‌పోర్టు, టిక్కెట్లు అవి వున్నాయని వెంట వెంట జాగ్రత్తగా పట్టుకు తిరిగిన ఆయన అర నిమిషం బ్యాగు పక్కన పెట్టగానే అది కాస్త పోయింది. వెంటనే నలుగురు నాలుగు మూలలకి పరిగెత్తారు— పోలీసు కంప్లైంట్ యిచ్చారు. పోయిన వస్తువు దొరకడం ఏమిటి? యింక అప్పటినించి పాపం ఆ రెడ్డిగారి అవస్థ పగవాళ్ళకి వద్దు అన్పించింది. విదేశాలలో పర్యటిస్తున్నప్పుడు పాస్‌పోర్టు, వీసా అవీ పోతే ఆ బాధ నరకమే. ట్రావలర్స్ చెక్కులు వాడు మార్చుకోలేదు—టిక్కెట్లు మళ్ళీ Pan am వాళ్ళతో మాట్లాడి ఏదో తంటాలు పడ్డారు. యింక ప్రతిచోట పాపం ఆ రెడ్డిగారు సైట్ సీయింగ్ లేదు ఏమీ లేదు. పాస్‌పోర్టు కోసం ప్రతి కాన్సలేట్ ఆఫీసుల చుట్టూ తిరిగి సంపాదించుకోడమే సరిపోయింది. ఇంకా ఆయన మన గవర్నమెంటు ఆఫీసరు, పోలీస్ డిపార్టుమెంటు ఆయన కనక వెంటనే డూప్లికేట్ పాస్‌పోర్టులు జారీ చేశారు. ఒక దేశం కాదాయె బ్రిటిష్, ఫ్రెంచి, జర్మన్, ఇటాలియన్, స్విస్ యిలా అన్ని దేశాలవి కావాలి. ప్రతి చోట పాస్‌పోర్టులు సంపాదించుకునేసరికి ఆయనకి ఇంకో 800, 900 డాలర్లు అయింది. దేశాలు చూడాలన్న సరదాపోయి పాపం ఆయన ఎంత డీలా పడిపోయారో చెప్పలేం. ఎవరైనా సరే విదేశాలకి వెళ్ళినపుడు పాస్‌పోర్టు ప్రాణం కంటే జాగ్రత్తగా చూసుకోవాలి. ముఖ్యంగా అమ్‌స్టర్ డామ్, రోమ్ నగరాలలో జాగ్రత్తగా వుండాలట—ఆ పాస్‌పోర్టులుఫొటోలు తీసేసి కొత్తవి పెట్టి తయారుచేస్తారట—టూరిస్టులయితే డబ్బులు, పాస్‌పోర్టులుంటాయని. మనలాంటి వారి మీద కన్నేసి వుంచుతారట—అంచేత జాగ్రత్తగా వుండాలి.

మర్నాటినించి మా అసలు ప్రయాణం ఆరంభమయిందని చెప్పవచ్చు—అమ్‌స్టర్‌డామ్‌నించి మిగిలిన యూరప్ అంతా బస్సు ప్రయాణంలో వెళ్ళాం. కంట్రీసైడు కోచ్‌లో ప్రయాణం చేస్తూ యూరప్ అంతా చూపించుతారు. యూరప్‌లో అన్ని చిన్న చిన్న దేశాలు—ఒక్కొక్క దేశం మన ఒక్కొక్క రాష్ట్రం అంత కూడా వుండవు—అంచేత

దూరాలు తక్కువ—4,5 వందల కిలోమీటర్ల దూరం కంటే ఒక చోట నించి యింకో చోటికి దూరాలుండడం వల్ల ఉదయం 8 గం॥లకి బయలు దేరితే సాయంత్రం 5 గం॥ల లోపల చేరాల్సిన స్థలం చేరిపోయేవారం. ఆ రాత్రి హోటలులో బసచేసి మర్నాడు అక్కడ చూడాల్సినవి చూసి మర్నాడు మళ్ళీ ఉదయం బయలుదేరే వారం. మంచి ఎయిర్ కండిషన్ బస్సులు, ప్లేనులో లాంటివి సౌకర్యవంతమైన సీట్లు, అద్భుతమైన విశాలమైన రోడ్లు—మంచి వాతావరణం, ఓ దుమ్మూ ధూళిలేని, శుభ్రమైన పరిసరాల మధ్య 5,6 వందల మైళ్ళు ప్రయాణం చేసినా జుత్తురేగకుండా, మొహం వాడకుండా, బట్టనలగకుండా‘ ఏ కుదుపులు లేకుండా ప్లేనులో ప్రయాణం చేసినట్టే అలసట లేకుండా ప్రయాణించేవారం.

మా బస్ డ్రైవరు పేరు పీటర్—డచ్ దేశస్థుడు—డ్రైవరంటే మామూలు డ్రైవరు కాదు—చదువుకున్న వాడు—ఏదో ఫార్మాస్యూటికల్ కంపెనీలో ఉద్యోగి—అతని భార్య టీచరు-కూతురు మెడిసన్, కొడుకు కంప్యూటర్ కోర్సు చదువుతున్నారు—అంటే మన మధ్య తరగతి సంసారి అన్నమాట. అతను సమ్మర్ జాబ్ కిందనెలరోజులకు ఇలా డ్రైవరుగా వచ్చాడు. అతని భార్య సమ్మర్ సైకిల్ టూర్ మీద వెళ్ళిందట— నెలకి మూడు వేల డాలర్లు తెచ్చుకునే అతను ఓ నెలరోజులు పూరుకే కూర్చునే కంటే డ్రైవరుగా వచ్చి ఏదో కొంత సంపాదించాలని వచ్చాడంటే ఆ దేశాలలో ‘డిగ్నిటీ ఆఫ్ లేబర్’కి ఎంత ప్రాముఖ్యం ఇస్తారో తెల్సుకోవచ్చు—ఆ విషయం గురించి యింకోసారి చెపుతాను. పీటర్ అజానుబాహుడు. ఆరు అడుగుల రెండంగుళాలు—బలిష్టంగా వుంటాడు. ఆ యిరవై రోజులలో మాతో బాగా కల్సిపోయాడు. మేము రూములలోంచి ఆపసోపాలు పడుతూ లాగలేక లాక్కొచ్చిన అంతంత పెట్టెలు, బ్యాగులు ఎడం చేత్తో ఎత్తి బస్సుకింద లగేజి కంపోర్టుమెంటులో సర్దేపేవాడు—ప్రతిరోజు మా లీడర్ మార్నింగ్ వేకప్ కాల్ 6 గంటలకి, బ్రెక్‌ఫాస్ట్ $7\frac{1}{2}$గం॥లకి, బస్సులో 8 గంటలకి వుండాలి అంటూ మర్నాటి ప్రోగ్రాం అంతా చెప్పేవాడు. హోటలు రూములో

6 గం॥లకల్లా ఫోను మోగేది. వెంటనే లేచి దయారై కింద డైనింగ్ హాల్లో బ్రేక్‌ఫాస్ట్‌కి వెళ్లేవారం—ఎంత పంక్చ్యువల్‌గా వున్నా అందరం ఎక్కి బయలుదేరే సరికి $8\frac{1}{2}$ అయ్యేది.

అమ్‌స్టర్ డామ్ నించి రోడ్డు మీది ప్రయాణం ఆరంభమయింది. మొదటి హాల్ట్ జర్మనీలో 'కొలోన్'. అమ్‌స్టర్ డామ్‌నించి 350 మైళ్ళు—కొలోన్ (Cologne) వెళ్ళే తోవలో 'ఫాంటసీ లేండ్' అనే టూరిస్ట్ స్పాట్ వుంది—అది చిన్న సైజు డిస్నిలాండ్‌లాంటిది. మోన్‌రైలు, రోలర్ కోస్టర్స్, టన్నెల్ ఆఫ్‌హార్రర్స్ లాంటి పిల్లలు పెద్దలు ఆనందంతో వళ్ళు మరిచిపోయే జర్నీస్, జెయింట్ వీల్స్....ఒకటేమిటి అనేక రకాల ఎట్రాక్షన్స్ వుంటాయి. ఎంతో డబ్బు ఖర్చుపెట్టి పిల్లలకి పెద్దలకి విహార యాత్రా స్థలాలు ఏర్పరిచాయి అక్కడ ప్రభుత్వాలు. అవన్నీ చూస్తూంటే మన పిల్లలకి యివేం లేవే, నిజంగా పదిపన్నెండేళ్ళలోపు పిల్లలు ఎంతలా కేరింతలు కొడుతూ ఆనందిస్తున్నారో—సమ్మర్ హాలిడేస్ కనక పిల్లల్ని తీసుకొచ్చి తలితండ్రులూ వారితోపాటు పిల్లలై ఎంజాయ్ చేయడం చూస్తే ముచ్చట అన్పించింది. ప్రతిసమ్మర్ కి-(మిగతా కాలాలు మంచు, చలి కనక ఎక్కడికీ వెళ్ళలేరు) ఎక్కడికో అక్కడికి పిల్లలని తీసుకుని ప్రతీవారు వెళ్ళి ఎంజాయ్ చేస్తారు—విహార యాత్రా స్థలాలన్నీ కిటకిటలాడుతూ వుంటాయి. వాళ్ళలా లైఫ్ ఎంజాయ్ చేయడం మనకి చేతకాదు—ఎంత సేపూ డబ్బుకూడబెట్టి ఆస్తులు చేసి పిల్లలకివ్వాలన్న ఆరాటం తప్ప వున్న నాల్గురోజులు ఆ డబ్బుతో ఎంజాయ్ చెయ్యాలన్న ఆలోచన మనకి రాదు. అంతే కాక మన దురదృష్టం, మనదేశంలో మధ్య తరగతి సంసారి ఏడాదికి ఓ నెల ఎటో వెళ్ళి డబ్బుఖర్చుపెట్టి ఎంజాయ్ చేసే స్థితిలోలేరు—ఆ డబ్బుతో యింటిల్లిపాదికి బట్టలు వస్తాయనుకుంటాం—యింకేదో కొనచ్చు అనుకుంటాం. తిరిగి తిరిగి డబ్బు తగలేయడం ఎందుకు అనే మన ఆలోచన ఉంటాయి. నిజానికి మన దేశంలో లేనిది ఏం వుంది—జలపాతాలున్నాయి, కొండలున్నాయి, నదులున్నాయి, తోటలున్నాయి—సరస్సులున్నాయి—గుళ్లు, గోపురాలు, శిధి

లాలు, కళ్ళుచెదిరే రాజప్రాసాదాలు, చర్చీలు, మసీదులు—సముద్రాలున్నాయి—పరవశించే ప్రకృతి దృశ్యాలున్నాయి—మిగతా ఏ దేశాలకి తీసిపోని వనరులున్నాయి—కాని ఆ దేశాల మాదిరి డబ్బు ఖర్చుపెట్టి టూరిస్టు స్పాట్స్‌ని సౌకర్యవంతంగా చేసి, ప్రజలని ఆకర్షించే విధానాలు మన ప్రభుత్వం ఎందుకు చేపట్టదు? అక్కడ టూరిస్ట్ సీజన్‌లో, ప్లేనులో టిక్కెట్లు, హోటళ్ళలో కన్సెషన్స్ రకరకాలు పోటీలు పడి తగ్గించి టూరిస్టుల్ని ఎట్రాక్ట్ చేస్తారు. అసలు అక్కడి ప్రజల మనస్తత్వాలకి మనకీ చాలా తేడావుంది. వాళ్లు ఎంత సేపు ఈ రోజు గురించే ఆలోచిస్తారు—మనకి ఎప్పుడూ రేపటి చింతే. అయ్యో ఈ రోజిలా తిరిగి డబ్బు తగలేస్తే రేపెలా అన్నది మన బాధ—దానికి కారణం మనకి సంపాదించే వొకడు—తినేది అరడజను మంది..... యింటి యజమాని సంపాదించాలి. దాన్లోనే అన్ని ఖర్చులు జరగాలి—వాళ్లు అలాకాదు. యింట్లో భార్యాభర్త సంపాదిస్తారు. టీనేజ్ పిల్లలు, చదువుకుంటూ పార్టుటైమ్ జాబ్స్ చేస్తారు. అందరూ శెలవల్లో సమ్మర్ జాబ్స్ యిదీ అదీ అని లేకుండా ఆ రెండు నెలలు ఏదో చేసి సంపాదిస్తారు—మా కోచ్ డ్రైవరులా మన ఇండియాలో ఓ ఉద్యోగి బస్సునడపడానికి వచ్చినా అంగీకరించడు. అతను ఓ నెల సంపాదించిన ఆ డబ్బుతో మళ్ళీ నెలంతా భార్యా బిడ్డలతో శెలవుల్ని ఎంజాయ్ చేయడానికి వెళ్ళిపోతాడు. అలాంటి నదుపాయాలు మనకిలేవు. లేవంటే అవకాశాలు లేవని కాదు. మనం అలాంటి పనులు చెయ్యడం అవమానం అనుకుంటాం. యిండియా పురోభివృద్ధి సాధించాలంటే ఈ డిగ్నిటీ ఆఫ్ లేబర్‌ని గౌరవించగల్గినపుడే అభివృద్ధికి నాంది పలకగలదు. మళ్ళీ ఆ ప్రస్తావనకే వచ్చాను—ముందు టూరు గురించి చెప్పాక వారికి మనకి గల ఆలోచనల్లో తేడాలు, వారి పురోభివృద్ధి, వారు సాధించిన ప్రగతి అంతా చెపుతాను వరసగా. ఒకదానిలోంచి ఒకదాంట్లోకి వెళ్ళిపోయాను—ఎక్కడున్నాం మనం, అన్నట్టు ఫాంటసీలాండ్ దగ్గర కదా!—నిజంగానే 'ఫాంటసీలాండ్' అది—ఓ మూడు గంటలు ఆ అద్భుత ప్రపంచంలో వయసు మరిచి చిన్న పిల్లల్లా ఎంజాయ్

చేరాం—కాని, ఒక్కటే చిరాకు—మంచి టూరిస్ట్ సీజనేమో....ప్రతిచోట అరగంట, గంట క్యూలో నిల్చుని నిల్చుని కాళ్ళు పీక్కుపోతాయి. ఏ జర్నీ చెయ్యాలన్నా విసుగులేకుండా క్యూలలో నిలబడాలి—అక్కడ అంతా ఫెర్ ఫెక్ట్ సిస్టమ్—ప్రతిది క్యూ—అలా క్యూలో ముందుకు వెళ్లే ఎక్కాలి-ఎక్కేవాళ్ళు ఎక్కుతూ వుంటారు—దిగేవాళ్ళు దిగి యింకో దారంట బయటికి వెళ్లాలి. మరో జర్నీ—యిలా ప్రతిచోట జనం పుట్టలు పుట్టలు—అన్ని లక్షల మంది వున్నా ఎక్కడా తొడతొక్కిడి తోపులాటలు, గలాటాలు లేకుండా ప్రతి దీసిస్టమేటిక్‌గా సాగిపోతుంది.

ఓ మూడుగంటలు అక్కడ ఎంజాయ్ చేసి మళ్ళీ బసెక్కి.... సాయంత్రానికి కొలోన్ చేరాం.

అన్నట్టు ఈ రోడ్డు ప్రయాణం గురించి చెప్పే ముందు ఇక్కడ 'రోడ్‌వేస్' గురించి, రోడ్ల విషయంలో పాశ్చాత్య దేశాలు ఎంత అభివృద్ధి గాంచాయో ఎన్ని పేజీలు చెప్పినా తరగదు—ముందు విదేశం వెళ్ళగానే మనల్ని మొట్టమొదట ఆకట్టుకునేది, ఆశ్చర్యపరిచేవి అక్కడి రోడ్లు—ఇండియాలో మనరోడ్లు ఎంత అధ్వాన్నంగా క్రిక్కిరిసి, నడిచే చోటుకూడా లేకుండా రకరకాల వాహనాలతో, చెత్త, చెదారం, గుంటలు, కుళ్ళు కాల్వలు, చెత్త డబ్బాలతో నిండి వుంటుందో ప్రతివారికి తెలుసు. ఇలాంటి రోడ్లు చూసి వెళ్ళిన మనం అక్కడ రోడ్లు చూసి దిగ్భ్రాంతి చెందుతాం-ఒక్క కాగితం ముక్కగాని ఓ గతుకులు, గుంటలు, దుమ్ము ఏమీలేకుండా నున్నగా వుంటాయి ఆ రోడ్లు ఎంత వెడల్పాంటి రోడ్లు— వెళ్ళేందుకు నాలుగు వరసలు, వచ్చేవాటికి నాల్గు లైన్లు. మధ్యలో ఫ్లైవోవర్స్—బారులు తీరి వెళ్లే కారులు. రోడ్డుమీద కార్లు, బస్‌లు, వ్యానులు లాంటిఫోర్ వీలర్స్ తప్ప యింకేం రకాల వాహనాలుండవు. విదేశాలలో ప్రతిమనిషికి ఒక కారు సర్వసాధారణంగా వుంటుంది. ఓ మాదిరి కుటుంబం అయినా భర్తకి భార్యకి విడిగా కార్లుంటాయి....యింకా ఎదిగిన టీనేజ్ పిల్లలుంటే కొత్త వున్నవారయితే వారికీ ఒక కారు! కనీసం కుటుంబానికి ఒక కారయినా లేని వారు సాధారణంగా మరీ బీదవారయితేతప్ప వుండరు నూటికి

తొంభై ఐదు మందికి కార్లుంటాయి. అక్కడ కార్లు చవక, పెట్రోలు అతి చవక—చక్కటి రోడ్లు—ఎంతదూరం వెళ్ళాలన్నా శ్రమలేకుండా సునాయాసంగా అతితక్కువ ఖర్చుతో వెళ్ళొచ్చు. ఆ దేశాలలో జనాభాతక్కువ కనక, వున్నవారంతా కారులలోనే ప్రయాణిస్తారు కనక రోడ్డుమీద జనమే కనపడరు— ఏ మార్కెట్ ప్రదేశాలలో తప్ప జనం నడుస్తూ కన్పించరు సాధారణంగా. అక్కడ పెట్రోలు గేలన్ 85 సెంట్సు— అంటే 4 లీటర్ల పెట్రోలు....10 రూ॥లనుకోవచ్చు యిండియా లెక్కల ప్రకారం. మనకి ఒక లీటరు పెట్రోలు—9 రూ॥—అక్కడ అన్ని ప్రయాణాల సాధనాలకంటే కారే చవక—కారున్నవాటికి. అంతేకాక దూరాలు ఎక్కువ కనక ప్రతివారికి కారు అవసరం. ఒక వూరు నించి ఒక వూరు వెళ్ళడానికి మనలా యిన్ని రైళ్ళు, యిన్ని బస్సులు వుండవు. వున్నవి కూడా మూడొంతులు ఖాళీగా వెడతాయి. అక్కడ ఒక వూరు నించి ఒక వూరు వెళ్ళడానికి బస్సులో, రైలులో వెళ్తే ఖరీదు ఎక్కువ. ఎందుకంటే ప్రతివాళ్ళు కారులో వెడతారు కనక రైళ్ళన్నీ ఖాళీగా వెడతాయి గనక రైలు ఖర్చు గిట్టాలంటే టిక్కట్టు ఎక్కువ వుంటుంది- కంపార్టుమెంటుకి (లోకల్స్ మాట కాదు దూర ప్రయాణాల సంగతి) నలుగురు ఐదుగురు కూడా వుండరు. అలాగే బస్సులలో నలభై సీట్లుంటే ఏ 10, 15 మంది వుంటారేమో. అందువల్లే టిక్కట్టు ఖరీదు ఎక్కువ పెడతారు. యూరప్, అమెరికా....యించుమించు అన్ని పాశ్చాత్య దేశాలలో రోడ్లన్నీ ఎంతో అభివృద్ధి చెందాయి. సిటీ లోపలే కాకుండా హైవేస్ అన్నీ కూడా ఒక్క గతుకు, గుంట లేకుండా ఎంతో నీట్‌గా వుంచుతారు. హైవేస్ అన్నీ తొంభై తొమ్మిది శాతం వెళ్ళేవి నాలుగు లైన్లు, వచ్చేవి నాలుగు లైన్లుమెన్ టైన్ చేస్తారు. ఆ నాలుగు లైన్లలో మొదటి లైను 100 కిలోమీటర్ల స్పీడు మెన్‌టైన్ చేయగల్గినవారు ఆ లైనులో వెడతారు— రెండో లైను 80 కిలోమీటర్లకి, మూడో లైను 60 దాటి వెళ్లేవారికి హెవీ వెహికల్స్‌కి కేటాయిస్తారు. నాలుగో లైను మీరే కారణం చేతనన్నా రోడ్డుమీద ఆగాలన్నా- ఏదన్నా రిపేరులు వచ్చినా ఆ లైనులోకి వెళ్ళి ఆగాలి. అక్కడ రోడ్లు

బాగుంటాయి. రోడ్లుమీద కార్లు తప్ప ఏవీ అడ్డురావడం అంటూ వుండదు కనక మార్గప్రయాణాలు చేసే వారందరూ గంటకి 80, 100 కిలోమీటర్లు వేగంతో వెళ్ళిపోతుంటారు. అందుకే ఎంతెంత దూరాలున్నా ఒక గంట రెండు గంటలలోపల 100, 150 కిలోమీటర్ల దూరం వెళ్ళిపోతారు. చాలా మంది సిటీకి దూరంగా అవుట్ స్కర్ట్స్‌లో వుంటారు. ఆఫీసులకి వెళ్ళాలంటే 50, 60 మైళ్ళ దూరం వాళ్ళు ఓ గంటలో వెళ్ళిపోగలుగుతారు. మీరు మొదటి లైనులో ఆ స్పీడు మెన్‌టైన్ చేయగలిగితేనే వుండాలి, లేదంటే వెనక కార్ల వారు మిమ్మల్ని క్రాస్ చేయలేక మీ వెనక అన్నికార్లు స్లో అయిపోయి ట్రాఫిక్ జామ్ అయిపోతుంది. ఏ కారణం చేతనన్నా, మీరు రెండోలైనులోకి స్పీడు తగ్గించదల్చుకుని రాదల్చుకుంటే ఓ లైను లోంచి రెండో లైనుకి రావడానికి చాలా జాగ్రత్తగా ఆ రెండో లైనులో కారు చాలా దూరంగా వుండగా చటుక్కున ఆ లైనులోకి రావాలి. అలా చూసుకుంటూ ఒక లైను నించి యింకో లైనుకి మారడానికి 5, 10 నిమిషాలు పడ్తుంది అప్పుడప్పుడు. అంత వేగంతో ఆ కార్లు వెడుతుంటాయి గనక ముందు కారు స్లో గాని అయిందంటే ఏక్సిడెంట్‌కి చాలా అవకాశం వుంటుంది. అలా చీమల బారుల్లా రోడ్ల మీద స్పీడుగా మూడు వరసల్లో కార్లు ప్రవాహంలా సాగిపోతుంటే మనలాంటివారం నోరు తెరచుకుని చూడాల్సిందే!

ప్రతి రోడ్డు మీద పది మైళ్ళకి ఓసారి ఎదురుగా ఎత్తుగా రోడ్డు నెంబర్, ఎగ్జిట్ నెంబర్, వూరి పేరు వుంటుంది. హైవేస్‌లన్నిటికీ ఎగ్జిట్ నెంబర్లుంటాయి. మీరు ఆమ్‌స్టర్ డామ్ నించి— జర్మనీలో కొలోన్‌కి ప్రయాణం చేసి వెళ్ళాలంటే ఆ హైవే నంబర్ పట్టుకుని వెళ్ళిపోవడమే! పెద్ద పెద్ద వూర్లని కలుపుతూ, [అంటే మన మద్రాసు కలకత్తా నేషనల్ హైవేస్‌లా] హైవేస్ వుంటాయి. ఆ హైవే మీదనించి మనం వెళ్ళవలసిన వూరి దారి మళ్ళించి ఇంకోరోడ్డు వస్తుంది. ఆ ఎగ్జిట్ నెంబర్ మళ్ళీ వేరు- ఊరి పేరు, ఎగ్జిట్ నెంబరు చదువుకుంటూ ఎంత కొత్తవారయినా డ్రైవ్

చేసుకుంటూ మైళ్ళకి మైళ్లు వెళ్ళిపోతారు. బాహాలు గుర్తులు వేసి మీరు వెళ్లాల్సిన ఊరుకి పదిమైళ్ళ ముందునించి మీ ఎగ్జిట్ నెంబరు యిది అని రాసి బోర్డులు తోరణాలలా ఎదురుగా వేలాడుతూవుంటాయి. ఆనంబర్లలో మీరేదన్నా నంబరు తప్పారంటే మళ్లీ మీరు వెంటనే మనదేశంలోలా కారు వెనక్కి తిప్పుకుని వెళ్లడానికి అవదు. ఎంచేత అంటే వెనకనించి స్పీడుగా అన్ని లైన్లలో కార్లు వస్తుంటాయి. దారి తప్పితే అలా ముందుకు కొంతదూరం 5, 10 మైళ్ళు వెడితే అక్కడ సర్కిల్‌లా— మన మద్రాసులో జెమినీ ఫ్లై ఓవర్‌లా ఐదారు పైపులకి రోడ్లు చీలి వుంటాయి. అంటే రోడ్ల కూడలి వెనక్కి తిరిగి వెళ్లాలంటే ఆ సర్కిల్ చుట్టి.... మళ్లీ కుడివైపు రోడ్డుకి వచ్చి వెనక్కి వెళ్లి ఆ దారి పట్టుకోవాలి. (యూరప్‌లో అంతా కుడివైపు ప్రయాణం—మనదేశంలో అంతా ఎడమ వైపు ప్రయాణం)—అంటే మీరు పొరపాటున ఎగ్జిట్ నెంబరు తప్పారంటే ఓ పదిమైళ్ళు ఆ సర్కిల్ వచ్చేవరకు వెనక్కితిరిగే వీలుండదు. హైవే మీద—ప్రతిది పకడ్బందీగా సిస్టమేటిక్‌గా కొత్తవారికి సహా తెలిసే విధంగా రోడ్ గుర్తులు, నంబర్లు వుంటాయి. అంతేకాక రోడ్డుమీద కూడా మన రైలు లైన్స్ మీద వున్నట్లు, గ్రీన్ లైట్, రెడ్ లైట్ గుర్తులు వుంటాయి. సాధారణంగా సమ్మర్ మూడు నెలల్లో వారు రోడ్లు మెన్‌టైన్, రిపేరు వర్క్ చేస్తుంటారు. మిగతా కాలాల్లో మంచు కనక ఎండాకాలం వారి మరమ్మతు కార్యక్రమాలుంటాయి. మూడేసి లైన్లుంటాయి గనక-ఓ లైనులో రిపేరు పనిచేస్తుంటే, 5, 6 మైళ్ల ముందునించే రెడ్ లైట్ సిగ్నల్ యిస్తారు ఆ లైనులో రాకూడదని. ఆ ఎర్రలైటు గుర్తు చూడగానే ఆ లైను వదిలి తక్కిన లైన్లలోకి కార్లు సర్దుకోవాలి. అంతే ఒక్కసారిగా చివరికి రోడ్డు అండర్ రిపేరు అని మనవాళ్ళలా పెట్టేస్తే వేల సంఖ్యలో కార్లు అన్నీ నిల్చిపోయి ట్రాఫిక్ జామ్ అయిపోతుంది. గనక ముందు నించే ఆ లైనులోకి రావద్దు అని హెచ్చరిస్తారు—అన్ని లైన్లున్నా అంత సిస్టమేటిక్‌గా ట్రాఫిక్ వున్నా ఒక్కొక్కసారి చీమల బారుల్లా అంగుళం అంగుళం బంపర్ టూ బంపర్ కదులుతూ గంటల కొద్దీ ట్రాఫిక్ జామ్ ఏర్పడిపోతుంటుంది. ముఖ్యంగా నగర పొలిమేర

ల్లోంచి సిటీలోకి ప్రవేశించేటప్పుడు ఎన్నో వందలు, వేల కార్లు నిల్చిపోతుంటాయి. మేం ఒకో వూరు నించి 3, 4 వందల కిలోమీటర్లు 4 గంటలలో ప్రయాణం చేసి వచ్చి వూరి పొలిమేరల్లోంచి వూళ్లోకి వెళ్ళడానికి రెండు గంటలు పట్టేది—అందులో సాయంత్రం $4\frac{1}{2}$ నించి $6\frac{1}{2}$ వరకు ఉదయం 7 గం॥ నించి తొమ్మిది వరకు ఆఫీసులు, స్కూళ్ళ సమయంలో చూడాలి ఆ కార్ల పుట్టలు! ప్రతి మనిషికి కారేమో....ఎటు చూసినా కార్లు తప్ప మనుష్యులు కనపడేవారు కాదు—ప్రవాహంలో అంతులేని కార్లు—అబ్బ రెండు కళ్లు చాలవనిపించేది ఆ దృశ్యాలు చూడ్డానికి! సిటీలో ప్రవేశించే ముందే ఎయిర్ పోర్టుకి దారి పదిమైళ్ళనించి చూపిస్తాయి బోర్డులు—మీరు ఎయిర్ పోర్టుకి వెళ్లి, వెళ్లాల్సిన ప్లైట్ తెలిస్తే....అంటే లండన్ ఎయిర్ పోర్టులో మీరు పానామ్ (Panam) ఫ్లైట్ ఎక్కాలంటే....ఎయిర్ పోర్టు దారి పది మైళ్ళ నించి చూపుతూ వుంటాయి గుర్తులు. ఎయిర్ పోర్టు ఓ రెండు మైళ్లు వున్న దగ్గరనించి ప్రతి టెర్మినస్‌కి వేరే వేరే ఎగ్జిట్ నెంబరు యిస్తారు. అంటే పానామ్‌కి ఒకటి, బ్రిటిష్ ఎయిర్ వేస్, ఎయిర్ ఇండియా, ఎయిర్ ఫ్రాన్స్, యిలా ప్రతి దేశ విమాన సర్వీసులకి ఒకో టర్మినస్ వుంటుంది ఎయిర్ పోర్టులో. మీరు ఏ విమానంలో వెళ్ళదల్చుకున్నారో ఆ ఎగ్జిట్ నెంబరు మీద వెడితే తిన్నగా ఆ రోడ్డు ఆ టర్మినస్ దగ్గరికి తీసికెడుతుంది. లేకపోతే లండన్, ఫ్రాంక్‌ఫర్ట్, న్యూయార్క్ లాంటి ఎయిర్ పోర్టులు మహాసముద్రంలా వుంటాయి. ఏ టెర్మినసో తెలియకుండా వెడితే ఆ ఎయిర్ పోర్టు చుట్టూ పదిహేను మైళ్లు రౌండ్లు తిరిగినా మీరు వెళ్లాల్సిన ఫ్లైట్ టెర్మినస్ తెలియక దారి వెతుక్కుంటూ కూర్చోడానికి గంటలు పడ్తుంది. అంత పెద్ద ఎయిర్ పోర్టులున్నవన్నమాట. ఒకో టెర్మినస్‌కి దారి వేరు. దానికి వేరే పార్కింగ్ స్థలాలు, వేలకొద్దీ కార్లు ఒకో టెర్మినస్ దగ్గర—ఆ కౌంటర్లు వేరు, ఆ లవుంజ్‌లు వేరు, ఆ సెక్యూరిటీ వేరు. ప్రతి టెర్మినస్‌కి అన్నీ వేరుగా వుంటాయి కనుక ఎయిర్ పోర్టుకి వెళ్ళదల్చినవారు, వాళ్ళ టెర్మినస్ చూసుకుంటూ ఆ నంబర్ల ప్రకారం వెళ్లాలి. ఎంత కొత్త వారయినా నంబర్లు జాగ్రత్తగా ఫాలో అయితే చాలు. మీరు అనుకున్న చోటికి దారి తప్పకుండా చేరతారు.

హైవేస్ మీద ప్రయాణం సులువే. ఎటొచ్చి సిటీలోకి వచ్చాక కొత్తవారు రోడ్డు మేప్ చూసుకుంటూ వెడతారు—సిటీలోను రోడ్లు, నెంబర్లు, క్రాస్ రోడ్లు అన్నీ గుర్తులూ వుంటాయి.

హైవేస్ మీద మేం బస్సు ప్రయాణం చేస్తున్నట్టే వుండేది కాదు. ఒక్క కుదుపు లేకుండా, ఎనభై, నూరు కిలోమీటర్ల మధ్య బస్సు వెడ్తుంటే విమానంలో కూర్చుని ప్రయాణం చేస్తున్నట్టే వుంది. రోజుకి 3, 4 వందల మైళ్లు తక్కువ కాకుండా ప్రయాణం చేసినా దిగేనరికి అలన టనేది లేకుండా ఫ్రెష్‌గా వుండేదంటే కారణం రోడ్లపరి శుభ్రత. హైవేస్ మీద ప్రతి ఏభై, అరవై మైళ్లకి పెట్రోలు బంక్స్, (గాస్ స్టేషన్ అంటారు) వుంటాయి—అక్కడ మన పెట్రోలు బంక్స్‌లా ఉత్తి పెట్రోలు మాత్రమే కాదు దొరికేది. అక్కడ రెస్టరెంట్సు, హోటల్సు, బాత్‌రూములు, రిఫ్రెష్‌మెంట్స్ ఎవరికేది కావాలంటే అది దొరుకుతుంది. మా ప్రయాణంలో 3 గంటలకొకసారి గాస్ స్టేషన్ దగ్గర బస్ ఆపేవారు. అక్కడ అందరం దిగి బాత్‌రూములకి వెళ్లే వాళ్లు వెళ్లేవారు. కూల్ డ్రింక్స్, స్నాక్స్....కాఫీ, టీలు ఎవరికేది కావాలంటే అది కొనుక్కునే వారు. పదిహేను నిమిషాలు టైము అనేవాడు మా లీడరు. ఆ గాస్‌స్టేషన్స్ దగ్గర వందల కొద్దీ కార్లు, బస్సులు ఆగి రోజూ వేల మంది ప్రయాణీకులు ఆ బాత్‌రూమ్‌లు ఉపయోగించినా ఎంత పరిశుభ్రంగా మెన్‌టైన్ చేస్తారో చూస్తే ముచ్చట వేస్తుంది. అక్కడ బాత్‌రూముల దగ్గర అటెండెంట్సు వుండి 25 పెన్నీలు, 25 ఫ్రాంకులు యిలా ఏ దేశ కరెన్సీ ఆ దేశంలో వసూలు చేసేవారు. అంటే మనకు ఇక్కడ పావలా లా అన్నమాట—ఇండియా నించి వెళ్ళేవారం అయితే అమ్మో 25, 30 పెన్నీలు అంటే నాలుగు రూపాయలా బాత్‌రూముకి వెళ్లడానికి అన్పించేది. కొన్ని గ్యాస్ స్టేషన్సులో బాత్‌రూములు ఉచితంగానే ఉపయోగించనిచ్చేవారు. గంట గంటకి బాత్‌రూములు క్లీన్ చేస్తూ ఎంతో నీట్‌గా వుంచుతారు. అంతేకాక అసలు అక్కడి మనుష్యులలోనే సివిక్ సెన్స్ వుంది. మన పని అయి పోగానే నీళ్లన్నా లాగకుండా వచ్చేస్తాం మనం అయితే. ఫారినర్స్ అయితే

ఫ్లష్ లాగి, సీటు శానిటరీ పేపరుతో తుడిచి మరీ వస్తారు. మన వారికి సివిక్ సెన్స్ తక్కువకి తోడు మన దేశ దౌర్భాగ్యం కొద్దీ పట్టణాలలోనే తాగే నీరు కరువయిన మనకి హైవేస్ మీద బాత్‌రూములు, ఆ బాత్‌రూములలో నీళ్ల అనే ప్రసక్తే లేదు కనక నీళ్ల మనం పొయ్యడం అన్న ప్రశ్నే లేదు. హైవేస్ మీద ఎంతెంత దూరాలున్నా అడవుల గుండా వెళ్లినా ప్రతిచోట నీటి సప్లై వుందంటే వారు ఎంత పురోగమించారో అర్థం చేసుకోవచ్చు. రోజుకి వేలమంది వెళ్ళే ఆ బాత్‌రూముల్లో మనిషి ఒకసారి ఫ్లష్ చేస్తే గేలను నీరు చొప్పున చూసుకున్నా ఎన్ని వేల గేలన్ల నీరు వప్లయ్ వుందీ ఆలోచించండి. మనం ఆ దశకి యిప్పుడు కాదు వంద ఏళ్లకన్నా చేరగలమా అన్నది సందేహమే!

హైవేస్ మీద ఇటు అటు పెద్ద పెద్ద చెట్లు—చిన్న చిన్న అడవుల మాదిరే చెట్లు పెంచుతారు వారు—ఎటు చూసినా పచ్చదనమే—ఎటు చూసినా మంచి చిత్రకారుడి పెయింటింగ్ మాదిరి లాండ్‌స్కేప్స్ కనపడతాయి. రోడ్డు మీద అక్కడక్కడ ప్రయాణీకులు కార్లు, బస్సులు ఆపుకుని లంచ్ వగైరా తినడానికి చెట్ల మధ్య కర్ర బెంచీలు, సిమెంటు బెంచీలు వేసి వుంటాయి. రోడ్ల మీద, ఆఖరికి అడవులలో నయితం తప్పనిసరిగా డస్ట్‌బిన్స్ వుంటాయి. హైవేస్ మీద కూడా మధ్య మధ్య డస్ట్‌బిన్స్ వుంటాయి. నాలుగు కార్లు, నలుగురు మనుష్యులు వుండే చోట ప్రతిచోట చెత్త డబ్బాలు పెట్టారు. ఎన్నో వేలమంది తిరిగే యాత్రాస్థలాల్లో నయితం కింద ఒక కాగితం వుండదు. ఏ ఐస్‌క్రీమ్ తిన్న కప్పుకాని, ఏ కోకో డబ్బాగాని, సిగరెట్టు పీకగాని కనపడదు. ప్రతివారు విధిగా డస్ట్‌బిన్ ఉపయోగింపుతారు.

యూరప్‌లో మన భారతీయులకి యిబ్బంది అయ్యేది ఒక్కటే విషయం - అమెరికాలో ఫరవాలేదు గాని యూరప్‌లో ఎక్కడ పడితే అక్కడ మంచినీరు దొరకదు. వాళ్లు మనలా నీళ్ల తాగరు—బీరు, కోక్ యిలాంటివి తాగుతారు దాహం వేస్తే. ఆ కారణంగా నీళ్లు ఎక్కడ పడితే అక్కడ దొరకవు. ఆ గ్యాస్ స్టేషన్స్ దగ్గర కూడా బాత్‌రూములలోనే

దొరుకుతాయి. ఆ నీళ్లు ఫిల్టర్డ్ వాటర్. ఆ బాత్‌రూము ఎంత శుభ్రంగా వున్నా సైకలాజికల్‌గా బాత్‌రూములో నీళ్లు తాగాలంటే సంకోచంగా వుంటుంది అఖరికి హోటళ్ళలో కూడా బాత్‌రూములలో నీళ్ళే పట్టుకుని తెచ్చుకుని తాగాలి—పరిశుభ్రమైన నీరు కనక మనకి బాధలేదు. మేం ముందు ఒకటి రెండు రోజులు చూసి ఎక్కడా నీళ్లు దొరక్క ఖాళీ కోక్ బాటిల్స్‌లో హోటలు నించి నీళ్లు నింపి బస్సులో పెట్టుకునేవారం. అక్కడ ఎప్పుడు చూసినా ప్రతివారి చేతిలో కోక్ డబ్బాలు, బీరు డబ్బాలు కని పిస్తాయి.

మొదట యూరప్‌లో జర్మనీ దేశం ఈ రోడ్‌వేస్ కొత్తవి వేసిం దట. రెండో ప్రపంచ యుద్ధం తరువాత యించుమించు నాశనం అయిన ఆ దేశాలు అంత త్వరగా కోలుకుని 1952 లో మొదట ఈ రోడ్లు వేసా రుట జర్మనీవారు. కొన్ని మిలియన్ డాలర్ల ఖర్చుతో ఈ రోడ్ల నిర్మాణం, బ్రిడ్జిలు, టన్నెల్స్ రోడ్లు, అండర్ గ్రౌండ్ రోడ్లు....ఎటు చూసినా సిస్టమేటిక్‌గా, నీట్‌గా మెన్‌టైన్ చేస్తున్న ఆ రోడ్లు చూస్తేనే చాలు వారు సాధించిన ప్రగతి అర్థం అవుతుంది. అంత చక్కటి రోడ్లు కూడా ప్రతి సంవత్సరం మంచుతో కప్పబడి పాడవుతాయని ఎప్పటి కప్పుడు ప్రతి ఏడు మంచు కరిగిన కాలం తరువాత రోడ్లు రిపేరు చేస్తూ అదే స్థాయిని మెన్‌టైన్ చేస్తూంటారు. హైవేస్ మీద కొండలుంటే ఘాట్ రోడ్లు అయితే ప్రయాణానికి అటంకం, ఆలస్యం అని బోలెడు ఖర్చుతో టన్నెల్స్ తవ్వి రోడ్లు వేసారు. అఖరికి టన్నెల్స్‌లో కూడా వెళ్ళేందుకు ఒక లైను వచ్చేందుకు ఒక లైను వుంటాయి. సిటీలో అయితే పై ఓవర్స్, ఎక్కువ జనసమర్థం వున్న చోట అయితే అండర్ గ్రౌండ్ నించి కూడా రోడ్లు వున్నాయి. న్యూయార్క్‌లో అయితే 'హడ్సన్' నదీ కిందనుంచే టన్నెల్ తవ్వి రోడ్డు వేసేసారు పది మైళ్ల పైన—ఈ రోడ్డుకి ఎన్ని వందల మిలియన్లు ఖర్చు పెట్టారో లెక్కలేదు.

మన ప్రభుత్వం తరఫున యింతమంది మంత్రులు, ఆఫీసర్లు విదేశ యానాలు చేసి వస్తుంటారు లక్షలు ఖర్చుపెట్టి. ఆ దేశాలు వెళ్లి యివన్నీ

చూసి వచ్చి ఏ ఒక్క మంచి నేర్చుకుని ఆచరణలో పెట్టరు. నిజమే అలాంటి రోడ్లు వెయ్యాలంటే కోట్ల రూపాయలు ఖర్చు అవుతుంది. భారత దేశం లాంటి బీదదేశం రోడ్లు కోసం అంత ఖర్చు పెట్టలేదు—అంటే అందులో నగం మాత్రమే వప్పుకోగలం - ఎందుకంటే మనం ఖర్చు పెడుతున్న డబ్బులో నిజంగా ఎన్నో వంతు రోడ్డు పనికి చేరుతుంది? రూపాయికి పావలా సరుకు అయినా రోడ్డు వేయడానికి ఉపయోగించడం. కంట్రాక్టరు లాభాలు, ఆఫీసర్ల లంచాలు, మంత్రుల వాటాలు యివన్నీ పోగా రోడ్డు పనికి వినియోగించే డబ్బు రూపాయికి పావలా అయినా వుండదు కనకే మన రోడ్ల స్థాయి అంత అధ్వాన స్థితిలో వుంది. రూపాయి పెట్టుబడిలో రూపాయి ఖర్చు చేస్తే వారి దేశాలంత బ్రహ్మాండమైన రోడ్లు వుండకపోయినా గుడ్డిలో మెల్లలా కొంతయినా బాగుపడతాయి. మన రోడ్లు దుస్థితికి తోడు మన ట్రాఫిక్ కూడా అలాంటిదే—బళ్లు, లారీలు, బస్సులు, సైకిళ్లు, ఆటోలు మధ్యలో ఆవులు, గేదెలు....యిలా ఒకటేమిటి నానారకాల ట్రాఫిక్కు వుండడంతో రోడ్లు తొందరగా పాడవుతాయి. ఒక వర్షం వస్తే పైపైన వేసిన కంకర, తారు కొట్టుకుపోయి గతుకులు గుంటలు మిగులుతాయి.

అవి బాగు చేయించడానికి ప్రభుత్వం శాంక్షన్ వుండదు. శాంక్షన్ వున్నా మళ్ళీ దాంట్లో వాటాలు, లంచాలు! మనకి డబ్బులోటు కంటే మన దేశంలో లోపించిన నిజాయితీ మనల్ని అన్ని విధాల అణిచేస్తోంది, రెడ్ టేపిజమ్—ప్రభుత్వంలో అవినీతి, పరిపాలకులలో స్వార్థ పరత్వం—ప్రజలలో అలసత్వం-మనకెందుకులే అన్న నిర్లక్ష్య వైఖరి, ఈ దేశం ఎవరిదో అన్నట్లు ప్రవర్తించే మన నిర్లిప్తత, సోమరితనం....ఒకటేమిటి యిలా చెప్తూంటే ఎన్నో కారణాలు కనిపిస్తాయి. మనదేశం పురోగమించక పోవడానికి కారణాలు—మనదేశంలో డబ్బు లేకకాదు. ఆ వున్న డబ్బు సద్వినియోగం అవడం లేదు అన్పిస్తుంది—విదేశాలు చూశాక ఆ వున్న డబ్బుతోనే నిజాయితి అన్నది వుంటే ఎన్నో సాధించవచ్చు—లక్షలకి లక్షలు ఎలక్షన్స్‌కి మంత్రుల విదేశ పర్యటనలకి, అన

వసర ఆర్భాటాలకి తగలేసే బదులు యిలాంటి పురోభివృద్ధి కార్యక్రమాలు ఎన్నో చేయచ్చు—మనలాంటి వాళ్ళం ఎంత వగచినా ప్రభుత్వ యంత్రాంగంలో మార్పు ఆఫీసర్లలో నిజాయితీ, ప్రజలలో పట్టుదల, దీక్ష లేనంత వరకు మనదేశం మిగతా దేశాల మాదిరి ప్రగతి సాధించలేదు అన్నది నిర్వివాదాంశం.

నేను ముందే చెప్పినట్టు అక్కడి రోడ్లు గురించి చెప్పడానికి ఎన్ని పేజీలైన చాలవు. యిండియానించి వెళ్ళిన వాళ్ళని ముందుగా ఆ దేశంలో ఆకట్టుకునేది ఆ రహదారి మార్గాలే!

ఇంక మళ్ళీ మన ప్రయాణం దగ్గరకి వద్దాం—ఎక్కడున్నాం మేము....దారిలో ఫాంటసీలాండ్ చూసి సాయంత్రానికి కొలోన్ చేరాం. ఆ రాత్రి 'హోటల్ క్రెస్ట్'లో వున్నాం. అన్ని హోటళ్ల బ్రహ్మాండంగా వున్నాయి. అక్కడ యిండియన్ రెస్టరెంట్ లేకపోవడంతో ఆ హోటలులోనే డిన్నర్లు ఏర్పాటు చేశారు. యూరప్ అంతటికీ అక్కడే భోజనం మరీ దారుణంగా వుంది. సూప్, రెండు ఉడకేసిన క్యాబేజీ ఆకులు, ఒక బన్ను నాలుగు క్యారట్ ముక్కలు, టమోటా ముక్కల సలాడ్....అదీ యిచ్చిన భోజనం! ఆఖర్న యిచ్చిన ఐస్క్రీమ్ కూడా ఆరంజ్ సుర్మలై ద్ది యిచ్చారు. చేదుచేదుగా అన్పించి అందరూ వదిలేశారు. అర్ధాకలితోనే లేచి పోయాం అందరం-మేం ప్రతి రోజు పెరుగు మాత్రం తప్పకుండా కొనే వాళ్ళం. ఐస్క్రీమ్ కన్టైనర్స్‌లాంటి వాటిలో పెరుగు ప్రతి డిపార్టమెంటల్ స్టోరులో దొరుకుతుంది. యోగర్ట్ అంటారు. ఇండియన్ రెస్టారెంటయినా పెరుగుండదు కనక అది లేందే మనకి భోజనం అయినట్లుండదు కనక పెరుగు కొనుక్కుని, తీసుకెళ్ళిన ఊరగాయలతో కాస్త మన భోజనం తిన్న తృప్తి లభించేది.

మర్నాడు కొలోన్ ఊరు అంతా చూపించారు—అక్కడ తోలు ఎలక్ట్రానిక్ సామాన్లు కొవాలనుకున్నవారు కొనుక్కోడానికి ఆ షాపులకు తీసికెళ్ళారు. హాండ్‌బ్యాగులు చాలా ఖరీదులో మనలాంటి వారికి అందుబాటులో లేకుండా వున్నాయి. ఉదయం కొలోన్ ఊరు. ఓ పెద్ద కేథడ్రిల్

(చర్చి) చూపించారు. అక్కడ నించి మధ్యాహ్నం లంచ్ అయ్యాక ఫ్రాంక్‌ఫర్ట్‌కి ప్రయాణం అయ్యాం.

కొలోన్, ఫ్రాంక్ ఫర్ట్ పశ్చిమ జర్మనీలోనివి—వెస్ట్ జర్మనీకి రాజధాని ఫ్రాంక్‌ఫర్ట్-యూరప్ అంతటిలోకి జర్మనీలో ఊళ్ళు, రోడ్లు అతి శుభ్రంగా వున్నాయి. అంత నీట్‌గా కాగితం ముక్క కూడా కనపడకుండా మెన్‌టైన్ చేస్తున్నారు అక్కడ అంటే ప్రభుత్వ యంత్రాంగానికి పనిపట్ల నిజాయితీ, శ్రద్ధ అంత బాగావుందని తెలుస్తోంది. రెండవ ప్రపంచ యుద్ధంలో అన్నింటి కంటే బాగా దెబ్బతిన్న దేశాలు జర్మనీ, జపాన్‌లు. కాని ఒక్క పది పదిహేనేళ్ళలోనే ఆ దెబ్బనించి తేరుకుని వారు ఎంత త్వరితగతిని ప్రగతి సాధించారో చూస్తే ఆశ్చర్యంవేస్తుంది. మనిషి దెబ్బతింటేనేపంతం, పౌరుషం తలెత్తుతాయేమో! మిగతా దేశాలకంటేమనం వెనకబడకూడదన్న పట్టుదల ఆ దేశంలో వుండబట్టే ఈనాడు జర్మనీ ఎలక్ట్రానిక్ రంగంలో అందెవేసినచెయ్యి అయింది. వారికి అమెరికా ఆర్థిక అండ వున్నా ప్రజలలో ప్రభుత్వంలో ఏదో సాధించాలన్న తపన వుండబట్టే అంతలా పురోగమించ గలిగాయి—ఆ యూరప్ దేశాలు చూశాక ఇండియా మీద ఏ అణుబాంబో వేస్తే ఈ లంచగొండితనం, సోమరితనం, అవినీతీ, అధర్మం, అసత్యం అనేవన్నీ నేలమట్టంఅయి—కొత్త భారత దేశం పుట్టుకు వస్తుందేమో, కొత్త ఆశలతో కొత్త ఊపిరితో నవ చైతన్యంతో నూతన శకానికి నాంది పలికే భారతదేశం అవతరిస్తుందేమో అన్పించింది. అక్కడి ప్రజలు కష్టాలు పడ్డారు కననే వారికి దేశం అంటే అంత భక్తి గౌరవం!

ఫ్రాంక్ ఫర్ట్ చాలా మోడర్న్ సిటీ. మొత్తం పెద్దపెద్ద బిల్డింగులు, కర్మాగారాలు, ఇండస్ట్రీస్, ఆధునికత అడుగడుగునా కన్పిస్తుంది. ఆ ఎయిర్‌పోర్టు చూస్తేనే ఫ్రాంక్‌ఫర్ట్ ప్రాముఖ్యం అర్థం అవుతుంది. ఫ్రాంక్‌ఫర్ట్ సిటీ తప్ప పెద్దగా చూడాల్సినవి ఏమీ లేవు కనక ఓవర్‌నైట్ స్టేకి మాత్రం 'హాలిడే ఇన్' హోటల్లో వున్నాం—

మర్నాడు ఉదయం మళ్ళీ ఫ్రాంక్‌ఫర్ట్ నించి 'జూరిచ్' బయలు దేరాం—తోవలో బ్లాక్ ఫారెస్ట్ గుండా పెడతాం-ఘాట్‌రోడ్డు, టన్నెల్స్ దట్టమైన అడవిగుండా ప్రయాణం.

యూరప్‌లో ఎటుచూసినా పచ్చదనమే ఎటు చూసినా చెట్లు చేమలు యూరప్ మొత్తం మంచి చిత్రకారుడు గీసిన పెయింటింగ్‌లా వుంటుంది. యూరోపియన్ దేశాలుఅన్నీ తమ అటవి సంపదని, వృక్షసముదాయాన్ని అతిజాగ్రత్తగా కాపాడుకుంటున్నాయి. వాళ్ళుపదిచెట్లుపాతి, ఒక చెట్టుకొడితే మనం పది చెట్లు కొట్టి ఒక చెట్టును కూడా పాతం. మనదేశంలో ఏ దేశానికీ తీసిపోని, యింకా ఎక్కువే అడవి సంపదవుంది. కాని తెలివి తక్కువగా మనం చేతులారా మన అడవులన్నీ నరికి నాశనం చేసుకున్నాం. దాంతో వర్షాలు కరవయి అనావృష్టికిలోనై స్వాతంత్ర్యం వచ్చి నలభై ఏళ్లయినా తాగేనీటికి కూడా కరవయి బతుకుతున్నాం మనం. అడవులలో వృక్ష సంపదని చేతులారా నాశనం చేసుకున్నాక మన ప్రభుత్వం యిప్పుడిప్పుడే మేల్కొని చేసిన పొరపాటు తెల్సుకుంది. వాళ్ళు ఒక మొక్క అనవసరంగా సిటీమధ్యనున్నా నరే కొట్టరు. ప్రతీచోట వూరిమధ్య వూరి బయట ఎక్కడ చూసినా పెద్ద వటవృక్షాలలాంటి సేదతీర్చే చెట్లు, పొదలు, లతలు, ఉద్యానాలే కనిపిస్తాయి. వారు అడవులన్నీ అతి జాగ్రత్తగా కాపాడుకుంటున్నారు కనకే వారికి నీటికొరతలేదు. యూరప్‌లో మూడొంతులు అన్నీ 'పైన్' వృక్షాలెక్కువగా కనిపిస్తాయి. అవి పొడుగ్గా పెరుగుతాయి. ఆ చెట్లు తాలూకు మాను పొడుగ్గా వుండడం వల్ల కలపకి బాగా పనికివస్తుంది. యూరప్, అమెరికాలలో మొత్తం యిళ్లన్నీ కలప ఉపయోగించే కడతారు—అంటే వారి అడవులలో ఎంతగా వృక్షాలు పెంచుతున్నారో ఆలోచించండి— యిళ్ళ కప్పులు, లోపల గోడలు అన్నింటికి కర్రనే ఉపయోగిస్తారు. యూరప్‌లోని యిళ్లన్నీ యించుమించు ఒకలాగే వుంటాయి. పెద్ద పెద్ద భవంతులు తప్ప మిగతా విడివిడి యిళ్ళు అన్నీ మన పెంకుటిళ్లమాదిరి చూరుతో కప్పు వుంటుంది— అలాంటి చూరుతో కప్పు వుంచడానికి కారణం శీతాకాలం యిళ్ళు అన్నింటి మీదా

మంచు పేరుకుంటుంది గనక మంచుకరగి నీరయి కిందకి జారడానికి వీలుగా అలా కడతారు. సిమెంటు, యిటుకలతో చేసిన యిళ్లకంటె కర్రతో చేసిన యిళ్లు వేడిగా వుంటాయి. అక్కడ చలి విపరీతం కనక అలాకడతారుట- యూరప్‌లో యిళ్ళు చూడడానికి చాలా అందంగా మంచి నిలువెత్తు గాజు కిటికీలు, పెంకులతో చూరు, లేసు పరదాలతో చాలా అందంగా కని పిస్తాయి. పై నించి పెంకుటిల్లులా కన్పించినా లోపల అంతా ఆధునికంగా వుంటాయి. వారికి అలాంటిపాత మాడల్ యిళ్లే ఫేషనుట. విక్టోరియన్ స్టైపు యిళ్ళు అంటే వారికి మోజు— కొత్త డబ్బున్న వారందరూ విడి విడిగా వున్న యిళ్లే కట్టుకుంటారు. ఎంత పెద్దయిల్లయినా కర్రతో ఫ్లోరింగ్, గోడలు, కప్పు అంత కర్రే ఉపయోగిస్తారు. అందంగా వున్నా ఆ యిళ్ళు మన యిళ్లలా గట్టిగా వుండవు—కర్రల పొరల మధ్య దూది పెట్టి గోడలుగా ఉపయోగించడంతో వేడి వుంటుంది కాని, మన కాంక్రీట్ యిళ్ల మాదిరి గట్టిగా వుండవు—తోస్తే పడిపోతాయేమోనని అన్పింస్తుంది మనకి. సౌండ్ ప్రూఫ్ కూడా కాదేమో కర్ర నేల అవడంతో కిచు కీచుమంటు శబ్దాలుంటాయి—వాల్ టూ వాల్ కార్పెట్ వేసినా నడుస్తుంటే కర్రచప్పుడు అవుతుంది సౌండ్ ప్రూఫ్ కాకపోవడంతో మాటలు బాగా వినిపిస్తాయి—బాత్‌రూములో పైపువిప్పితే యిల్లంతా శబ్దాలు వినిపిస్తాయి. యూరప్‌లో యిళ్ళు చాలా ఆధునికంగా వున్నా బెడ్‌రూములు మూడునాల్గు వున్నా బాత్‌రూములు మనలా ఎక్కువ కట్టరు. మనలా ఒక్కో బెడ్ రూముకి ఒకో ఎటాచెడ్ బాత్‌రూములుండవు—ఫుల్ బాత్‌రూము, హాఫ్ బాత్‌రూము అంటారు. ఫుల్ అంటే బాత్‌టబ్ స్నానం చేయడానికి వుంటుంది. రెండోది కేవలం కమోడ్, వాష్‌బేసిన్ వున్నది వుంటుంది—మన ఇండియన్స్‌ని అడిగితే, 'యిప్పుడింకా నయం రెండోది ఆఫ్ బాత్‌రూమయినా కట్టిస్తున్నారు. లేకపోతే రెండుమూడు బాత్‌రూముల యిళ్లయినా ఒకటే బాత్‌రూమ్ వుంటుంది' అన్నారు. దానికి కారణం అక్కడ వాతావరణ స్థితి—అక్కడ ఏడాదిలో ఆరు నెలలు విపరీతమైన చలి, మూడు నెలలు ఒకమాదిరి చలి, ఓ రెండునెలలు మాత్రం కాస్త

సూర్యుడు కనపించే వేడి వుండడంవల్ల మనలా వాళ్లకి స్నానాలు అక్కర లేదు. ఆ స్నానం కూడా వారు రాత్రి పడుకోబోయే ముందు చేస్తారు—ఉద్దయం లేచి హడావిడిగా ఆఫీసులకి, స్కూళ్లకి వెళ్లే వారికి తలో బాత్‌రూము అక్కరలేదు. లేచి వళ్ళు తోముకుని, బట్టలు మార్చుకుని వెళ్లిపోతారు వాళ్ళు—రాత్రి సావకాశంగా డిన్నరు తరువాత పడుకోబోయే ముందు స్నానం చేస్తారు కనక ఒక్కొక్కరు తొందర లేకుండా స్నానం చేయడం కారణం అయివుంటుంది.

అక్కడ యిళ్లకి పై పక్కన ఇటుకలతో కట్టిన గోడలు వుంటాయి—వాటికి ప్లాస్టర్ చేసి మనలా పెయింట్ వేయరు. ఇటుకలు కన్పించేటట్టే వుంచేస్తారు. కారణం మంచు, వర్షంకి ప్రతి ఏడాది గోడలు పెయింటు పోయి పాడవుతాయి కనక అలా యిటుకలు కన్పించేటట్టు వుంచేస్తే అందానికి అందం మెయిన్‌టెనెన్స్ చవక, సులభం. అక్కడ ఎంత పెద్ద పెద్ద భవంతులు, యిళ్ళు గాని మన ఇండియాలోలా యింటికి యింటికి పదడుగులు మధ్యన దూరం వుండాలి లాంటి నిబంధనలు వుండవు—ఒక భవంతి గోడకి రెండో భవంతి గోడకి మధ్య అసలు ఖాళీ లేకుండా ఒకదానికొకటి ఆనుకుని కట్టేస్తారు. అక్కడ మనలా వారికి వెంటిలేషన్, గాలి సమస్యలేదు కనక అలా ఖాళీలేకుండా కట్టేస్తారు. దాంతో వరుసగా కిటికీలన్నీ ముందువైపు మాత్రమే కనిపిస్తూ ఇళ్ల మధ్య సందులు లేకుండా నీట్‌గా వరసలుగా కనిపించి బిల్డింగులు బాగున్నాయి. ఆ యిళ్లల్లో అన్నింటికన్నా చూడగానే కొట్టచ్చినట్టుకనిపించేవి నిలువెత్తు గాజు అద్దాల కిటికీలు—ఒక్క మరక దుమ్ము లేకుండా తళతళలాడుతూ వెనకనుంచి మంచి వల్చటి లేసు పరదాలతో అందంగా వుంటాయి. ప్రతి వారు తప్పనిసరిగా యింటిముందు లాన్, పూలతోట పెంచుతారు—అక్కడి వాతావరణం (ఒక్క మంచుకాలం మినహా) బాగుంటుందేమో పూల మొక్కలు రంగు రంగుల పూలతో విరిసివుంటాయి. ముఖ్యంగా ఆమ్‌స్టర్ డామ్, లండన్, స్విజర్లండులలో, ఆస్ట్రియాలలో విరగబూసిన రంగు రంగుల పూల మొక్కలు కన్నుల పండుగలా కనిపిస్తాయి. హాలండ్ 'టులిప్స్‌కి' ప్రసిద్ధి—మేం జూలైలో వెళ్ళడం వలన 'టులిప్స్'

చూడలేకపోయాం—సెప్టెంబరు నించి పూస్తాయట—యూరప్‌లో ప్రజలు శుభ్రత ఎక్కువ పాటిస్తారు. ఆడ మగ అంతా కష్టపడి పనిచేస్తారు—వారానికి ఒక రోజు యిల్లంలా తళతళలాడే లాగ గాజు అద్దాల దగ్గిర నించి, బాత్‌రూముల వరకు రుద్ది రుద్ది నీట్‌గా పెట్టుకుంటారు యిళ్లు—వాళ్ళయిల్లే కాకుండా వాళ్ళ వీధి, వాళ్ళ వూరు, వాళ్ళ దేశం గురించి శ్రద్ధ చూపుతారు—వాళ్ళ జీవన విధానం అంతా సిస్టమేటిక్‌గా వుంటుంది. అడవులు, చెట్ల గురించి చెపుతూ యిళ్ళ గురించి చెప్పాను–నిజంగా మేం బస్సులో వెళ్ళకపోతే యూరప్‌లో కంట్రీసైడ్ ఏమీ చూడలేకపోయేవారం. ప్లేనులో వెళ్ళి గంటల తరబడి సెక్యూరిటీ, వీసా చెకింగులలో వేస్టు చేసి, ఏదో ఒక్క పట్టణం మాత్రం చూడకుండా— యిలా బస్సులో వెళ్ళడం వల్ల మొత్తం యూరప్ అంతా చూసిన అనుభూతి–వాళ్ళ గ్రామాలు, ఆ దేశం అడవులు, కొండలు, నదులు, బిల్డింగులు అన్నీ చూసే అవకాశం లభించింది. ప్లేనులో వెడితే ఏం చూడగలం?

మేం కంట్రీసైడు వెడ్తుంటే మధ్య మధ్య చిన్న చిన్న వూళ్లు కన్పించేవి. గోధుమ పొలాలు, యాపిల్ తోటలు, ద్రాక్ష తోటలు కన్పించేవి. పాడికి ప్రసిద్ధమైన హాలండ్‌లో మాకెక్కడా ఏ రోడ్డు మీదా ఒక్క ఆవు కన్పించలేదు—పొలాల్లో ఒక్క మనిషి పనిచేస్తూ కన్పించలేదు. అంత పంట పండిస్తూ, అంత పాలు, జున్ను, పాలపొడి అవీ తయారుచేసే దేశాలలో యిదంతా ఎక్కడ ఎలా జరుగుతుందో....అసలు మనుష్యులే లేరు. ఒక్క ఆవు కన్పించదు అన్పించేది. మన దేశంలోలాగ ఆవులు గేదెలు రోడ్లమీద, పొలాల్లో మేయవు. వాటికి ప్రత్యేకం 'రెంచెస్' వుంటాయి—అక్కడే పెంచుతారు. మన పొలాల్లో రైతులు, కూలీల మాదిరి యింత మంది అక్కరలేదు వారికి. ప్రతిది యంత్రంతో చేసేస్తారు. దున్నడం, విత్తులు జల్లడం, మందు జల్లడం, పంట కోయడం–ఆఖరికి కోసిన గడ్డి కూడా రోలర్‌లాగ (దారం వుండలా) చుట్టేసే మిషనులున్నాయి. ఏభై మంది చేసే పని ఒక మిషను చేసేస్తుంది కాబట్టి ఆ పొలాన్ని, తోట తాలూకు యజమాని, వాళ్ళ కుటుంబం మాత్రం చూసుకుంటారు.

ఆ పనులు—యాపిల్ కాలంలో, ద్రాక్ష కాలంలో మాత్రం డబ్బు యిచ్చి కాయలు కోసేందుకు మనుష్యులను పెట్టుకుంటారు. వీళ్లింత పంట పండించి స్వయం సమృద్ధిగా వుంటున్నారు. మనుష్యులే లేరు ఎక్కడా అన్పించి వీరింత పని ఎలా చేస్తారో తెల్సుకున్నాక ఆశ్చర్యం అన్పించు తుంది—ఈ విషయాలలో మా సందేహాలన్నీ లోకల్‌గైడ్‌ని అడిగే వాళ్ళం—అన్నింటికన్న ఆ దేశాల పురోగతికి ముఖ్యకారణం—జనాభా కంట్రోలు! మనదేశంతో పోలిస్తే యూరప్ దేశాలలో జనాభా చాలా చాలా తక్కువ— అందులో జర్మనీ, ఆస్ట్రియా, హాలండ్, స్విజర్లండు యీ దేశాలలో జనాభా చాలా తక్కువ అవడం-సహజ వనరులు అధికం (అంటే నదులు, మంచి భూములు, వాతావరణం) అనుకూలం అవడం వల్ల, పంటలు బాగా పండించి స్వయం సమృద్ధి సాధించారు. ఆ దేశాలు తిన్నంత తిని మన దేశంలాంటి దేశాలకి సహాయం కూడా చేయగలుగు తున్నాయి—ఇక్కడ మనదేశంలో మనం కుటుంబ నియంత్రణ పాటించిన వారికి డబ్బులిచ్చి ఎంకరేజ్ చేస్తే అక్కడ పిల్లలని కన్నవారికి అనేక సౌకర్యాలు, సదుపాయాలు యిచ్చి పిల్లలను కనమని ప్రోత్సహిస్తున్నారు. యూరప్‌లో చాలా దేశాలలో పిల్లల్ని కనే తల్లులకి అనేక రకాలుగా ఆర్థిక సహాయం, సౌకర్యాలు యిస్తారు. పిల్లల పెంపకాలకి డబ్బు, చదువుకి డబ్బు, వైద్యానికి డబ్బు—ఉద్యోగాలు చేసే తల్లులకి క్రీ చేవి కేత్ సెంటర్ సౌకర్యాలు యిచ్చి ప్రోత్సహిస్తున్నారు. ముఖ్యంగా రెండో ప్రపంచ యుద్ధం తరువాత జనాభా చాలా తగ్గిపోయిందిట ఆ దేశాలలో. తరువాత అక్కడ వివాహ పద్ధతులు, స్వేచ్ఛా ప్రణయాల వల్ల కుటుంబ జీవనం తగ్గి పిల్లల జనన సంఖ్య తగ్గిపోయింది. దాంతో ప్రభుత్వం అనేక రకాల సదుపాయాలు యిచ్చి కుటుంబ జీవనానికి ప్రతివారిని ప్రోత్సహిస్తున్నారు— యిప్పుడిప్పుడే ఆ దేశాలలో తిరిగి భార్యాభర్త పిల్లల కోసం కల్సి బతకాలనీ, కుటుంబం నిల్పుకోవాలనీ ఆరాటపడ్తు న్నారట. పంటలు ఎక్కువ, జనాభా తక్కువ అవడంవల్ల, ఆ డబ్బు పారిశ్రామికాభివృద్ధికి ఎక్కువ తోడ్పడింది. అన్నింటికంటే ముఖ్యం ఆ దేశంలో ఎవరూ పూరికే వుండరు. కష్టపడి నిజాయితీగా బతకాలను

కొంటారు. ఏ పని చెయ్యడం ఆత్మన్యూనత అనుకోరు కనక ప్రగతి సాధించారు. వారంలో ఐదురోజులు ఎంత నిజాయితీగా పని చేస్తారో మిగతా రెండురోజులు అంత జల్సాగా తిరుగుతారు—కష్టపడడం తెలుసు, లైఫ్ ఎంజాయ్ చేయడమూ వారికే తెలుసు!

బ్లాక్ ఫారెస్ట్ గురించి చెపుతూ చాలా దూరం వెళ్ళిపోయాను—బ్లాక్ ఫారెస్ట్ అని ఎందుకు పేరు వచ్చిందంటే—దట్టమైన చెట్లతో ఆ అడవి వెలుతురు చొరపడకుండా పెద్ద పెద్ద కొండలని తాకేటంత పొడవైన చెట్లతో నిండివుంటుంది కనక ఆ పేరు వచ్చింది. బ్లాక్‌ఫారెస్ట్ దాటగానే 'రైన్' జలపాతం దగ్గరికి తీసికెళ్ళారు. చుట్టూ కొండలు, నది—అడవి—వాటర్‌ఫాల్స్ - అదో పెద్ద టూరిస్ట్ ప్లేస్—అడవిమధ్య రెస్ట రెంట్సు, హోటల్సు, రెస్టు రూములు అన్నీ వున్నాయి. అక్కడ ఫాల్స్ దగ్గిరకి బోట్ రైడింగ్ వుంది—ఫాల్స్ మధ్యకి బోట్ రైడింగు తిప్పి తీసుకొచ్చారు—అక్కడ కాఫీలు టీలు తాగి కొంతసేపు విశ్రాంతి తీసుకుని మళ్ళీ బస్సులో ప్రయాణం మొదలుపెట్టాం. 4, 5 వందల కిలోమీటర్లు మధ్య మధ్య ఆగుతూ 7,8 గంటలలో చేరాల్సిన చోటికి చేరిపోయేవారం. ఫ్రాంక్‌ఫర్ట్ నించి 'జూరిచ్' చేరేనరికి 7 గంటలు దాటింది. ఆ హోటలు లోనే డిన్నరు ఏర్పాటుచేసారు. జూరిచ్, స్విట్జర్లాండు ముఖ్య పట్టణం. హోటలు పేరు మూవ్ ఎన్‌పిక్ (Move en Pick) గమ్మత్తుగా అన్పిం చింది. మర్నాడు జూరిచ్ వూరు అంతా చూపించారు. గ్రాస్ మన్‌స్టర్ చర్చి, సోన్నెవ్ బెర్గ్ విశ్వవిద్యాలయం, లేక్ ఏరియా, షాప్స్ అవీ చూపించారు. స్విజర్లండు వాచీలకి ప్రసిద్ధి—రకరకాల గడియారాలు—కొక్కో వాచీలు ఎవరికి కావల్సినవి వారు కొన్నారు.

జూరిచ్ తరువాత ఇన్స్‌బ్రక్—(ఆస్ట్రియా) మా తరువాత ప్రయాణం. ఆస్ట్రియా చాలా చిన్నదేశం — అయినా ఎంత బాగుందో చెప్పలేం—చాలా అందంగా, నీట్‌గా వుంది. మంచి గ్రీనరీ, పూల తోటలు .. చాలా బాగుంది. మనుషులు కూడా అందంగా వున్నారు. జనాభా 80 లక్షలు మాత్రం—అంటే మన కలకత్తా బొంబాయిలో వుండే

జనాభా ఆ దేశం మొత్తం జనాభా. చాలా చలిగా శీతాకాలం విపరీతంగా మీటరు ఎత్తున మంచుతో కప్పబడ్తుంది. పన్నెండో శతాబ్దం నాటిది ఇన్స్‌బర్క్. ఆ దేశంమీద రెండో ప్రపంచ యుద్ధంలో 22 సార్లు బాంబులుపడి పూర్తిగా నాశనం అయిందట. కాని వారు ఆ దెబ్బనించి చాలా త్వరగా కోలుకుని అంత అభివృద్ధి పొందడం నిజంగా అభినందించ దగినది. అక్కడ నీటి వనరులు పుష్కలంగా వుండడంతో పంటలకి కొదువలేదు. జనాభా తక్కువ—అందుకే పిల్లల పోషణ చదువు అంతా ప్రభుత్వమే చూసుకుంటుంది.

ఇన్స్‌బర్క్‌లో చూడాల్సినవి చాలానే వున్నాయి—18వ శతాబ్దపు హోఫ్‌బర్గ్ పాలస్ (రాజుగారిది) వింటర్‌లో స్నోలో ఆటలాడే స్థలాలు. మాక్సిమిలన్ సమాధి. ఇంపీరియల్ చర్చ్....అన్నీ చాలా బాగున్నాయి. నిజంగా హోఫ్‌బర్గ్ పాలస్ లోపల చూడడానికి రెండు కళ్ళు చాలవు అన్పించింది. మాతో మంచి సరదా అయిన లోకల్‌గైడ్ వచ్చింది. గైడ్ లేకపోతే భాషరాని ఆ దేశాలలో మనకేం అర్థంకాదు. ఆ సైన్ బోర్డులు కూడా ఆ భాషలోనే వుంటాయి. అక్షరాలయితే యూరప్ మొత్తాన యింగ్లీషు అక్షరాల మాదిరేగాని భాష వేరవడంవల్ల మనకు అర్థంకాదు. అంతేకాక అక్కడ అన్ని బిల్డింగులు ఒకే మోస్తరుగా వుంటాయి. కాలేజీలు, యూనివర్శిటీలు, హాస్పటల్, హాస్టల్-థియేటర్, లేబరేటరీ.... ఏదయినా అన్నీ యించుమించు బిల్డింగులు ఒకే మాదిరిగా వుంటాయి. మన ఇండియాలో మాదిరి కాలేజీ, స్కూలు. సినిమా హాలు, ఆఫీసు యిలా వేరుగా వుండవు. అంచేత రోడ్డుమీద గైడు లేకుండా మనంతట మనం తిరిగితే ఏమీ అర్థంకాదు. ఆ గైడ్‌ని రకరకాల ప్రశ్నలు అడిగే వారం వాకెదేశం గురించి పాపం ఓపిగ్గా దేశవిస్తీర్ణం. జనాభా—కాలేజీలు, యూనివర్శిటీలు, ఆస్పత్రులు యిలా అన్ని వివరాలూ చెప్పేది. మా కుర్రకారు—గైడు వెళ్ళాక ఆవిడ యింగ్లీషు మాట్లాడిన తీరు చెప్పేతీరు అనుకరిస్తూ నవ్వించేవారు.

నిజంగా ఆ బస్సు ప్రయాణంలో మేం 42 మందిమి ఒక కుటుంబంలా ఎంజాయ్ చేశాం. మొదట మూడు రోజులు కొత్త కొత్త. హలోలతో సరిపెట్టాం. తరువాత ఇరవై రోజుల్లో ఎవరి దారిన వాళ్ళం విడిపోవాల్సి వచ్చేసరికి అందరికి ఒకరితో ఒకరికి ఎటాచ్‌మెంట్ వచ్చేసింది. బస్సులో స్టీరియో మ్యూజిక్, కుర్రాళ్ళంతా చప్పట్లు చరుస్తూ పాటలు పాడేవారు. మా జరీన్‌ని (లీడర్‌ని) అనుకరిస్తూ 'లేడీస్ అండ్ జంటిల్‌మాన్ టు మారో వేకప్ కాల్ ఎట్ సిక్స్—బ్రేక్‌ఫాస్ట్ $7\frac{1}{2}$.... 8 వుయ్‌విల్ లీవ్ ...8 షార్ప్' అని వెక్కిరిస్తూ నవ్వించేవారు. జరీన్ మాతో సరిగా కల్సిపోయి జోకులు వేసేవాడు. బస్సులో తెచ్చుకున్న ఫలహారాలు ఒకరివి ఒకరం పంచుకుని తినేవాళ్ళం—నలభై మందికి ఎలాగూ పంచలేం....మా తెలుగు గ్రూప్ పదిమందిమి సాధారణంగా పంచుకునే వారం—గుజరాతీ వాళ్ళు పాపం వాళ్ళు తెచ్చుకున్న రొట్టెలు యిచ్చేవారు పచ్చిమిరపకాయ ఊరగాయతో మేం తెచ్చిన ఊరగాయలు, జంతికలు, చేగోడీలు, రవ్వలడ్డు ఆఫర్ చేసేవారం. దుబాయ్‌నుంచి, అబుదాబి నించి వచ్చిన వాళ్ళకి డాలర్లకి లోటులేదు. కనక ఎక్కడ ఆగితే అక్కడ రెస్టరెంటులో లంచ్‌లు తినేవారు. కుర్ర సజ్జుఅంతా ఆగినపుడల్లా కోక్‌లు, ఐస్ క్రీములు, హాట్‌డాగ్స్‌లాంటివన్నీ శుభ్రంగా ఖర్చుపెట్టి తినేవారు. మాలాంటి కుటుంబీకులం—అందులో మన దక్షిణాదివారం చూస్తూ చూస్తూ విచ్చలవిడిగా ఖర్చుపెట్టలేం గనక, ఖర్చు పెట్టగలిగినా వాళ్ళ తిళ్ళు మనం తినలేం గనక లంచ్ ఏదో తెచ్చుకున్నవి తిని గడిపేవారం-గుజరాతీ వాళ్ళకి డబ్బులున్నా వాళ్ళు అసలు మనకంటే మసాలాలు, మాంసాహారం ముట్టరు గనక బ్యాగులనిండా బోలెడు రకాల తినుబండారాలు తెచ్చుకున్నారు-మేం తీసుకెళ్ళినవన్నీ పదిరోజులకే అయిపోయాయి. అక్కడనించి పొటాటో చిప్స్, బిస్కట్లు, బన్ను. అరటిపళ్లు, ఏపిల్ లాంటివి కొనుక్కొని తినేవారం—అందుకే మళ్ళీ చెప్తున్నాను. మీరు 5, 6 రకాల వస్తువులు బాగా ఎక్కువగా తీసికెళ్ళండి-బస్సులో మ్యూజికావ

గారు పేకాట మొదలుపెట్టారు—రెడ్డిగారు, బావ, మేము డాలర్లకి పేకాట మొదలుపెట్టాం. బస్సులో సంగీతం, పేకాట, కుర్రవాళ్ళ అల్లరి అన్నీ కలిసి అసలు ప్రయాణం చేసినట్టే అన్పించేదికాదు.

ఆస్ట్రియా తరువాత హాల్ట్— 'వెన్నీస్'....వెన్నీస్ పట్టణం గురించి అందరికి తెలుసు—ఊరిమధ్య కెనాల్స్—నీళ్ళలో యిళ్ళ—వీధులు తిరగాలంటే బోట్‌లో తిరగాలి. కాశ్మీర్‌లో బోట్ హౌసెస్ లాంటివి వున్నాయి. నీటి వడ్డున—అలా నీళ్ళలో ఆ పునాదులు కదిలిపోకుండా ఆ భవంతులు అన్ని ఏళ్ళుగా అలా వున్నాయి. వెన్నిస్ అందమైన నగరం—నదులమధ్య ఆర్చిలలాంటి బ్రిడ్జిలు, నీళ్ళమధ్య తేలియాడే హౌస్ బోట్స్, గార్డెన్సు, అన్నీ అందంగా వున్నాయి. హోటల్ 'అలగ్జాండర్'లో సామాను వదేసి మధ్యాహ్నం అంతా సిటీ టూర్‌కి తీసికెళ్ళారు. వాకింగ్ టూర్‌లో పాలస్, చర్చి, మ్యూజియం వగైరాలు చూపించారు. వెన్నీస్ గాజు వస్తువులకి ప్రసిద్ధి. గ్లాస్ ఫ్యాక్టరీకి తీసికెళ్ళి వైన్ సెట్స్ గాజుతో తయారైన జంతువులు, పక్షులు రకరకాల వస్తువుల తయారీ చూపించారు. గాజుని యినుములా కరిగించి ఆ వేడిమీద జీడిపాకంలా సాగిన ఆ గాజుని మన పటకారులాంటి దానితో ఎడంచేత్తో పట్టుకుని కుడిచేత్తో ఇంకో పటకారులాంటి దానితో అరనిమిషంలో ఏ ఆకారం కావలిస్తే ఆ ఆకారం చకచక మలిచేవారు. ఆ చేతిలో ఆర్ట్ చూసి చప్పట్లు కొట్టకుండా వుండలేం—అక్కడ వైన్ సెట్స్, రకరకాల రంగులలో అందమైన డిజైన్‌తో—వైన్ గ్లాసులు. రకరకాలవి కళ్ళు చెదిరేటట్టువున్నా ఖరీదులు మాత్రం మనకి అందుబాటులో లేవు. ఖరీదుల మాట ఒకటి అంతటి సున్నితమైన వస్తువులు ఎలా తీసుకురావడం అన్నది మా ప్రశ్న. అక్కడికీ ప్రతి దేశం వెళ్ళిన గుర్తుగా ఏదో ఒకటి చిన్న సావనీర్ కొన్నాం అనుకోండి—బాగా డబ్బున్నవారు వైన్ సెట్స్ అవీ కొన్నారు. కెనాల్స్‌మధ్య బోట్‌లో ప్రయాణంచేసి ఊరంతా చూసాం. ప్రతిచోట టూరిస్ట్ ప్లేస్ కనక, అది సమ్మర్ టూరిస్ట్ సీజను కనక ఎక్కడ చూసినా జనమే—రంగురంగుల బట్టలే కాదు రంగు రంగుల

మనుష్యులు కూడా కన్పిస్తారు. ప్రతిచోట ఎక్కడికెళ్ళినా ఎక్కువ మంది టూరిస్టులు జపాన్, తైవాన్‌వారు కన్పించేవారు—యూరపియన్స్ నరే సరి. యిండియన్స్ చాలా తక్కువ మంది వుండేవారు ఏదో మాలా టూరిస్ట్ బస్సులలో వచ్చేవారు వేళ్ళ మీద లెక్క పెట్టవచ్చు. జపాన్, తైవాన్ వాళ్ళకి టూరిజం మీద నిజంగా ఎంత అభిరుచీ అన్పించేది. ప్రతిదీ శ్రద్ధగా చూసేవారు—వినేవారు—బోలెడు డబ్బు ఖర్చు పెట్టి సామానుకొనే వారు. తైవాన్ లాంటి అతి చిన్న దేశం ఎలక్ట్రానిక్ రంగంలో, ఆర్థిక రంగంలో ఎంత పురోభివృద్ధి సాధించిందో చూస్తే ఆశ్చర్యం కల్గుతుంది. విచ్చలవిడిగా తిరుగుతూ, డబ్బు ఖర్చుపెట్టేవారు వాళ్ళు. ప్రతిచోట కిటకిటలాడుతూ జనం. ప్రతిచోట ఏ మ్యూజియం చూడాలన్నా, ఏ చర్చిలోకి వెళ్ళినా, ఆఖరికి బోట్ రైడింగ్ దగ్గిరనించి వరసగా క్యూలలో నిలబడాలి-టూరిస్ట్ బస్సులు వందలు వందలుండేవి—ఒకో బస్సు నించి ఒక గ్రూపు, ఒక గైడుతో వెళ్ళేవారు.

మ్యూజియం పాలస్‌లు లాంటి యాత్రా స్థలాల్లో యిలా గ్రూపుకి కన్సెషన్ టిక్కట్లుంటాయి. అన్ని లక్షలమంది రోజూ వస్తున్నా ఎక్కడా తొక్కిడి గలాటా లేకుండా ఒకో గ్రూపుని ఒకోసారి పంపుతూ, ఆ గ్రూప్ వదిలి మరో రూముకి వెళ్ళాక యింకో గ్రూప్‌ని లోపలికి వదులుతూ కంట్రోలు చేస్తారు. అక్కడ మ్యూజియంలు, ఆర్ట్ గేలరీలు గురించి నేను ఎక్కువ చెప్పడం లేదు. ఎందుచేత అంటే ఆ పెయింటింగ్స్ గురించి చెప్పదగ్గ నాలెడ్జినాకు లేదు. చూస్తూ పరవశించడం తప్ప ఆ పెయింటింగ్సు గురించిన వివరాలు, పెయింటరు చరిత్రలు చెప్పాలంటే చాలా అవుతుంది. ప్రసిద్ధి గాంచిన పెయింటింగ్స్ అన్నీ చూస్తే ఆ కాలంలో 2, 3 వందల ఏళ్ళ క్రితం వేసినవి రంగు-మాయకుండా, వెలవ కుండా అలా వున్నాయంటే ఆ రంగుల నాణ్యత, మేళవింపు చిత్రలేఖనం గురించి తెల్సిన వారికే తెలుస్తుంది. సీలింగు మీద బ్రహ్మాండమైన చిత్ర లేఖనం. మంచెలా కట్టుకుని పడుకుని వేసేవారట చిత్రకారులు—అంతెత్తు సీలింగులు మీద అంత అద్భుతంగా పడుకుని చిత్రించారంటే గతవైభవం కళ్ళకు కడ్తుంది. యిప్పుడు అలాంటి చిత్రకారులున్నారో లేదో నాకు

తెలియదు. రాజప్రసాదాలు ఎంత జాగ్రత్తగా మైన్‌టైన్ చేస్తారో చూస్తే తెలుస్తుంది. ఆనాటి ఫర్నిచర్, పరదాలు, షాండిలియర్స్, పింగాణీ కుండీలు ఒకటేమిటి అన్నీ భద్రంగా దాచి ప్రదర్శిస్తారు—ప్రతి రూముకి సెక్యూరిటీ గార్డ్ వుంటారు. దగ్గిరకి వెళ్ళి చేతులు పెట్టకుండా గాజు పలకలతో అడ్డం కట్టి, తాళ్ళతో కట్టి దూరంనించే చూపుతారు.

మనదేశంలో రాజులకి, రాజభవనాలకి లోటు లేదు. ఇంకా చెప్పాలంటే ఆ దేశాలని మించిన గత వైభవం చిహ్నాలున్నాయి-మన మైసూరు, ఉదయపూరు, బరోడా, గ్వాలియర్ లాంటివే కాక ఏ చిన్న జమీందారీ భవనాలు చూసినా కళాత్మకంగా వున్నవి ఎన్నో వున్నాయి—కాని విదేశీయుల మాదిరి వాటిని భద్రపరచి, టూరిస్టు స్థలాల మాదిరి సౌకర్యాలు, రవాణా, సిబ్బంది ఏర్పరిచి టిక్కెట్లు పెట్టి అవి పోషించేందుకు మన ప్రభుత్వం ఏ చర్యలు తీసుకుంటోంది? ఒక్క యాత్రాస్థలంలోనూ సరైన సౌకర్యాలు వుండవు. వెళ్ళినవారు ఎందుకొచ్చాం అనుకునేటట్లు వుంటాయి మనదేశంలో—తిండికి కరువు, రవాణా సౌకర్యాలు అంతంత మాత్రం—మనదేశానికి విదేశీయులు టూరిస్టులుగా వస్తే దిగగానే చుట్టుముట్టే ముష్టివాళ్ళు—మీదపడి సామాను లాక్కునే రిక్షాలు, ఆటోలవాళ్ళు విదేశీయులు అనగానే ఎక్కడికక్కడ దోచేద్దాం అనుకునే గైడులు, హోటలు స్టాఫ్, టాక్సీల వాళ్ళు తటస్థపడి భారతదేశం అంటే....డర్టీ కంట్రీ, డర్టీపీపుల్ అనుకునేట్టు చేస్తారు. యాత్రాస్థలాల్లో శానిటరీ సదుపాయాలుండవు. ఏ బాత్‌రూమెలావున్నా నీరుండదు—కంపుకొడ్తూ అడుగు పెట్టలేనట్టు వుంటాయి—మన రైళ్ళు, బస్సులలో ప్రయాణం వారికి నరకంలా వుంటుంది. ఈగలు ముసిరే ఆహారపదార్థాలు రోడ్లుమీద కుళ్ళు కాల్వలు, మలమూత్రాలు చూసి మన గురించి ఎంత హీనంగా వాళ్లు ఆలోచిస్తారో అర్థం అవుతుంది నాకు ఆ దేశాలు చూసి వచ్చాక. మనం నిజంగా సిగ్గుతో తలలు దించుకోవాలి—విదేశాలు చూసి వచ్చాక. ఇండియా బీద దేశం అయినా యింతలా అడుగడునా అపరిశుభ్రత, లంచగొండితనం, నిజాయితీ లేని మనుష్యులని చూసి వారు ఎంత చులకనగా అనుకుంటారో అన్పిస్తుంది నాకు.

అందుకే యూరప్, అమెరికా దేశాలలో ముఖ్యంగా యూరప్‌లో ఇండియన్స్ అంటే చాలా తక్కువ అభిప్రాయం వాళ్ళకి. మనకి మానర్స్ లేవని, కక్కుర్తి మనుష్యులం అని, గట్టిగా మాట్లాడతామని, మర్యాద తెలీదని, శుచిశుభ్రత లేనివారమని, అవినీతిపరులం, లంచగొండులం అనీ వారి అభిప్రాయం. వారనుకున్నారంటే అది వారి తప్పుకాదు. విదేశం వెళ్ళినా మన వారు మన అలవాట్లు మార్చుకోం—ఏ షాపులోకయినా వెడితే బిల్లు వేయించడానికి గాని, ఏదయినా అడగాలన్నా కాని మనం కౌంటర్ మీద పడిపోతాం. ఇదెంత అంటూ గట్టిగా మాట్లాడతాం—అది వారికిష్టం వుండదు. వన్ ఎట్ టైము వారు బాగా పాటిస్తారు. నీ ముందున్న వాడి పని అయితే తప్ప నీవేం అడగకూడదు, మాట్లాడ కూడదు. అలా మనం అడిగితే కోపంగా చూస్తారు. విసుక్కుంటూ వెయిట్ చేయమని తీక్షణంగా జవాబిస్తారు. హోటళ్ళలో మనం గలగల మాట్లాడుతూంటే "దీజ్ ఇండియన్స్" అన్నట్టు హీనంగా చూస్తారు. గట్టిగా అరవడం మాట్లాడడం అసలు వారికిష్టం వుండదు. క్యూలలో నిల్చోకుండా తోసుకుని ముందుకు వెడితే అసహ్యంగా చూస్తారు. మన కంట్రీ గురించి వారికి చాలా తక్కువ అభిప్రాయం వుండడంటే అది వారి తప్పుకాదు—ఇండియాని చూసి వచ్చిన ఎవరన్నా అదే అభిప్రాయంతో వుంటారు. ఎవరో టూరిస్టుని (విదేశీయుడ్ని) ఇండియా గురించి మీ అభిప్రాయం ఏమిటని ఎవరో అడిగితే, "ఇండియా ఈజ్ నతింగ్ బట్ ఎ బిగ్ లెట్రిన్" అన్నాడుట. మన రోడ్లు. మన శానిటరీ సిస్టమ్ చూసి అలా అనుకోకపోతే తప్పు—మనకంటే చిన్న దేశాలు, మన కంటే వెనకబడిన దేశాలు (ఆఫ్రికా లాంటివి) కూడా సిటీలు, రోడ్లు శుభ్రంగా వుంటాయి. అడవులలో ఆటవికులు ఎలా వున్నా అనాగరీకులుగా వున్నా పట్టణాలలో నాగరికత వుంటుంది. మంచి రోడ్లు, శుభ్రంగా వుంటాయి. అటు జపాన్, హాంకాంగ్, సింగపూరు, అవీ సరేసరి యింకా నీట్‌గా వుంటాయి. రష్యాచూసొచ్చిన వారూ చెప్పారు. చాలా అందంగా, నీట్‌గా వుంటుందని—ఎటు చూసినా ఆఖరికి అందరికంటే అధ్వాన్న స్థితిలో

మనమే వున్నామేమో అనిపిస్తుంది. ఇది మనదేశాన్ని కించపర్చుకోడానికి అనడం లేదు—ఆ దేశాలు చూసాక అయ్యో మనం యింకా యిలాగే అట్టడుగున ఎందుకున్నాం. మన ప్రభుత్వం ఎందుకింత నిర్లక్ష్యం చేస్తూంది యిలాంటి విషయాలని—అన్న ఆవేదన ఇది. వాళ్ళకున్నవి ఎంత చిన్నదైనా బ్రహ్మాండంగా ఎక్స్‌ప్లోర్ చేసి, పురాతన వైభవాన్ని జాగ్రత్తగా పదిలపరుచుకుంటూ అది టూరిస్టు ఎట్రాక్షన్‌గా మారుస్తారు—ఉదాహరణకి లండన్‌లో స్ట్రాక్ హోమ్ అనే వూళ్ళో షేక్స్‌పియర్ పుట్టాడు—షేక్స్‌పియర్ పుట్టిన యిల్లు అంతా శిధిలావస్థలో వుంది. ఆ యిల్లు అతిమామూలు పెంకుటిల్లు లాంటిది—దాన్ని వాళ్ళు పెద్ద టూరిస్ట్ ఆకర్షణగా మార్చి పెట్టారు. ఇది మంచం, రాసే టేబులు అంటూ అతి జాగ్రత్తగాదాచి పెట్టారు. రోజూ వందల వేల సంఖ్యలో వచ్చిచూసివెళ తారు—దానికో టిక్కట్టు. మనదేశంలో రచయితలకి, కవులకి, లోటేమిటి? నన్నయ్య ఎక్కడ పుట్టాడో, వీరేశలింగం గారి యిల్లెక్కడో, టాగూర్‌గారి యిల్లు, త్యాగయ్య యిల్లు—యిలా ఎవరన్నా ఆ మహాను భావుల జ్ఞాపకార్థం వారు నివసించిన స్థలం, యిల్లు గురించి పట్టించుకున్నారా? మామూలు యిళ్ళ గురించి సరే. మనదేశంలో లెక్కలేనంత మంది జమీందారీలుండేవి. వారందరికీ బ్రహ్మాండమైన జమీందారీ భవనాలుండేవి—జమీలు, జమీందారీలు పోయాక ఆ రాజభవనాలని పోషించే తాహతులేక అవన్నీ యిప్పుడు శిధిలావస్థలో వున్నా పట్టించుకునే నాథుడున్నాడా? ఆ దేశాలలో అలాంటి చిన్న చిన్న భవనాలన్నీ కూడా అతి జాగ్రత్తగా పదిలపరుచుకుంటూ యాత్రీకులకి ఆకర్షణగా చూపించడానికి ప్రయత్నిస్తారు. అన్నింటికి డబ్బు మూలకారణం. ఒప్పుకుంటాను, ఆ మాట ఆ దేశంలో ప్రభుత్వాలకి డబ్బుంది ఏర్పాట్లు చేస్తారు అనద్దు—అలాంటివి మైన్‌టైన్ చెయ్యడానికి మనిషికో రూపాయి టిక్కట్టు పెట్టచ్చు మన ప్రభుత్వం. పాలకులు నిజాతీయిగా వుంటే చాలా రకాలుగా చాలా డబ్బు వినియోగించవచ్చు— మన ప్రభుత్వమే గాదు మన ప్రజలూ అలాంటి వారమే—ఆ దేశాలలో టూరిజం అంటే యింతా అంతా ఆసక్తి

కాదు ప్రజలకి. ప్రతి శలవులకి ఏదో ఒక స్థలం వెడతారు— వెళ్ళిన తరువాత శ్రద్ధగా చూస్తారు. దాని గురించి క్షుణ్ణంగా తెల్సుకుంటారు— ఏ మ్యూజియం, ఆర్టుగ్యాలరీకి వెళ్ళండి— ప్రతిది వాళ్ళ చేతిలో కర పత్రాలు పట్టుకుని చదువుకుంటూ ఒకోదాని గురించి శ్రద్ధగా చదువుతూ చూస్తారు.

ఏమయినా అంటే తిరగడానికి మనకి డబ్బులేదంటారు, మధ్య తరగతి సంసారులకి యిదంతా కుదరదంటారు— ఏం సినిమా అంటే మనిషికి, 5, 6 రూపాయలు టిక్కట్టు కొని వెడతారే— ప్రతి ఏడు తిరుపతి వందలు ఖర్చుపెట్టి వెడతారు. ఏం ఆ డబ్బుతో యింకోసారి ఏ చారిత్రాక స్థలమో ఎందుకు చూసిరారు? డబ్బు లేకపోవడం అన్నది కాదు అసలు కారణం— ప్రజలలో యిలాంటి వాటిపట్ల అలక్ష్య వైఖరి. ఆ ఏం చూస్తాం లెద్దూ— వెడితే బోలెడు ఖర్చు, ఆ డబ్బుతో నాలుగు చీరలో, కాసు బంగారమో కొనుక్కుందాం అనుకునే మన స్తత్వం మనది. దానికి తోడు ప్రభుత్వం టూరిస్టు స్థలాల్లో సరి అయిన ఏర్పాట్లు చేయదు. మంచి పబ్లిసిటీ యివ్వదు. ఏదో జైపూరు, ఉదయపూరు, తాజ్‌మహల్, మైసూరు పేలస్ లాంటివి తప్ప చిన్న చిన్నవి ఎవరూ పట్టించుకోక శిథిలమయిపోతున్నాయి. అక్కడ చూసి వచ్చాక ఎవరికన్నా అయ్యో మనం ఎందుకిలా మన చారిత్రాత్మక వైభవాన్ని పాడుచేసుకుంటున్నాం అన్న ఆవేదన ప్రతివారికి కల్గుతుంది.

'వెన్నిస్' తరువాత ప్రయాణం—'రోమ్' నగరం! ఇటలీ రాజధాని రోమ్! రోమ్ చాలా పురాతన నగరం— అక్కడ వేటికన్ సిటీ (అంటే క్రిస్టియన్ ముఖ్య మతాధిపతి పోప్ వుంటారక్కడ)లో 'పోప్' అంటే క్రైస్తవ మత కులపతి— అతని మాటకి తిరుగులేదు— రాజులు, రాణులు ప్రతివారు అతన్ని గౌరవిస్తారు—భక్తితో కొలుస్తారు— 'దేవుని దూత' అని వారి నమ్మకం— అన్ని దేశాల క్రైస్తవులకి మతాధిపతి. అక్కడ వుంటారు— "వేటికన్ సిటీ" అన్నది పెద్ద ఏరియా—అక్కడ "వేటికన్ మ్యూజియమ్" చూడడానికి రెండు కళ్ళు చాలవు— అన్ని

మంచి పెయింటింగ్స్— "మైకెల్ ఏంజిలో లాంటి ప్రముఖ చిత్రకారుల పెయింటింగ్స్ వున్నాయి. అక్కడ సెయింట్ పీటర్ అన్న బ్రహ్మాండమైన చర్చి వుంది. ఎంత పెద్ద చర్చి అంటే క్రైస్తవుల క్రిస్మస్‌నాడు, వారి యితర పండుగుల నాడు 80 వేల మంది పట్టేంత పెద్ద చర్చి— "పోప్" దర్శనార్థం అన్ని దేశాల నించి లక్షల కొలది యాత్రికులు వస్తారు క్రిస్మస్‌కి. 1300 స్థంభాలతో గుండ్రంగా కట్టిన స్థలం, అక్కడ బ్రహ్మాండమైన భవంతి వుంది (పోప్ నివాస స్థలం). అక్కడ ఆ స్థలంలో లక్షల మంది నిల్చుంటే ఆ భవంతి పైనుంచి పోప్ ప్రేక్షకులని చెయ్యెత్తి పలకరించి దర్శనం యిస్తారు— ఆ చర్చిలో ఆర్ట్ చూడాల్సిందే— ఎత్తు 250 అడుగులు. ఆ స్థంభాలు, అంత ఎత్తున గోడల మీద చిత్రాలు నాలుగు పక్కలా ఎంతో పెద్ద పెద్ద విగ్రహాలు అంతా బంగారు రంగుతో ప్రతి స్తంభం, గోడ, కిటికీ అతి నైపుణ్యవంతంగా అతి శ్రద్ధగా కళ్ళు చెదిరేటట్టు ఆర్టిస్టిక్‌గా వున్నాయి. యూరప్‌లో అన్ని దేశాల కంటే రోమ్‌లో సెయింట్ పీటర్స్ చర్చి పెద్దది. ఒక్క రోమ్ నగరంలోనే 1000 చర్చిలున్నాయట. ఒక సెయింట్ పీటర్ చర్చి కట్టడానికే నూటఏభై సంవత్సరాలు పట్టిందట. 17వ శతాబ్దంలో మొదలు పెట్టితే 18వ శతాబ్దంలో పూర్తి అయిందంటే ఆ చర్చిలోపల. చిత్రకళా వైభవం చూడాల్సిందే— అది అమూల్యమైనది— ఎన్ని మిలియన్లు, ఎన్ని వేలమంది శ్రమో అది. 1817 నాటికి పూర్తయిందట చర్చి. రోమ్‌లో జనాభా ముప్పై లక్షలు. రోమన్ రాజుల వినోద స్థలం అంటే స్టేడియంలా (కలోసియం) వుంది దాని లోపల సింహాలని పులులని వదిలి ఖైదీలని, బానిసలని అవి వేటాడ దం కొంత చూసి ఆనందించేవారట రాజులు, ప్రజలు. ఆ స్థలం, ఆ స్టేడియం లాంటిది అంతా పాడుబడింది. రోమ్‌లో వీధికొక చర్చి చొప్పున వున్నాయి. మొత్తం వెయ్యి చర్చిలంటే చాలా ఎక్కువే.

రోమ్ నగరం చారిత్రాత్మకమైనది. బ్రహ్మాండమైన అంతెత్తు గట్టి భవనాలు, చెక్కు చెదరకుండా నిల్చివున్నాయి. వూరంతా పురాతనమైన చారిత్రాత్మక కట్టడాలు, నిలువెత్తు విగ్రహాలు....ఫౌంటెన్లు, రాజప్రాసాదాలు

ఎటు చూసినా చిత్రకళ వైభవంతో కన్పిస్తుంది. అక్కడ ట్రెయు ఫౌంటెన్ అనేది వుంది. ఆ ఫౌంటెన్‌లో ప్రతివారు పైసలు వేస్తారు. కోరుకున్న కోరిక తీరుతుంది అని వారి నమ్మకం. రోమ్ నగరం అందంగా, చారిత్రాత్మకంగా వున్నా సిటీ మాత్రం నీట్‌గాలేదు. మన ఇండియన్స్‌కి యిటాలియన్స్‌కి చాలా పోలికలు వున్నాయి— జర్మనీ, ఫ్రాన్స్, ఇంగ్లండ్ దేశాలతో పోలిస్తే అక్కడ నీట్‌నెస్ తక్కువ అని చెప్పచ్చు— అంటే యిండియాలా అనికాదు— మిగతా చోట్ల రోడ్ల మీద కాగితం ముక్క అయినా కన్పించేది కాదు. కానీ రోమ్‌లో యథేచ్ఛగా రోడ్లమీద కాగితాలు, తాగి తినేసి పారేసిన డబ్బాలు, సీసాలు అన్నీ కన్పించాయి. వారి దేశం వాతావరణం కూడా ఉక్కగా, ఎండగా మన యిండియాలా అన్పించింది— ఇటాలియన్స్ కొంత గట్టిగా మనలా మాట్లాడుతారు. తరువాత వారి భోజనంలో కొంత ఉప్పు, కారం ఎక్కువ. ఇటాలియన్స్ కూడా నల్లజుత్తు, నల్లకళ్ళతో యిండియన్స్‌లా కనిపిస్తారు.

అక్కడ మన గన్నేరు పూలచెట్లు చాలా కన్పించాయి. రోమ్‌లోనూ దొంగతనాలు జాస్తిట! మేం అందరం అమ్‌స్టర్‌డామ్‌లో రెడ్డిగారి అనుభవం తర్వాత పాస్‌పోర్టులు, బ్యాగులు అతిభద్రంగా చూసుకున్నాం. మొత్తం మీద యూరప్ అంతటిలో రోమ్ చారిత్రాత్మక స్థలం అని చెప్పాలి. ఈ చర్చిలు, ఈ మ్యూజియంలు, తిరిగి తిరిగి కాళ్ళు పడిపోతాయి— అందుకే కొంత ఓపిక వుండగా చిన్నతనంలో వెడితే తిరగడానికి ఓపిక, ఉత్సాహం యింకా బాగా వుంటుంది. మంచి గైడు దొరికాడు— అన్నీ విశదంగా స్పష్టమైన ఇంగ్లీషులో చెప్పాడు.

రోమ్‌లో "హోటల్ ప్రిన్సెస్"లో వున్నాం— అక్కడ రాత్రి ఇండియన్ రెస్టరెంట్‌లో భోజనం చేశాం.

అన్నట్టు రోమ్ చేరేసరికి అమెరికన్, యూరప్ కంబైండ్ టూర్‌లో వెళ్ళే గ్రూప్— ఇండియానించి వచ్చింది— వాళ్ళు మొత్తం 22 మంది (చాలావరకు బెంగుళూరునించి వచ్చిన కన్నడం వాళ్ళు) వచ్చి చేరారు.

అంటే కంబైన్డ్ టూరు వాళ్ళకి రోమ్, పారిస్, స్విట్జర్లాండు, లండన్ మాత్రం చూపిస్తారు. వాళ్ళకి వేరే బస్సు ఏర్పాటయింది. ఆ గ్రూపులో అందరూ వయసు మీరిన వారే.

మర్నాడు రోమ్‌నించి ఫ్లారెన్స్ ప్రయాణం అయ్యాం. ఫ్లారెన్స్ దగ్గరే కనక రాత్రి అక్కడ నైట్ హాల్ట్ పెట్టకుండా ఊరంతా చూపించి, అక్కడ UFFIZI గేలరీ చూసి (అక్కడి 2500 పెయింటింగ్స్ వున్నాయి.)"పీసా" అనే చోటకి బయలుదేరాం. ఫ్లారెన్స్ వూరు బాగుంది. సిటీ ఆఫ్ ఆర్ట్స్ అంటారుట— "పీసా"లో ప్రసిద్ధి గాంచిన "లీనింగ్ టవర్" వుంది. ఆ టవర్ కొద్దిగా ఓ పక్కకి వరిగి వుండడంతో "లీనింగ్ టవర్" అనిపేరు వచ్చింది— అది కట్టాక కొద్ది కొద్దిగా ఓ పక్కకి వరిగిపోవడం ఆరంభించిందట అయినా అది ఎక్కడం వల్ల ప్రమాదం ఏం లేదని, అదేం కూలిపోదని అధికారులు అంటారు—ఆ "పీసా టవర్" చూసి హోటల్ "మెరిటరేనియన్ చేరుకున్నాం.

ఇటలీలో బస్సులో ప్రయాణం చేస్తుంటే ఫ్లారెన్స్ నించి, పీసా, పీసానించి స్విజర్లాండు వెడ్తుంటే.... "లక్షల కొలది ఎకరాలలో ద్రాక్ష తోటలు, ఏపిల్స్, పియర్స్ చెట్లు కాయలతో కన్పించాయి. మొత్తం యూరప్‌కి ఏపిల్- పియర్స్ ఏపిల్‌లానే వుంటాయి చూడడానికి— కాని, కొంచెం చిన్నవి. లోపల మెత్తగా కాస్త జ్యూస్ ఎక్కువ వుంటుంది. యిక్కడే పండుతాయా అన్పించింది. రోడ్డుకి యిటు అటు ఎన్నివేలు, లక్షల చెట్లు కనిపించాయో— యూరప్‌లో ఏ పంటలు పండినా జూన్ మొదలు అక్టోబర్ వరకు మాత్రమే అనుకూలం. తరువాత చలికాలం మంచు పడ్డాక ఏ పంటా పండదు-వాళ్ళకి. ఏడాదికి నాల్గు ఐదు నెలలు మాత్రం ఎండ కన్పించి పంటలకి అనువుగా వుంటుంది. 'పీసా' తరువాత మా హాల్ట్ లూసర్న్ అన్న స్థలం. అది స్విజర్లాండులో లేక్ లూసర్న్ అన్న నది ఒడ్డున వున్న చిన్నపట్టణం.

'పీసా' 'లూసర్న్' వరకు ప్రయాణం యూరప్ అంతటిలోకి అద్భుతమైన అనుభవం. పీసానుంచి లూసరిన్‌కి 450, 500 కిలోమీటర్లు

వుంటుంది. ఇంత దూరమూ ఆ సీనరీ చూడాలంటే రెండు కళ్లు చాలవు. బస్సులో ఒకవైపు చూస్తే రెండోవైపు మిస్సయిపోతున్నామే అయ్యో అనుకుంటూ యిటు అటు తలలు తిప్పి చూస్తూనే వున్నాం - కొంతదూరం ద్రాక్షతోటలు, ఏపిల్ తోటలు, కొండలు, సరస్సులు, నదులు....ఆ తరువాత 2, 3 వందల కిలోమీటర్లు కొండలలోంచి టన్నెల్స్ దారి—ఆ 2, 3 వందల కిలోమీటర్లలో లూసరీన్ చేరేవరకు 143 టన్నెల్స్ వచ్చాయి. టన్నెల్స్ అంటే చిన్నచిన్నవి కావు....ఒక్కొక్కటీ 5, 6 కిలోమీటర్లు కొన్ని పది పదిహేను కిలోమీటర్ల పొడవున వున్నవీ వున్నాయి. '2' కిలోమీటర్లకి ఏ టన్నెలూ తక్కువ లేదు. అన్నింటిలోకి పెద్ద టన్నెల్ 17 కిలోమీటర్ల పొడవుంది. ఆ కొండలు తొలిచి అంతంత పెద్ద పెద్ద టన్నెల్స్‌లోంచి ఎంత అద్భుతమైన రోడ్లు వేశారో చూడాలి కాని చెప్పలేను—మామూలుగా కొండలమీద ఘాట్ రోడ్సు వేస్తారు—కాని వాళ్ళు ఆ కొండలన్నీ తవ్వి టన్నెల్స్ గుండా రోడ్లు వేయడంతో ప్రయాణం దూరం తగ్గి సులువు అయింది. అంత దూరం, అన్ని టన్నెల్స్‌వున్నా గంటకి 80 కిలోమీటర్లు తగ్గకుండా ప్రయాణం చేశాం. ఆ టన్నెల్స్ అన్నింటిలో లైట్లు పట్టపగలులా వుంటాయి. రెండు కొండలు కలుపుతూ వాళ్లు కట్టిన ఆ బ్రిడ్జిలు, ఆ గుహలలోంచి వేసిన రోడ్లు చూస్తే అక్కడి ఇంజనీర్ల ప్రతిభకి జోహార్లు అర్పించాల్సిందే—ప్రభుత్వం ఆ రోడ్ల కోసం ఎన్ని వేల మిలియన్స్ ఖర్చు పెట్టిందో—అలాంటి చోట కూడా ట్రాఫిక్ లైట్లు, పచ్చవి, ఎర్రవి వెలుతురూ దారి చూపిస్తూనే వున్నాయి. నిజంగా డబ్బుతో చెయ్యలేనిది ఏమీ లేదని మానవుడు నిరూపిస్తున్నాడు ఎప్పటికప్పుడు.

స్విజర్లండు అంటే అందమైన దేశం — కొండలు—లోయలు. లోయలు, పచ్చగా, చెట్లు....తోటలు....ఎటు చూసినా మంచి చిత్రకారుడు అద్భుతమైన రంగుల మేళవింపుతో చిత్రించిన లాండ్ స్కేప్‌లా వుంటుంది. అందులో "లూసరీన్" లేక్ పక్కన - కొండలు ఓ పక్కన, కొండవాలుల్లో కట్టిన యిళ్లు మన డార్జిలింగ్‌లా కొండచరియల్లో

ఎత్తు వల్లాలమీద యిళ్లుంటాయి—మా హోటలు లేక్ పక్కనే వుంది. 'హోటల్ పిలాటస్' చిన్న హోటలు కాని ఎంత అందంగా వుందో.... లోపల ఫర్నిచర్ అది విక్టోరియన్ ట్రైపుది—ఫైర్ ప్లేసులు, మంచి మంచి డైనింగు హాల్సుతో చాలా బాగుంది....ఆ హోటలులోంచి దిగి చుట్టూ చూస్తుంటే భూతలస్వర్గం అంటే యిదేనేమో అన్పించింది. మన దేశంలో డబ్బుగల వారు స్విజర్లాండు—విశ్రాంతికి, పిల్లలని చదువులకి వాటికి ఎందుకు పంపిస్తారో అర్థం అయింది. డబ్బుంటే స్విజర్లాండులో సెటిల్ అవగలిగితే జీవితానికింకేం అక్కరలేదనిపించే అనుభూతినిస్తుంది. దురదృష్టం కొద్దీ ఆ రోజు అక్కడ కొద్దిగా జల్లులు. వర్షం పడింది. అలాగే ఆ వర్షంలో గొడుగులేసుకుని తిరిగాం చుట్టుపక్కల. స్విజర్లాండులో మిగతా యూరప్ అంతటికంటే చలిగా వుంది—ఆ రోజు స్వెట్టర్లు. షాల్స్ కప్పుకోవలసి వచ్చింది. స్విజర్లాండులో ఆడవారు చాలా అందంగా వున్నారు-మంచి కళగా. కోటేరేసిన ముక్కులు....తీర్చి దిద్దినట్లున్నారు. యూరప్‌లో అందరికంటే, ఫ్రెంచి, స్విస్, ఇంగ్లీషు యిటాలియన్స్ అందంగా వుంటారు - మేం దిగిన హోటల్లో యిద్దరు ముగ్గురు టీనేజ్ గర్ల్స్—వెయిటరెస్‌లు చాలా అందంగా వున్నారు. మంచి కుటుంబాల నించి కూడా టీనేజ్ గర్ల్స్, యువకులువచ్చి యిలా పార్ట్‌టైమ్ జాబ్ చేస్తుంటారు. అక్కడ ఆ వాతావరణంలో చలి చలిగా వున్నప్పుడు ఆ హోటలు వాళ్ల పాపం మంచి భోజనం పెట్టారు. వేడి వేడి టమోటా సూప్ బంగాళదుంపలు ఎర్రగా వేయించిన ఫ్రై....బటర్‌తో వండిన అన్నం....క్యాబేజి, కాలిఫ్లవర్, టమోటా, మన దోసకాయల్లాంటివి అన్నీ కలిపి ఉడికించి బటర్‌లో వేయించిన మిక్స్‌డ్ వెజిటబుల్....మంచి రుచిగా అన్పించాయి. వాళ్ల అన్నం చెంచాలతో వడ్డించారు మొదటి రాత్రి....అదీ మనకెక్కడ సరిపోతుంది? మళ్ళీ మళ్ళీ అడిగాం. పాపం రెండోరోజు ఏమనుకున్నారో మొదటే ప్లేట్‌నిండా అన్నం, మరింత కూరలు వడ్డించారు అడగకుండానే. యూరోపియన్ హోటల్సులో తృప్తిగా తిన్నదీ అక్కడే!

మర్నాడు ఉదయం అక్కడికి కొంచెం దూరంలోవున్న 'మౌంట్ టిటిలెస్' అనే పదివేల అడుగుల ఎత్తున వున్న మంచుతో కప్పబడిన కొండ మీదకి కేబుల్‌కార్‌లో వెళ్లాం. మంచు కొండ-ఎండాకాలం కూడా పూర్తిగా మంచుతో కప్పబడిందంటే చలికాలం ఎలా వుంటుందో తెల్సుకో వచ్చు—ఆ కొండలమీద నించి మంచు కరిగి వాటర్ ఫాల్స్‌లో పదివేల అడుగుల కిందకి పడ్తున్న దృశ్యం. అద్భుతం—చుట్టూ కొండలు, కిందకి చూస్తే కళ్లు తిరిగే లోయలు....అలాంటిచోట ఆ మంచు కొండమీదికి కేబుల్ కార్లలో వెళ్లాం. కొండ శిఖరంమీద చలి వణికించేసింది—అక్కడ ఒక్కచోటే ఓవర్‌కోటు వుంటే బాగుండేది అన్పించింది. చేతులు కాళ్లు కొంకర్లు పోయినట్లు అన్పించింది. అంతెత్తున అక్కడ పెద్ద రెస్టరెంటు కట్టారంటే వాళ్లు యాత్రికుల సౌకర్యం కోసం ఎంత డబ్బు ఖర్చు పెడతారో అర్థం చేసుకోవచ్చు. వేడి వేడి టీ తాగాక కాస్త ప్రాణం లేచివచ్చింది. కుర్రాళ్ళంతా ఆ మంచుకొండల మీద నడిచివచ్చి కాళ్లు చేతులు కొంకర్లు పోగొట్టుకున్నారు. రెండు మూడు గంటలు ఆ కొండమీద తిరిగి నాలుగ్గంటలకల్లా హోటలుకి వచ్చాం.

డబ్బుంటే జీవితంలో ఒకసారి స్విజర్లాండన్నా చూసిరండి అని అందరికీ చెప్పాలి అనిపించుతుంది స్విజర్లాండు చూశాక.

మర్నాడు లూసిరిన్ నించి పారిస్ ప్రయాణం. "6 వందల మైళ్ళు వుంది 8-గంటలకే బయలుదేరుదాం లేకపోతే బాగా ఆలస్యం అవుతుం ద"న్నాడు జరీన్. 8 గం॥లకి బయలుదేరి పారిస్ ఊరి బయటికి 5 గంటలకి చేరాం మధ్య మధ్య లంచ్ బ్రేక్‌కి, టీకి ఆగి మామూలుగా వచ్చే టైముకంటే ఈసారి కొంచెం ఎక్కువ టైము పట్టింది మాకు పారిస్ చేర డానికి. పీటర్ కాస్త స్పీడు తగ్గించి నెమ్మదిగా బస్సు నడుపుతున్నాడని పించి అడిగాం—బస్సులు ఎనభై కిలోమీటర్లకంటే వేగం పెడితే చాలా ఎక్కువగా ఫైన్ వేస్తారుట. ఫ్రాన్సు, యింగ్లండు ప్రాంతాలలో చాలా స్ట్రిక్‌గా వుంటారుట. హైవే మోటార్ స్క్వాడ్స్ తిరుగుతుంటాయి. "2 వందల డాలర్లకి తక్కువ ఫైన్ వేయరు పట్టుకుంటే" అని అన్నాడు—

అంతేకాక పారిస్ దగ్గర అవుతున్న కొద్దీ విపరీతంగా కార్ల ట్రాఫిక్ పెరిగిపోయింది. అంతులేని ప్రవాహంలా కార్లు సాగిపోయాయి. ఊరు దగరవుతున్నకొద్దీ చీమల బారుల్లా కారులు కన్పించాయి. అందులో సాయంత్రం ఆఫీసులు వదిలి యిళ్ళకి వెళ్ళే టైము ఏమో యింక చూడాలి ఆ ట్రాఫిక్! ఊరి బయటికి 5 గంటలకి వచ్చిన వాళ్ళం సిటీలోంచి హోటలు చేరేసరికి $7\frac{1}{2}$ పైన అయింది.

పారిస్ కూడా రోమ్‌లాగే చాలా చారిత్రాత్మకమైనది. పురాతనమైన పట్టణం. పారిస్‌లో కట్టడాలన్నీ, భవంతులన్నీ ఎంతెత్తున, ఎంత దిట్టంగా, పటిష్టంగా వున్నాయో చెప్పలేం—పారిస్ అందం అంతా పగటికంటే రాత్రి చూడాలి—ఆ దీపాలేమిటి లక్షల లక్షల లైట్లు కళ్ళ చెదిరిపోతాయి—ఎక్కడ చూసినా ఇల్యూమినేషన్—రోడ్లు పక్కన బారులు తీరిన చెట్లు పార్కులు, మంచి, మంచి విగ్రహాలు....పారిస్‌లో చాలా బాగుంది. పారిస్‌లో రాత్రి 11 గంటల వరకు చీకటి పడదు. వాళ్ళ అసలు లైఫ్ అంతా 11 గంటల తరువాత ఆరంభమవుతుంది. వాళ్ళకి 8, 9 గంటలంటే 'ఈవినింగ్ యీజ్ స్టిల్ ఎంగ్' అంటారు. తెల్లవారి మూడు గంటలవరకు నైట్ క్లబ్బులు, రెస్టరెంట్స్, బార్స్, జూదగృహాలు అన్నీ ముమ్మరంగా పని చేస్తుంటాయి.

పారిస్‌లో హోటలు పేరు మన నోరు తిరగదు. ఫ్రెంచి భాష యూరపియన్ భాషలన్నింటిలోకి కష్టం అనిపిస్తుంది. స్పెల్లింగ్ ఒకటి, ఉచ్చారణ మరోలాగ వుంటుంది. ఆ పేర్లు మన నోరు తిరగవు. (Hotel Brochant LA Tour) అది ఎవరికి కావలిస్తే అలా చదువుకోవచ్చు. పారిస్‌లో నిజంగా భాష విషయంలో చాలా కష్టం— మామూలు మాటలు మిల్క్, సుగర్ లాంటి చిన్నమాటలు కూడా వాళ్ళకి అర్థంకావు. ఆ రాత్రి ఊళ్ళోకి వెళ్ళి యిండియన్ రెస్టరెంటులో భోంచేశాం. ఆ హోటలు ఎవరిదో అరవవాళ్ళది. డిన్నరులో పూరీలు, వడలు లాంటివి పెట్టారు—చాలా రోజులయిందేమో తిని.... అవురావురుమని తిన్నాం అందరం. డిన్నర్ తరువాత పారిస్‌లో ప్రసిద్ధిగాంచిన "లీడోషో" (Lido Show)కి

వెళ్ళే ప్రోగ్రాం వుంది— అది అప్షనల్, అంటే ఎవరికి కావలిస్తే వారు వెళ్ళచ్చు. అది వాళ్లు చూపరు. ఎవరి డబ్బు పెట్టుకుని వారు వెళ్లాలి. జిరీన్ పారిస్ వచ్చే ముందే వెళ్ళేవాళ్ళందరి దగ్గర డబ్బు వసూలు చేశాడు. ముందుగా బుక్ చేసుకోకపోతే సీట్లు దొరకవుట. మనిషికి 80 డాలర్లుట. 80 డాలర్లంటే వెయ్యి రూపాయలు— అమ్మబాబోయ్ ఒక రెండుమూడు గంటల కోసం వెయ్యిరూపాయలు ఖర్చు పెట్టడమా అనిపించింది. అయ్యో పారిస్ వచ్చి "లీడోషో" చూడకుండా ఏమిటి? అని కాసేపు ఎటూ తేల్చుకో లేకపోయాను— 80 డాలర్లతో చాలా సామానులు వస్తాయి కొనుక్కోడా నికి, నైట్ క్లబ్బులు చూసేది ఏమిటి అని ఆఖరికి మనసు సమాధాన పరుచుకున్నాను. మా బావగారు, మా చెల్లెలు వెళ్ళారు— అక్క, నేను హోటల్లోనే వుండిపోయాం— Lido Show నైట్ క్లబ్బు డాన్సులులా వుండవట— ఎంతోమంది గ్రూపు న్యూడ్ డాన్సర్— అతి క్విక్ మూవ్ మెంట్స్, అర నిమిషంలో స్టేజ్‌లు మారిపోతూ వుంటాయట— న్యూడ్ అంటే పూర్తి న్యూడ్ కాదు. క్యాబరేలోలా చిన్నలాగు, బ్రాసరీ లాంటి దానితో వుంటారుట. చూసిన వాళ్ళు "షో" బాగుంది అని కొందరు, బాగానే వుందని కొందరు అన్నారు కానీ బ్రహ్మాండం అని అనలేదు. పారిస్ నైట్‌లైఫ్‌కి ప్రసిద్ధి. ఫ్యాషన్స్ అన్నీ ముందు పారిస్‌లోనే పుట్టా యిట. ఆడవాళ్ళు చాలా అందంగా వున్నారు. ఫ్రెంచి వనిత అంటే అందానికి నిర్వచనంట— పారిస్ నగర జనాభా 14 మిలియన్లు. అంటే 140 లక్షలన్నమాట. పారిస్‌లో ఒక్కకోట 104 చర్చిలు, 82 మ్యూజి యమ్స్, 34 బ్రిడ్జిలు వున్నాయట— ప్రతి ఏటా 70 లక్షల మంది టూరి స్టులు పారిస్ నగరాన్ని దర్శిస్తారుట- ప్రతిఏడు 42 వేలమంది స్టూడెంట్స్ చదివి పాసవుతారట— ఫ్రాన్సులో 2 మిలియన్ల నిరుద్యోగులున్నారుట- వారికి ప్రభుత్వం కొంత ఎలవెన్స్ యిస్తుందిట—పారిస్ యూరప్ అంతటి లోకి ఖరీదయిన స్థలం. ఆహారం, బట్టలు, సామాన్లు దేని ధర చూసినా మనలాంటి వాళ్లు కొనలేం. పారిస్ సెంట్స్‌కి, పెర్‌ఫ్యూమ్స్‌కి ప్రసిద్ధిగాని, వాటి ధరలు చూస్తే—చూస్తూ చూస్తూ కొనలేకపోయాం—మాతో వచ్చిన

బిజినెస్ పీపుల్ కొన్నారనుకోండి— పారిస్‌లో కనీస వేతనం 4 వేల ఫ్రాంకులకి తక్కువ వుండదు. అక్కడ వారి కరెన్సీ ఫ్రాంక్స్.... కార్లు మనుష్యులతో సమంగా వున్నాయా అన్పించింది అక్కడ కారు ధర 45,000 ఫ్రాంకులుంటుంది. వాళ్ళకి ఫ్రాంకు అంటే మన రూపాయిలా అనుకుంటే 45 వేలకు కారు మన ఇండియాలో రాదు— మిగతా యూరప్ కంటే ఫ్రాన్స్‌లో కార్లు కూడా ఖరీదు ఎక్కువే. పారిస్‌లో ఎయిర్ పోర్టు పేరు "ఓర్లీ" యూరప్‌లో 2వ స్థానం ఆ ఎయిర్ పోర్టుది. మొత్తం ఫ్రాన్సు జనాభా 55 మిలియన్లు— అంటే మన ఆంధ్రరాష్ట్రం జనాభా కంటే తక్కువేనన్నమాట. వారి దేశాలలో జనాభా తక్కువ అవడంవల్లనేమో ఆ దేశాలంతగా పురోభివృద్ధి చెందుతున్నాయి. పారిస్ పాత కొత్తల మేళవింపులా కనిపిస్తుంది. మాడర్న్ బిల్డింగులు, కొత్త ఆధునిక కట్టడాలు కనిపిస్తాయి. చారిత్రాత్మకమైన పురాతన భవంతులూ వున్నాయి—శేషన్సు చూస్తే శేషన్సు వున్నాయి.... అలా అని గతచరిత్ర తాలుకు గుర్తులు పదిలంగా దాచుకునే చర్చిలు, మ్యూజియంలు, ఆర్ట్.... అని చూసి ఆనందించే ప్రజలూ వున్నారక్కడ. పారిస్ అంతా సరిగా చూస్తే వారంరోజులు తక్కువ పట్టదు. ఆ మ్యూజియంలు అవీ సరిగా చూడాలంటే ఎన్నాళ్ళయినా చాలదు. మా దురదృష్టం కొద్దీ పారిస్‌లో ప్రసిద్ధిగాంచిన "ల్యూర్ మ్యూజియం" చూడలేకపోయాం— ఆదివారం ల్యూర్ మ్యూజియం ఫ్రీట— ఆ సంగతి మాకు ముందుగా తెలిస్తే లూసిరీన్ నించి యింకా పెందరాడే బయలుదేరి వచ్చి చూసేవాళ్ళం— సోమవారం మేము ఊళ్లో మిగతా చూడాల్సినవి చూసి, ప్రసిద్ధిగాంచిన ఐఫిల్ టవర్ అదీ చూసి అక్కడికి 30, 40 మైళ్ళ దూరంగా వున్న "ఫౌంటెన్ బ్లూ" అనే రాజప్రాసాదం చూడడానికి వెళ్ళాం— అది 15వ శతాబ్దపు రాజుల విడిది గృహం— శలవులకి వెళ్ళి అక్కడ గడిపేవారట; "హెన్రీ రాజులు" అయిన 1వ హెన్రీ, 2వ హెన్రీ— తరువాత లూయిస్ 14, 15, 16.... కూడా అక్కడే గడిపేవారట. ఫ్రెంచి రివల్యూషన్ సమయంలో నెపోలియన్ అక్కడ దాక్కున్నప్పుడు చంపేశారట—అదీ ఆ ఫౌంటెన్ బ్లూ చరిత్ర.

ఆ రాజప్రాసాదం ఆనాటి రాజుల ఫర్నిచర్, పరదాలతో సహా అలా ప్రిజర్వ్ చేశారు. చాలా బాగుంది. అవన్నీ చూసి నాల్గుగంటలకల్లా మేం ల్యూవర్ మ్యూజియం వచ్చి 6 గం॥ల వరకు వుంటుంది చూడచ్చు అను కుంటే ఆ రోజు మా దురదృష్టం కొద్దీ కరెంటు పోయింది. ఎప్పుడూ ఆ దేశాలలో అలా జరగదు. కరెంటు అరక్షణం కూడా పోదుట. అలాంటిది ఆ ఏరియాలో ఏదో ఫాల్టు వచ్చి కరెంటు పోతే 4 గం॥ల కల్లా గేట్లు మూసేశారు. జోనీ మర్నాడు లండన్ వెళ్ళేముందు కాస్త చూసి వెడదాం అనుకుంటే మంగళవారం శెలవు అన్నారు. దాంతో మాకు అతి ప్రసిద్ధి చెందిన ల్యూవర్ మ్యూజియంలో కళాఖండాలు (మోనాలీసాలాంటి పెయింటింగ్స్) చూసే యోగం లేకపోయింది. మర్నాడు ఉదయమే డోవర్‌కి ప్రయాణం అయ్యాం— డోవర్‌తో కోచ్ ప్రయాణం ఆఖరు అవుతుంది. ఇంగ్లీషు ఛానల్ షిప్పు మీద దాటి యింగ్లండు వెళ్ళాలి— పారిస్ నించి డోవర్ చేరేసరికి 2 గంటలయింది. తోవలో వర్షం పట్టుకుంది. ముందు అంతా చాలా చక్కగా వాతావరణం బాగుంది. స్విజర్లాండులో, లండన్‌లో వర్షం పట్టుకుంది. చదురుమదురుగా లండన్‌లో వర్షం ఎప్పుడూ పడ్తూనే వుంటుంది. నేలంతా తడితడిగా వుంటుంది. అందుకే లండన్‌లో ప్రతివారు విధిగా గొడుగులు పట్టుకుంటారు బయటికి వెళ్ళినపుడు— వర్షం పడగానే చలి—ఎలాగో ముందుసారి వెళ్ళినపుడు మాత్రం ఎండగా వుంది. ఆ ఎండకే వాళ్లు మురిసిపోయారు. డోవర్ నించి రెండు గంటలకి షిప్పు బయలుదేరింది. వెళ్ళేముందు అందరం పీటర్‌తో శలవు తీసుకున్నాం— పీటర్‌కి అందరూ తలో పది డాలర్లు యివ్వండి అన్నాడు మా లీడరు. ఐదు, పది చొప్పున పోగుచేసి మూడొందల డాలర్ల పేకట్ ప్రజెంట్ చేశాం. "మీ కంపెనీ నాకు చాలా నచ్చింది. ఇండియన్స్‌తో యిదే మొదటి సారి నేను ప్రయాణం చెయ్యడం" అంటూ తన ఆనందం వ్యక్తం చేశాడు. అందరం పీటర్‌తో ఫోటోలు తీయించుకున్నాం— అతను బస్సు తీసుకుని వెనక్కి ఆమ్‌స్టర్‌డామ్ వెళ్ళిపోయాడు. మేం షిప్పు ఎక్కాం—

"డోవర్" చిన్న సముద్ర తీరం గల వూరు అయినా రెండో ప్రపంచ యుద్ధంలో ఎన్నోసార్లు బాంబుల తాకిడికి గురి అయింది. యింగ్లీషు ఛానల్ దాటాలంటే డోవర్ రావడం తప్పనిసరి—ఆ కారణంగా "డోవర్" ప్రసిద్ధి చెందింది. డోవర్ షిప్పు టాక్స్‌ఫ్రీ.... డ్రింక్ బాటిల్స్, సిగరెట్లు చాక్లెట్లు.... ఒకటేమిటి, కెమెరాలు, ఎలక్ట్రానిక్స్ పరికరాలు అన్నీ దొరికాయి— అసలు ఆ ఫెర్రీ పెద్ద షిప్పులా రెస్టరెంటు వాటిలో చాలా బాగుంది. రెండు గంటలు యింగ్లీషు ఛానల్ దాటడానికి పట్టింది.

డోవర్ నించి లండన్ చేరేసరికి నాలుగున్నర అయింది. అక్కడ మా కోసం కాయినీ ట్రావల్స్ బస్సులు ఎదురుచూస్తున్నాయి. అవి ఎక్కి మళ్ళీ హోటేలు 'బెయిలీ' చేరాం.

ఆ మర్నాడు లండన్ అంతా లోకల్ టూరు. ఇంగ్లండులో ఒక్క లండన్ మాత్రం చూపించారు. వెస్ట్ మినిస్టర్ ఏబే, పికడిల్లి పార్క్, హైడ్ పార్క్, హౌస్ ఆఫ్ పార్లమెంటు, బిగ్‌బెన్, బకింక్‌హామ్ పాలస్....అక్కడ ఛేంజ్ ఆఫ్ గార్డ్స్ అన్నీ కోచ్‌లో తిప్పి గైడుతో చూపించారు. ఇంగ్లండు రాగానే ఏదో మనవాళ్ళ మధ్యకి వచ్చినట్లనిపించింది. ఇంగ్లీషువారితో, ఆ భాషతో మన అనుభవం మూడువందల ఏళ్ళు మరి. ఇంగ్లండులో బోలెడుమంది భారతీయులు కనిపించారు. ఎక్కువగా సిక్కులు, గుజరాతీలు, పంజాబీలు ...చాలామంది వ్యాపార రీత్యా వచ్చినవారే. మిగతా యూరప్‌లో చాలా తక్కువమంది వున్నారు. పారిస్‌లో కొద్దిమంది వున్నారు. అమెరికాలో మాదిరి భారతీయులు యూరప్‌లో (ఇంగ్లండు మినహాయించి) కనపడరు ఎక్కువ.

లండన్ నగరం ఎంతో పురాతనమైనదైనా ఎంతో చక్కగా శుభ్రంగా వుంది. శుచి, శుభ్రతకి, పంక్చువాలిటీకి, క్రమశిక్షణకి యింగ్లీషు వారికి పేరు వుందిగదా. బకింగ్‌హామ్ పాలస్ ముందు ఛేంజ్ ఆఫ గార్డ్స్ అంతా అరగంట తతంగం. ఒక అరమైలు బాండువాయిద్యంతో గార్డులందరూ పూరేగింపులా వెళ్ళి మారతారు. చూడడానికి బాగుంది. హైడ్ పార్కు పెద్ద పార్కు. మన పార్కుల్లా కాదు. పచ్చటి తివాచీలా

లాన్, పెద్ద పెద్ద వృక్షాలతో చాలా బాగుంది. అక్కడ ఆ పార్కులో సాధారణంగా ప్రతిపక్షాల నాయకులు యూనియన్ లీడర్స్ లాంటివాళ్ళంతా మీటింగులు పెట్టుకుని ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఉపన్యాసాలు యిస్తారు. ఆ దేశంలో మన దేశంమాదిరి పత్రికా స్వాతంత్ర్యం అంతగా లేదు. ప్రభుత్వానికి వ్యతిరేకంగా పబ్లిక్ ప్రదేశాలలో మాట్లాడకూడదట. హైడ్ పార్కులో మాత్రం ఎంతయినా అనవచ్చుట. అది దాటి బయటికి రాగానే మళ్ళీ మామూలుగా అయిపోవాలట. గమ్మత్తుగా అన్పించింది. లండన్‌లో మ్యూజియంలు చాలా వున్నాయి. "టవర్ ఆఫ్ లండన్" అని రాణిగార్ల, రాజుగార్ల ఆభరణాలన్నీ ప్రదర్శనకు పెట్టారు. "మేడం టస్సర్" అనేది వాక్స్‌తో చేసిన రకరకాల బొమ్మలు. దేశవిదేశీయుల నాయకులవి. ఆట గాళ్ళవి, ప్రముఖ నటీనటులవి అక్కడ మనుష్యులే నిల్చున్నారా అన్నంత సహజంగా బొమ్మలున్నాయి. ఆ ప్రదర్శనశాలలో, ఈ టవర్ ఆఫ్ లండన్, మేడమ్ టస్సర్‌ని టూరులో చేర్చలేదు టి. సి. ఐ. వారు. మేడమ్ టస్సర్ లాంటిది చేర్చకపోవడం ఏమిటన్నాం. మర్నాడంతా ఎవరిష్టం వచ్చినట్లు వాళ్ళ తిరగడానికి వదిలేశారు. "యివన్నీ మీరు చూసుకోండి. మా ఇటినరీలో లేదు" అన్నాడు జరీన్. టస్సర్‌కి టిక్కట్లు, టవర్ ఆఫ్ లండన్‌కి టిక్కట్లు అన్నీ వున్నాయి కనుక వాళ్ళకి ఎక్కువవుతుందని చేర్చలేదేమో తెలియదు. అసలు లండన్ చేరినదగ్గరనుంచి వాళ్ళ టూర్ అయిపోయినట్టు ప్రవర్తించారు. ఆ రాత్రి డిన్నర్ కూడా వాళ్ళది కాదట. ఎవరిష్టం వచ్చిన చోట వాళ్ల తినవచ్చుట. "అదేమిటి డిన్నరు ఎందుకు ఇవ్వరు?" అంటే "ఏమో ముందునించి యింతే" అన్నాడు జరీన్. బహూశా భాషా సమస్య లేదు. ఇండియన్ రెస్టరెంట్స్ వున్నాయి ఎవరికి వారు మేనేజ్ చేసుకుంటారని వదిలేశారు అనుకుంటాను. కాని అంతా తీసుకొచ్చి ఆఖరి రోజు యిలా వదిలేయడం బాగోలేదని వాదించాం. "మీరు టి. సి. ఐ. వారికి కంప్లయింట్ రాయండి" అన్నాడు జరీన్ మాతో ఏకీభవిస్తూ.

సరే ఆ మర్నాడు అంతా మేం ఎవరికివారు తిరిగాం. "మేడమ్ టస్సర్" మాత్రం యింగ్లండుకు వెళ్ళిన ఎవరూ చూడకుండా రాకూడదు.

ఆ బొమ్మలు వాక్స్‌తో, నిజంగా విగ్గులు బట్టలు కట్టి నిల్చోపెడితే మనుష్యులే అనిపించే టంత సహజంగా వున్నాయి. మేడమ్ టస్సర్ అన్న ఆమె మొదలుపెట్టిందట అవి చేయడం. అంచేత ఆవిడ పేరు వచ్చింది ఆ మ్యూజియంకి. మన గాంధీజీ, నెహ్రూ, ఇందిర, రాజీవ్—ఇలా మన దేశ నాయకులు వున్నారు. మిగతా ప్రముఖులతోపాటు అక్కడ రాణిగారి కుటుంబం యావత్తూ నిలబడి వున్నట్టు బొమ్మలున్నాయి. అందరూ అక్కడికి వచ్చి నిల్చున్నారా అన్పించేటంత సహజంగా వుంది. మర్నాడు లండన్ అంతా అండర్ గ్రౌండ్ రైలులో ఒక చోటనుంచి ఇంకొక చోటికి తిరిగాం. పారిస్, లండన్, ఫ్రాంక్‌ఫర్ట్ యిలా పెద్ద పెద్ద నగరాలన్నిటిలో అండర్‌గ్రౌండ్ రైళ్ళు వున్నాయి. లండన్, పారిస్‌లో చాలా పెద్దవి. మూడేసి అంతస్తులు—అంటే కిందా, పైనా, మధ్యనా ఒక్కసారి మూడేసి ట్రైన్స్ వస్తాయి. ఆ అండర్‌గ్రౌండ్ రైళ్ళ సిస్టమ్ ఎంత నిర్దుష్టంగా వుందో చెప్పలేను. సిటీలలో పార్కింగ్ యిబ్బంది. మామూలువాళ్ళు, ఆఫీసులకువెళ్లేవారు యీ అండర్‌గ్రౌండ్ రైళ్ళలో (ట్యూబ్స్ అంటారు) వెడతారు. అవి చాలా స్పీడుగా ప్రయాణిస్తాయి. బస్సులో వెళ్ళినదానికంటే తొందరగా వెళ్ళొచ్చు. బస్సు అయితే ట్రాఫిక్‌లో ఆలస్యం. భూగర్భంలో రైళ్ళు అయితే చాలా వేగంగా వెళ్ళొచ్చు. వెళ్ళేటప్పుడు అంటే "అప్ జర్నీ"కి ఒక పౌండు, వచ్చేందుకు ఒక పౌండు యిచ్చి ఎంత దూరం అయినా తిరగవచ్చు. ఒక్కొక్క స్టేషన్‌లో కొన్ని సెకన్లు లేదా నిమిషం ఆగుతాయి. ఆటోమేటిక్ డోర్స్ మూసుకుంటాయి. ఎంతో డబ్బు ఖర్చుపెట్టి భూగర్భంలో అంత లోతున మూడు వరసలతో ఆ లైన్లు అవీ వేసి తగిన సదుపాయాలు ఏర్పాటు చేసిన ఆ రైళ్ళు—ఉద్యోగులకి, కాలేజీలు స్కూళ్ళకి వెళ్ళే అందరికీ ఎంతో ఉపయోగకరంగా వుంటుంది. చాలామంది భూగర్భం రైలులో ప్రయాణించినందువల్ల రోడ్లమీద జనసమ్మర్దం తగ్గుతుంది. మన పట్టణాలలో ఈ అండర్ గ్రౌండు సిస్టమ్ వస్తేతప్ప ఈ ట్రాఫిక్ తగ్గి మనకి ముక్తిరాదు. కాని కొన్ని కోట్లు ఖర్చుపెట్టి మనవారు ఈ పని చెయ్యగలరా? ఉన్న రోడ్లనే సరిగ్గా నిర్వహించ

లేని మనవాళ్ళు ఈ భూగర్భ రైళ్ళని ఏం చేస్తారు? యూరప్‌లో అందుకే రోడ్లమీద మనుష్యులు కనిపించరు. ఉన్నవాళ్ళంతా కార్లలో లేదా అండర్ గ్రౌండ్ ట్యూబ్స్‌లో ప్రయాణిస్తారు ఆ ట్యూబులలో కొత్తవారు నయితం వెళ్ళడానికి విశదంగా ఏ లైనులో వెడితే ఏవి చోట్లు వస్తాయో వివరించి వుంటుంది. గ్రీన్, ఆరంజ్, రెడ్, బ్లూ యిలా లైన్స్ యిస్తారు. ఒకో ఏరియా వెళ్ళడానికి—మనం వెళ్ళాల్సిన చోటు పేరు తెలుసుకుంటే, ఏ లైనులో వెడితే అది వస్తుందో స్టేషనులోనూ, రైళ్ళలోనూ లైన్లువేసి సుఖవుగా కొత్త వాళ్ళకి నయితం అర్థమయ్యే రీతిలో రాసి వుంటుంది. నిమిషానికో రైలు చొప్పున వస్తూనే వుంటుంది. డబ్బువేస్తే మిషను లోంచి టిక్కట్ వస్తుంది—స్టేషనులోంచి బయటికి రావాలంటే మిషనులో టిక్కట్టువేస్తే "ఎక్సిట్"కి అడ్డంగా పెట్టిన తలుపు తెరుచుకుంటుంది—అంతా కంప్యూటర్ సిస్టమ్. యాంత్రికంగా అన్ని పనులు జరిగిపోతాయి—ఇలా కంప్యూటర్ సిస్టం వుండడంవల్ల టిక్కట్లు యిచ్చేవారు, తీసుకునే వారు చెకింగ్ అది అవసరం లేదు. టిక్కట్టు ఆ ప్లాట్‌లో వేయకపోతే అసలు తలుపు తెరుచుకుని మనం బయటికి రాలేం. ఈ అండర్ గ్రౌండ్ ట్యూబ్ స్టేషను మా బెయిలీ హోటలు ముందే వుండడంతో ఎక్కడికి వెళ్ళాలన్నా చాలా సుఖవుగా చవగ్గా అయిపోయింది.

ఆ రెండు రోజులు లంచ్‌లు, డిన్నర్లు ఇండియన్ రెస్టరెంట్స్‌లో తినేసరికి యూరప్‌లో పద్దెనిమిది రోజులు తిండికి ఖర్చుపెట్టిన దానికంటే ఎక్కువ అయిపోయింది. అంత ఖరీదు. లండన్‌లో అన్నీ పౌండ్లు లెక్క—పౌండు అంటే మన అరవైరూపాయలు. ఒక చపాతి, కొంచం కూర, పప్పు, ఆ భోజనానికి 4 పౌండ్లు అయింది ఒక్కొక్కరికి. అలా తినేసరికి ఆ నాల్గు పూటలకి బోలెడయింది. వాళ్ళు డిన్నరు, బ్రెక్‌ఫాస్ట్ యిచ్చినప్పుడు తెలియలేదుగాని మనంతట మనం రెండు పూటలు తినే సరికి తెల్సింది మాకు ఈ టూర్‌లో వెళ్ళడం వల్ల ఎంత చవకపడిందనీ! టాక్సీలు, బస్సులు అన్నీ ఖరీదే యూరప్‌లో!

ప్రతిదేశంలో ఈ డాలర్లు వారి దేశం కరెన్సీగా మార్చుకోవలసి వచ్చేది. ఏం కొనాలన్నా—ఈ మార్పిడిలో కొంత డబ్బు పోయేది.

ఇంగ్లండులో పౌండ్సు, ఫ్రాన్సులో ఫ్రాంక్స్, జర్మనీలో మార్క్, హాలండ్‌లో గిల్డార్స్, రోమ్‌లో లీరాలు, ఆస్ట్రియాలో ఆస్ట్రియన్ డాలర్స్, స్విజర్లండ్ స్విస్ ఫ్రాంక్‌లు....యిలా వుంటుంది కరెన్సీ, డాలరు ఏ దేశం వెళ్ళినా ప్రపంచంలో చెల్లుతుంది, మన రూపాయలు విదేశాలలో చిత్తు కాగితం. ఎక్కడా చెల్లదు. బ్యాంకుల్లో, హోటల్సులో ఎక్స్చేంజ్ యిస్తారు మొత్తం ప్రమాణంలో ఈ మార్పిడి వల్ల 20 డాలర్లు పైన నష్టం వస్తుంది.

లండన్‌లో ఒక రోజు ఎవరంతట వారు తిరగడానికి, ఫ్రెండ్స్ వుంటే చూడడానికి వదిలేశారు. యూరప్‌నించి వెనక్కి వెళ్ళిపోయేవారు షాపింగ్ చేశారు. ఆ మర్నాడు అమెరికా వెళ్ళాల్సినవారు వేరే ప్లేనులో న్యూయార్క్ వెడతారు. లండన్ నించి కేవలం యూరప్ టూర్‌కి వచ్చిన వారు ఇండియా బయలుదేరతారు. ఎవరిదారి వారిది అయింది అక్కడ. అబుదాబి, దుబాయినించి వచ్చిన కొందరు, మన ఇండియానించి వచ్చిన అబ్బాయిలు కొందరు లండన్ చుట్టుపక్కల రెండుమూడు రోజులుండి చూసి వెడతాం అన్నారు. రెడ్డిగార్లు అమెరికా గ్రూప్‌లో వెళ్ళారు. అందరం ఫొటోలు తీసుకొన్నాం. ఒకరికొకరం వీడ్కోలు చెప్పుకున్నాం. జరీన్‌తో ఫొటోలు తీసుకొన్నాం. ఏదో మొదట్లో ఒకరోజు లండన్‌కి ఎవరూ వచ్చి రిసీవ్ చేసుకోకపోవడం తప్ప మిగతాదంతా సక్రమంగానే జరిగింది అన్న తృప్తి వెలిబుచ్చాం అందరం. జరీన్ ఇండియా వెళ్ళే వారితో బొంబాయి వెళ్ళిపోయాడు. అమెరికా గ్రూపుతో మరొక లీడరు వెళ్ళాడు.

మేము నల్గురం లండన్‌కి నూటయాభై మైళ్ళ దూరంలోవున్న "కెవెంట్రీ" అనే వూరికి వెళ్ళాం. అక్కడ మా అక్క ఆడపడుచు కూతురు వుంది. ఆ అమ్మాయి ఇంటికి వెళ్ళి రెండు రోజులున్నాం. కృష్ణ మోహన్ కారు తీసుకొచ్చి లండన్‌నించి వాళ్ళింటికి తీసుకెళ్ళారు. అరవింద, కృష్ణమోహన్-వారికి ఒక కొడుకు. కృష్ణమోహన్ ఇంజనీరు. అరవింద ఎం.ఎస్.సి. చదివి ఏదో కెమికల్స్ కంపెనీలో పనిచేస్తోంది.

కెవెంట్రీకి దగ్గరగా చిన్నవూరు వాళ్ళది. కెవెంట్రీ పెద్ద టౌను. అక్కడ నుంచి ఓ పది కిలోమీటర్ల దూరంలో చిన్న గ్రామ వాతావరణంలో వున్న ళ్ళో ప్రశాంతంగా అందంగావున్న చోట వారు యిల్లు కొనుక్కున్నారు. 4 బెడ్‌రూముల యిల్లు చాలా అందంగా వుంది. చుట్టూ అన్నీ అలాంటి వీళ్ళే. వరుసలుగా ఇళ్ళు. ఇళ్ళముందు లాన్ పూలతోట, చక్కటి వీధులు, ప్రశాంతత....చాలా బాగుంది. ఆ రోజు రాత్రి వెళ్ళగానే అరవింద ఇంట్లో తెలుగు భోజనం యిరవై రోజుల తర్వాత తిన్నాం. దొండకాయ కారం పెట్టిన కూర, గోంగూర పచ్చడి, టమోటా పప్పు, తోటకూర పులుసు చాలా రకాలు చేసింది పాపం. ఆ రోజు రాత్రి ఆ భోజనం ఎంత రుచిగా వుందో నోటికి! (అసలు అరవింద చాలా మంచి కుక్) ఎక్కడి కెళ్ళినా మన భోజనం మనం ఎలా మర్చిపోతాం!

ఆ మర్నాడు అందరం తలస్నానాలు చేసి, యిరవై రోజులుగా బట్టలు ఉతుక్కోవడం లేదేమో, వాషింగ్ మిషన్‌లో చాకిరేవు పెట్టి, యిస్త్రీలు చేసుకుని అరవిందతో కబుర్లు చెపుతూ రెస్ట్ తీసుకున్నాం. ఆ మర్నాడు అక్కడికి 50, 60 మైళ్ళున్న షేక్స్‌పియర్ పుట్టిన స్థలం స్ట్రాఫోర్డ్‌కి వెళ్ళాం. ఆ వూరి ప్రాముఖ్యం కేవలం షేక్స్‌పియర్ పుట్టిన స్థలం అని. అక్కడ షేక్స్‌పియర్ వున్న యిల్లు శిథిలావస్థలో వున్నది చూసాం. నిజంగా చూడడానికి ఏమీ లేకపోయినా వారికి-షేక్స్‌పియర్ పట్ల ఎంత గౌరవం వుందో అక్కడికి వచ్చే వేలాదిమంది యాత్రికులని చూస్తే అర్థం అయింది. అలా కవులకి, రచయితలకి మనదేశంలో ఏం గౌరవం ఇచ్చాం మనం అన్పించింది.

స్ట్రాఫోర్డ్ తరువాత "వార్‌విక్" అనేచోట 14 వ శతాబ్దపు రాజ ప్రాసాదం చూశాం. ఆనాటి ఫర్నిచర్, షాండిలియర్స్, పెయింటింగ్స్, ఆనాటి ఆయుధాలు అన్నీ భద్రపరిచారు ఆ రాజభవనంలో. చాలా పురాతనమైన భవంతి. చుట్టూ అడవి. కొన్ని సరస్సుల మధ్యన వుంది. వారి వూరికి దగ్గరున్న ఆ రెండు ప్రదేశాలు చూపించారు కృష్ణమోహన్ దంపతులు —వారి ఆతిథ్యానికి ఎంతో సంతోష పడ్డాం.

మర్నాడు కెవెంట్రీనించి తిరిగి బస్సులో లండన్ ఏర్‌పోర్టుకి తిన్నగా వెళ్ళిపోయాం. ఆ రోజు లండన్ నుంచి న్యూయార్క్ పాన్ అమ్‌లో బయలుదేరాం—అక్కడితో మా యూరప్ యాత్ర పూర్తయింది. లండన్ నుంచి ప్లేన్ టికెట్టు న్యూయార్క్‌కి రానుపోను 2,500 రూ. మాది ఓపెన్ టికెట్ గనక న్యూయార్క్‌నించి లండన్ వచ్చి ఎప్పుడైనా ఇండియా రావచ్చు మేము.

యూరప్ చూసి పొందిన అనుభూతి మాటల కందనిది. మీ దగ్గర డబ్బుంటే తప్పకుండ చూడండి—యిది నా సలహా—రచయిత మిత్రులారా—కథలు, నవలలు రాసి డబ్బు సంపాదించారు. ఆ డబ్బు యింతకంటే బాగా సద్వినియోగం అవదు. పిల్లల బాధ్యతలు తీరితే తప్పకుండా వెళ్ళి చూసిరండి. అమెరికా వెళ్ళినా వెళ్ళకపోయినా పరవాలేదు గాని యూరప్ మాత్రం మిస్ కాకండి—ఎంతసేపు చీరలు, నగలు, ఆస్తులు చేసుకుందామని కాకుండా మనకోసం మనం ఎంజాయ్ చేయడం యూరపియన్స్, అమెరికన్స్‌ని చూసి నేర్చుకోవాలి మనం. యూరప్ దేశాలకి చరిత్రవుంది. చారిత్రాత్మక స్థలాలున్నాయి. సంస్కృతి, నాగరికత వున్నాయి. ఆధునికంగా ఎంతో ప్రగతిసాధించిన ఆదేశాలు చూసి మనం నేర్చుకోవాల్సింది ఎంతో వుంది. వారి తాగుడు, సిగరెట్లు, డ్రగ్స్, వారి ఫాషన్స్ నేర్చుకున్నాం కాని వారి నీతి, నిజాయితీ, పంక్చువాలిటి. డిగ్నిటీ ఆఫ్ లేబర్..... ఏదీ నేర్చుకోలేదు మనం. రోడ్లమీద పేపర్లు పడేసివుంటే డబ్బులు డబ్బాలో వేసి పేపరు పట్టుకెళ్లే నిజాయితీ మనదేశంలో ఎప్పుడు వస్తుంది? సిగరెట్టు కాల్చినా అది జాగ్రత్తగా చెత్తడబ్బాలో పడేసే శుభ్రత మనకెప్పుడు అలవడుతుంది? ఏ పార్కులోనో పర్సు మర్చిపోతే అది చూసి కూడా అలాగే వుంచే పోలేక పోలీసులకి అప్పచెప్పే నిజాయితీ మనకి ఎప్పుడు వస్తుంది? దొంగతనం తప్ప కష్టపడి ఏ చిన్నపని చేసైనా డబ్బు సంపాదించడం న్యూనత కాదన్న నిజం మనకెప్పుడు తడుతుంది? అలా ఒక లక్ష్యం అన్నది లేకుండా డిగ్రీల మీద డిగ్రీలు చదివేసి ప్రతి పని ప్రభుత్వం చూపించాలి అనుకుంటూ ప్రభుత్వాన్ని దుయ్యబట్టకుండా

ఎంత చిన్న పనయినా చేద్దాం అనుకునే స్థాయికి ప్రజలు ఎప్పుడు ఎదుగుతారు?

ఈ ప్రశ్నలన్నీ తడతాయి ఎవరికయినా ఆ దేశాలు చూసినప్పుడు. నీటికి జవాబులు మనం ఆలోచించినప్పుడే మనదేశం బాగుపడుతుంది. మన పాలకులు ముందు మారాలి. ప్రభుత్వం మేల్కొనడం ప్రజల్ని చైతన్యవంతుల్ని చెయ్యడం అన్నది ఉత్తమాట. ప్రజలే మేల్కొనాలి. ఏ ఫ్రెంచ్ రివల్యూషన్ లాంటిదో రావాలి. అవినీతిని, అరాజకాన్ని, అన్యాయాన్ని, లంచగొండి తనాన్ని బద్ధకాన్ని, అలసత్వాన్ని తుపాకులతో కాల్చి చంపాలి. మూడో ప్రపంచ యుద్ధంలా వచ్చి యిండియా మీద బాంబులు పడితే తప్ప, యూరప్ దేశాల మాదిరి కష్టాలుపడి, నేలమట్టం అయిన దేశాన్ని మళ్ళీ పునరుద్ధరించుకోవాలి అన్న తపన ప్రజలలో కలగదు. ప్రజలలో అలాంటి చైతన్యం వచ్చేవరకు ఏ దేశం పురోగమించలేదు. ఆ రోజు మన తరంలో కాకపోయినా ముందు తరాలలో వస్తుందని ఆశిద్దాం.

నా యూరప్ అనుభవాలు రాసి అక్కడి దేశాల గురించి, ప్రజల గురించి కొంతయినా చెప్ప గలిగానని మీరు అనుకుంటే నా లక్ష్యం నెరవేరినట్టే.

యూరప్ యాత్ర టి. సి. ఐ గ్రూపుతో చేసి అమెరికా అంతా మా అంతట మేము తిరిగాం. అమెరికాలో చాలాచోట్ల బంధువులున్నారు కనక బోర్డింగు, లాడ్జింగ్ ఖర్చు తప్పుతుంది చవక పడుతుందని ఆ విధంగా చేశాం. కాని నా అనుభవం తర్వాత నేను చెప్పేదేమిటంటే ఓ 5, 6 వేలు కల్సి వస్తుందని మనంతట మనం వెళ్ళాలనుకుంటే చాలా యిబ్బంది-కష్టం. అమెరికాలో ఈస్ట్‌నుంచి వెస్ట్ సైడ్ వెళ్ళాలంటే వేల కొద్దీ మైళ్ళ దూరం. అంతేకాక మన ఫ్రెండ్సు, బంధువులున్నా వాళ్ళంతా ఉద్యోగాలు చేస్తారు - మనతోపాటు తిరగడానికి, తిప్పడానికి వాళ్ళకి టైముండదు - శని ఆదివారాలు మాత్రం వాళ్ళకి కుదురుతుంది.

ఊళ్ళో తిరగడానికి బస్సులు, టూరిస్ట్ సైట్స్ పట్టాకొని మనం బాగ చూడాలి. ఎయిర్‌పోర్టు నించి ఊరు 25, 30 మైళ్ళుంటుంది. మనవాళ్ళు వచ్చి మనల్ని పికప్ చేసుకుని మళ్ళీ డ్రాప్ చెయ్యాలంటే వాళ్ళకి పాపం యిబ్బంది, ఏ టాక్సీలోనో రావాలంటే మనం మునిగిపోతాం - మేం యిండియాలోనే అమెరికా తిరగడానికి V U S A టిక్కట్లు రూ. 5000 కొన్నాం. ఆ టిక్కట్లతో 7 ప్లేసులకు వెళ్ళవచ్చు. ముందుగా ఇండియాలో 'ఊసా' టిక్కట్లు కొనడంవల్ల చాలా లాభం - ఎందుకంటే న్యూయార్క్‌నించి (యీస్ట్), లాస్‌ఏంజిల్ వెళ్ళాలంటే (వెస్ట్) ప్లేను టిక్కట్టే 20 డాలర్లకి తక్కువ వుండదు. అదీకాక యిండియాలో అయితే మన రూపాయల్లో కొనచ్చు. అమెరికాలో కొనాలంటే డాల ర్లుండాలి. లేదా మన బంధువులు యివ్వాలి. మేం టిక్కెట్లు కొను క్కున్నా ఏ ఏ ప్రదేశాలు చూడాలో, ఏది ముందు? ఏది వెనక వెళ్ళాలో అదంతా ప్లాన్ చేసుకోడానికె వారంరోజులు పట్టింది. Pan amలో వెడితే ఒకచోట నించి ఒకచోటికి వెళ్ళడానికి ఒక టిక్కట్టు. మళ్ళీ న్యూయార్క్ వచ్చి ఇంకోచోటికి వెడితే యింకో టిక్కట్టు అనవసరంగా పోతుంది. న్యూయార్క్ విమాన కూడలి కనుక కొన్ని ఊళ్ళకి వెళ్ళడానికి తిరిగి న్యూయార్క్ వచ్చి వెళ్ళాలి. ఇలా మనం ముందుగా ప్లాన్ చేసుకుని వాళ్ళకి చెబితే టిక్కట్టు ఆ విధంగా రాస్తారు. మనం యిబ్బందిపడి, మన వాళ్ళని అవస్థ పెట్టేకంటే గ్రూప్ టూర్‌లో వెళ్తేనే సుఖం-యిరవై రోజు లలో మనం చూడాల్సినవన్నీ వాళ్ళే చూపిస్తారు. ఆఖర్న కావలిస్తే మీ బంధువులో స్నేహితులోవున్న వూళ్ళలో వుండి రావచ్చు. రిటర్న్ జర్నీకి ఓపెన్ టిక్కట్టు వుంచుకుంటే టిక్కట్టు కొన్న నాలుగు నెలల్లోగా రావాలి. లేకపోతే టిక్కట్టు పోతుంది. అమెరికాలో టూర్‌కి వెడితే న్యూయార్క్, వాషింగ్‌టన్, లాస్ ఏంజిల్స్, శాన్‌ఫ్రాన్సిస్కో. ఓర్లండో, నయాగరా, మియామి 'లాస్ వెగాస్' చూపిస్తారు. ఈ డిస్నీ లాండ్ వగైరాలన్నీ టిక్కట్లు కొని వాళ్ళే చూపిస్తారు. ఈ కారణాల చేత మనం గ్రూప్‌లో వెడితే సుఖవవుతుంది. 5, 6 వేలు ఎక్కువ

అయినా ఇలాగే వెళ్ళమని నా సలహా. మేమూ 5000 రూ॥ ఊఃసా టిక్కెట్లుకొని యీ ప్రదేశాలన్నీ చూసి వచ్చాం.

మళ్ళీ ప్రయాణానికి వద్దాం. మేం లండన్‌నుంచి న్యూయార్క్ వచ్చాం. న్యూయార్క్‌లో మా మామయ్య వున్నారు. యు.ఎన్.ఐ.లో ఆఫీసరు. ఇండియాలో ఐ. ఎ. ఎస్. ఆఫీసరు. సెక్రటరీ రాంకులో వుండి యు. ఎన్. ఐ. డిప్యుటేషన్‌మీద అమెరికా వెళ్ళి తరువాత ఇండియాలో ఈ ఉద్యోగానికి రిజైన్ యిచ్చేసారు. న్యూయార్క్‌లో వాళ్ళు 'మన్‌హాటన్'లో మంచి సెంటరులో ఫ్లాట్స్‌లో వున్నారు. మా అక్క కూతురు బోస్టన్‌లో వుంటుంది. మమ్మల్ని న్యూయార్క్‌నించి తీసికెళ్ళడానికి ఓ వాన్ వేసుకుని వచ్చింది. న్యూయార్క్‌నించి బోస్టన్ 200 మైళ్ళు. నూయార్క్‌లో ప్లేను దిగిం తర్వాత ఎయిర్‌పోర్టునించి వీసా, కస్టమ్స్ క్లియర్ అవడానికి ఆ గుంపునించి బయటపడడానికి మాకు 3 గంటలు పట్టింది. ఆ రోజు నాలుగైదు ఫ్లైట్స్ ఒకేసారి వచ్చి వది వరసలు క్యూలు అయిపోయి గంటల తరబడి నిలబడి కాళ్ళు పీక్కుపోయాయి. దానికితోడు ఒకటే ఉక్కగా వుంది ఆ రోజు. జనానికి ఓర్పు నశించిపోయి ఆఖరికి క్యూలకి కట్టిన తాళ్ళు లాగేసి ముందుకు తోసుకుపోవడం, వెనక క్యూ వాళ్ళు ముందుకు వచ్చేయడం....అంతా నానా గలభా గందరగోళం అయిపోయింది. ఎంతో సిస్టమేటిక్‌గా క్యూ పాటించే ఆ జనం ఆ రోజు అలా చెలరేగిపోయారంటే, ప్రజలకి ఎంత చదువు సంస్కారంవున్నా కొంత లిమిట్ తరువాత మనిషి ఓర్పుకి, సహనానికి హద్దు దాటిపోయాక ఏ సంస్కారమూ పని చెయ్యదని రుజువయింది. 5, 6 గంటలు ప్రయాణం చేసివచ్చి క్యూలలో 2, 3 గంటలు నిల్చోవాలంటే ఎవరి ఓర్పు అయినా ఆఖరి మెట్టు చేరుకుంటుంది. ఆ రోజు తొక్కిసలాటక్కిచూస్తే దాన్లోంచి బయట పడగలమా అన్పించింది. మన ఇండియాలో సినిమా హాలు దగ్గర గలభాలా అయింది. బయట ఒంటిగంట నించి రిసీవ్ చేసుకోడానికి వచ్చి కూర్చున్న వాళ్ళకి ప్లేను వచ్చి $2\frac{1}{2}$ గంటలయినా మేం బయటికి రాక, కనపడక గాభరాపడ్డారు.

తోసుకుని తోసుకుని ఆఖరికి ఎలాగై తేనేం వీసా, కస్టమ్స్ పరీక్షలు పూర్తి అయ్యాక బయటపడ్డాం. ఆ మొదటి అనుభవం చేదు అయిన అనుభవం. న్యూయార్క్ ఎయిర్ పోర్టు అతి బిజీ అయిన ఏర్ పోర్టేమో-ఒక్కోసారి 4, 5 ప్లేన్లు ఒకేసారి వచ్చి క్యూలు చాంతాడులా పెరిగిపోతాయి. అక్కడికి 10 కౌంటర్లు పెట్టినా జనాన్ని పంపడం 2 గంటలు ఆలస్యం అవుతుంటుంది.

2 గంటలకి వచ్చిన వాళ్ళం 5 గంటలకు మన్‌హాటన్ చేరుకున్నాం. అక్కడ కొస్త వాష్ చేసుకుని తొందరగా డిన్నర్ తినేసి వాన్‌లో బోస్టన్‌కి బయలుదేరాం. అబుదాబినించి మా యింకో చెల్లెలు కూడా ఆ వేళకి మేం అందరం అమెరికా వస్తున్నామని అదీ వచ్చింది. దాని కూతురు వాషింగ్‌టన్‌లో, కొడుకు మిచ్‌బర్గ్‌లో ఉద్యోగాలు చేస్తున్నారు. అక్కచెల్లెళ్ళం నల్గురం కలిశాం - మామయ్యవాళ్ళు మేం అంతా అలా అమెరికాలో కల్సుకున్నందుకు ఆనందించారు.

యూరప్‌లో ఆ రోడ్లు, ఫ్లై ఓవర్లు ఆ కార్లు అవీ చూశాక న్యూయార్క్ మాకేం కొత్త అన్పించి ఇంప్రెస్ అవలేదు. న్యూయార్క్ చాలా పెద్ద సిటీ. న్యూజర్సీ, క్వీన్స్, మన్‌హాటన్ వగైరాలు నాల్గు ఐదు కల్సి గ్రేటర్ న్యూయార్క్ అయింది. ప్రతి బిల్డింగ్ కనీసం 25, 30 అంతస్తులకి తక్కువ వుండదు. మా మామయ్యవాళ్ళుండేది 23వ అంతస్తులో. వాళ్ళ యింట్లోంచి చూస్తే రాత్రి ఓ పక్కన 'హడ్సన్ రివరు' యిటూ అటూ ఆ నదిమీద అందంగా బ్రిడ్జిలు....న్యూయార్క్ వ్యూ అంతా కన్పించి తారల్లా దీప తోరణాలు మెరిసిపోతూ బ్రహ్మాండంగా వుంటుంది. న్యూయార్క్ యూరప్‌తో పోలిస్తే ఏం క్లీన్‌గా వుండదు. న్యూయార్క్‌లో చాలామంది నీగ్రోలు (అక్కడ నీగ్రోలంటే వారికి చాలా కోపం వస్తుందిట - 'బ్లాక్స్' అనాలి) వున్నారు. అసలు ఎయిర్‌పోర్టు నుంచి వస్తుంటే ఓ పెద్ద సెరిచూ....కాలనీల్లా బ్లాక్స్ వుండే స్థలం వుంది. అక్కడ అందరూ నీగ్రోలే. అమెరికాలో చాలామంది బ్లాక్స్ వున్నారు. వాళ్ళకి మన ఇండియాలో ఎస్. టి., ఎస్. సి. ల మాదిరి చాలా సదు

పాయాలు కలగచేసింది అక్కడి గవర్నమెంటు. అన్ని ఉద్యోగాలలో, అన్నిచోట్ల సరిసమాన స్థాయిగా వాళ్ళని ట్రీట్ చెయ్యాల్సిందే. కొంత మంది మంచి పెద్ద పొజిషన్స్‌లోనూ వున్నారు. పాన్ ఏమ్‌లో చాలా మంది ఎయిర్ హోస్టెస్‌లు బ్లాక్స్ వున్నారు. మేం న్యూయార్క్ సిటీ సైట్ సీయింగు తరువాత పెట్టుకున్నాం. ముందు బోస్టన్ వెళ్ళి వారం పదిరోజులు రెస్ట్ తీసుకుని మా వైజాగ్ చెల్లెలు కూతురు కూడా అమెరికా వచ్చాక అప్పుడు అమెరికా చూడాలని ప్రోగ్రాం వేసుకున్నాం.

బోస్టన్ వూరు చేరేసరికి రాత్రి 10 గంటలయింది. శారదారావు వాళ్ళు (అక్క కూతురు, అల్లుడు) కొత్తగా ఫోర్ బెడ్ రూము యిల్లు కట్టుకున్నారు. ఆ యిల్లు బ్రహ్మాండంగా వుంది, ప్రతిది టేస్ట్‌ఫుల్‌గా డెకరేట్ చేసింది. అన్నీ కొత్తగా మోడర్న్ గాడ్జెట్స్‌తో సినిమా సెట్టింగుల మాదిరి యిల్లు. కళ్ళు చెదిరే బాత్‌రూములు, మన దేశంలో లక్షాధికార్లకి కూడా అంత మంచి ఇళ్లుండవు. కాని శారద అమెరికా వెళ్ళిన ఐదేళ్ళకే అంత యిల్లు వాళ్ళు కట్టగలిగారంటే అక్కడ అంతా క్రెడిట్ సిస్టమ్. 250 వేల డాలర్లు అంటే మన కరెన్సీలో 32 లక్షలన్న మాట, అంత డబ్బు అంత తక్కువ కాలంలో సంపాదించడం ఏదో పెద్ద బిజినెస్ వాళ్ళు, మంత్రులు, సినిమా నటులకి మాత్రం సాధ్యం. కాని అక్కడ ఒక్క పదోవంతు మనం ముందు ఖర్చుపెడితే మిగతాదంతా "నెలకింత తీర్చాలి" అని క్రెడిట్ యిస్తారు. 250 వేల డాలర్లు అంటే వాళ్ళకి 2 లక్షల 50 వేల కింద జమ. మనకి రూపాయి ఎలాగో వాళ్ళకి డాలరు అలా అనుకుంటే ఇండియాలో 2 లక్షల ఏభై వేలకి అలాంటి ఇల్లు రాదు-మన రూపాయికి కొనుగోలు శక్తి ఏమీలేదు కాని డాలరుకి కొను గోలు శక్తి ఎక్కువ. ఆ దేశంలో 2, 3 వేల డాలర్లు తెచ్చుకుంటే మనకు 2, 3 వేల జీతంతో సమానం అయినా మన 2, 3 వేల రూపాయలతో బతికే స్థాయికంటె 2, 3 వేల డాలర్లలో బతికే స్థాయి ఎక్కువ.

మన ఇండియానుండి వెళ్ళిన వాళ్ళం ప్రతిది రూపాయిలలోకి మార్చి చూసుకుంటే అమ్మో అనిపిస్తుంది. కాఫీ, టీ డాలరు అంటే వాళ్ళకి

రూపాయి కింద లెక్క. మన డబ్బులోకి మారిస్తే కప్పు కాఫీ 13 రూ॥లు అవుతుంది. ఇండియానుంచి మనలాటి టూరిస్టులం అలా లెక్కలు కడతాం కాని అక్కడ డాలర్లలో సంపాదించేవారికి అక్కడ అన్నీ చవకే. ముఖ్యంగా ఆహార పదార్థాలు చాలా చవక. యూరప్‌లో అన్నీ ప్రియం. అమెరికాలో అన్నీ చవకే. పెట్రోలు, ఆహార పదార్థాలు, బట్టలు అన్నీ చవక. అక్కడ ఖరీదు అయినదల్లా లేబరు. మనిషిశక్తికి చాలా ఖరీదు. అందుకే అక్కడ ఎవరూ మనకున్నట్లుగా సర్వెంట్స్‌ని భరించడం కష్టం. గంటకి 10 డాలర్లు చెల్లించాలి పని మనిషి సాయంకావాలంటే. చంటిపిల్లల (ఉద్యోగస్థుల) తల్లులు యింట్లో మెయిడ్‌ని పెట్టుకుంటే 6 నించి 8 వందల డాలర్లు వరకు ఖర్చుపెట్టాలి. పసిపిల్లలని క్రెష్‌లో వదిలిపెట్టి వెడితే నెలకి 3, 4 వందల డాలర్లు వుంటుంది. మరీ డబ్బున్నవాళ్ళు అయితే తప్ప మెయిడ్‌ని పెట్టుకునే ఆలోచనే వుండదు అక్కడ. స్వంతంగా పనులు చేసుకుంటూ అంతంత యిళ్ళనీ అద్దంలా వుంచుకుంటారు అక్కడ. శని, ఆది వారాలు వస్తే బాత్‌రూములు కడుక్కోడం, యిల్లంతాక్లీనింగు చేసుకోడం—వాషింగ్ మిషన్‌లో బట్టలు ఉతుక్కోడం, అద్దాల తలుపులు తళ తళలాడేట్టు క్లీన్ చేసుకోడం, లాన్ మూవ్ చేసుకోడం యిలా వీక్ ఎండ్‌లో బోలెడు పని వుంటుంది వాళ్ళకి. ఓ రోజు తిరగడానికి మరో రోజు యిల్లు క్లీనింగ్‌కి పెట్టుకుంటారు. భార్యాభర్త టీనేజ్ పిల్లలుంటే వాళ్ళు అంతా తలో పని పంచుకుంటారు.

అక్కడ ఆడవారితో పోలిస్తే మన ఆడవాళ్ళు కష్టపడేది తక్కువే. మనలో పనిమనిషి లేనివారు సాధారణంగా వుండరు. యింకొస్త డబ్బుంటే వంటకి, తోటకి, కారుకి డ్రైవరు యిలా వుంటారు. ఉతకడానికి, యిస్త్రీలకి లాండ్రి వుంటుంది. యిలాంటి సదుపాయాలు అక్కడి ఆడవాళ్ళకి దొరకవు. ప్రతిది స్వయంగా వాళ్ళే చేసుకోవాలి. అయితే మనలా యిన్ని రకాలుగా ఉదయం టిఫిను, మధ్యాహ్నం లంచ్, సాయంత్రం చిరు తిండి, రాత్రి భోజనం యిన్ని రకాలుగా రోజంతా వంటింట్లోపడి వంటలు వండు

కుని తినరు. మన దేశంలో స్త్రీలకి సగం పొద్దు వంటింట్లో గడిచిపోతుంది. ఆ దేశంలో స్త్రీలకి వంటకి సులువయ్యే పరికరాలు, వస్తువులు వున్నాయి. చక్కగా కూరలు నీట్‌గా కట్‌చేసి పాకెట్లలో దొరుకుతాయి. అక్కడ రొట్టెలు (తందూరి రొట్టెలు) దళసరివి డజను పేకట్స్‌లో దొరుకుతాయి. అవి తీసుకొచ్చి ఫ్రీజర్‌లో పెట్టేసి రోజుకి కావల్సినవి మైక్రోవోవన్‌లో పెట్టేసి రెండు నిముషాలు వేడిచేస్తే అప్పుడు చేసిన వాటికంటె మృదువుగా అయిపోతాయి. గిన్నెలు కడుక్కోడానికి వాషింగ్ మెషీను. యిల్లు తుడవ డానికి వ్యాక్యూమ్‌క్లీనరు. యిరవై నాల్గు గంటలు వేడి, చన్నీళ్ళ సదు పాయాలు వుండడంతో పని సులువు. మనదేశంలో మాదిరి దుమ్ము, ధూళి ఎగరదు కనక అక్కడ వాతావరణంబట్టి తలుపులు అన్నీ వేసి వుంటాయి కాబట్టి యింట్లో దుమ్ముండదు కనక రోజూ యిల్లు తుడుకో నక్కరలేదు. వాల్‌టువాల్ కార్పెట్లు, కర్ర ఫ్లోరింగ్ కనక యిల్లు గుడ్డతో వత్తుకోడం లాంటి బాధలు లేవు. వేడినీళ్ల కొళాయిలో ఎప్పుడూ వస్తుం టాయి కనక తిన్న వెంటనే కొళాయికింద గిన్నెలు నిమిషంలో కడిగే యచ్చు. మనదేశంలో మాదిరి రోజూ వాళ్ళ యిన్ని బట్టలు ఉతక నక్కరలేదు. అక్కడ చలిదేశాలు, దుమ్ము, ధూళి, చెమట వుండదు కనక అండర్ వేర్స్ అవి తప్ప పేంట్సు, షర్ట్సు, వగైరాలు వారానికి ఓసారి అన్నీ కలిపి వాష్‌చేస్తారు. ఉదయంపూట అందరూ బిజీ, ప్రతి వాళ్లూ యిల్లు 7,8 గంటలలోపే విడిచి వెళ్ళాలి స్కూళ్ళకి, ఆఫీసులకి వెళ్ళేవారు. తల్లి కూడా ఉద్యోగస్థురాలే కనక ప్రతివాళ్ళు ఎవరంతట వాళ్ళు పాలు కావలిస్తే పాలు, ఫ్రూట్‌జూస్, సాండ్‌విచ్ కావలిస్తే సాండ్ విచ్....ఎవరికేం కావాలో వాళ్ళుతిని వెళ్ళిపోతారు. మనలా గృహిణే పడుతూ లేస్తూ అన్నీ అమర్చి టిఫిన్లు చేసి, వంట చేసి, టిఫిన్ డబ్బాలు కట్టిచ్చి ఉరుకులు పరుగులతో పరిగెట్టక్కరలేదు. చిన్నప్పటినించి పిల్ల లకి ఒకరిమీద ఆధారపడకుండా స్వంతంగా వాళ్ళకి వాళ్ళు తమ పనులు చేసుకోడం అలవాటయిపోయి ప్రతిదానికి తల్లిని వేధించరు. రెండు బ్రెడ్ ముక్కలకి వెన్న రాసుకుని, చీజ్ ముక్కలు పెట్టుకుని ఓవన్‌లో కాల్చు

కుని వెళ్ళిపోతారు. కొంతమందయితే ఫ్రూట్ జ్యూసో, గ్లాసు పాలో [illegible] వెళ్ళేవారు మధ్యాహ్నం లంచ్ చుట్టుపక్కల వుండే రెస్టారెంట్సునించి ఏ సాండ్‌విచ్, సలాడ్, ఫ్రూటో తిని కోక్ తాగడమో, కాఫీ తాగడమో చేస్తారు. అక్కడ ఎక్కడ పడితే అక్కడ రెస్టరెంట్సు కొల్లలుగా వుంటాయి. ఎక్కడికెళ్ళినా తిండి బాధ లేకుండా వారికి దొరుకుతాయి. అమెరికాలో అందరూ సరిగా పూర్తి భోజనం తినేది రాత్రి పూట మాత్రమే—ఫేమిలీ అంతా కలిసి రాత్రి తింటారు. వాతావరణాన్ని బట్టో, అలవాటయ్యోగాని అక్కడున్న మన తెలుగు వాళ్ళందరూ ఒక్క పూట శుభ్రంగా తిని మిగతా టైమంతా లైట్‌గా పళ్ళరసాలతోనో, పళ్లు, పాలతోనో గడిపేస్తున్నారు. అలవాటయితే ఆకలి బాగా వుండదు అనుకోండి—అక్కడ వారిలా తాజా పళ్ళరసం పెద్ద గ్లాసునిండా తాగాలంటే అరడజను బత్తాయిలు రసం తీసుకోవాలి. మనిషికి 3, 4 పళ్ళు చూసినా ఓ సంసారానికి రోజుకి అర్ధమండజను పళ్ళు ఖర్చు పెట్టగలిగే స్తోమత ఎక్కడుంది మనకి. అక్కడ తాజా పళ్ళరసం కాన్సన్‌ట్రేషన్ ఫ్రీజ్ చేసింది అమ్ముతారు పెద్ద పేకట్లల్లో. ఆ పాకట్ తీసుకొచ్చి మూడొంతుల నీళ్ళు కలిపితే చిక్కటి, ఫ్రెష్ బత్తాయిరసం, ఏపిల్ కమలారసం తయారైపోతుంది. ఓ రెండు లీటర్ల రసం ఓ డాలరు. మహా అయితే డాలన్నర వుంటుంది—యింక రకరకాల కేకులు, ఐస్ క్రీములు, బ్రెడ్స్, రకరకాల పళ్ళు....సరేసరి.... అన్నీ పుష్కలంగా దొరుకుతాయి.

యిలాంటివన్నీ మనదేశంలో మధ్య తరగతి సంసారులకి అందుబాటులో లేకపోవడంవల్ల ఏం చేసుకున్నా యింట్లో వండుకుని తినాల్సి రావడం వల్ల ఆడవాళ్ళెప్పుడూ వంటింట్లో పని చేస్తున్నట్టే వుంటుంది.

శారదావాళ్లు వున్నది బోస్టన్‌కి 30 మైళ్ళ దూరానవున్న "నార్త్‌బరో" అనే చిన్నవూరు. అమెరికాలో చాలా మంది సిటీ గోలకి దూరంగా ప్రశాంతంగా పల్లెల్లో వుండే వాతావరణం యిష్టపడి సిటీకి దూరంగా యిళ్లు కట్టుకుంటున్నారు. "బోస్టన్" మళ్ళీ పెద్ద సిటీ, ఆ వూరు నాను

కుని చాలా వూర్లు 30, 40 మైళ్ళ దూరల్లో వున్నాయి. బర్మింగ్‌హామ్, నార్త్ అంప్టన్, "పెన్ట్‌బరో" లాంటి వూళ్ళు వున్నాయి. అన్నీ అడవుల మధ్య వున్నట్టే వున్నాయి. అక్కడ చాలా మంచి పెద్ద యిళ్ళు కట్టుకుని బోలెడు మంది వున్నారు. అవి చిన్న వూళ్ళు, పల్లెటూళ్లు అయినా సిటీలో లాంటి సదుపాయాలే వుంటాయి. కరెంటు, నీళ్ళు, మంచిరోడ్లు, ఫోన్లు, టివిలు-సిటీలో వున్న సదుపాయాలుంటాయి—సిటీ రణగొణ ధ్వని తప్ప అమెరికాలో 30, 40 మైళ్ళంటే వాళ్ళకి ఓ దూరం కింద లెక్కకాదు, పెట్రోలు చవక. మంచి రోడ్లు. ప్రతివారికి కారు వుంటుంది కనక 25, 30 మైళ్లు అరగంటలో వెళ్ళిపోతారు. అసలు అమెరికాలో దూరం ఎంత అని చూడరు. అరగంట డ్రైవు, గంట డ్రైవు అని కాలాన్ని కొలుచు కుంటారు. ఆఫీసులకి రోజూ 30, 40 మైళ్ళు రావటానికైనా సిద్ధపడి ప్రశాంత వాతావరణంలో యిళ్ళు కట్టుకుని ఊరికి దూరంగా వుండడానికి ఇష్టపడతారు. సిటీలో అయితే ఫ్లాట్స్ తప్ప పెద్ద యిళ్ళు కట్టడం మాటలు కాదు కనక ఊరికి దూరంగా పెద్ద పెద్ద యిళ్ళు కట్టుకున్నారు. అక్కడ సెటిల్ అయిన మన తెలుగువాళ్ళు ఎవరికి 4 బెడ్ రూముల యిళ్ళకి తక్కువలేదు. 3,4 బెడ్‌రూముల యిళ్ళు వాళ్ళకి మామూలు అయిపో యింది. నార్తుబరో వూరు చిన్నదైనా ఎంతో అందంగా ప్రకృతిదృశ్యాల మధ్య కాటేజిల్లాంటి యిళ్ళు, చక్కని రోడ్లతో శుభ్రంగా వుంది.

అక్కడ ఓ పదిరోజులుండి రెస్టు తీసుకుని మళ్ళీ శక్తి పుంజు కున్నాం అమెరికా యాత్రకి. మా అక్కా బావ క్రితంసారే అమెరికా చూసేసారు కనక, మా 'అబూదాబి' చెల్లెలు కూడ యిదివరకే చూడడం వల్ల నేను, వైజాగ్ చెల్లెలు శ్యామల, దాని కూతురు విజయ ముగ్గురం అమెరికా యాత్రకి ప్లాను చేసాం.

మా శారద పాపం ఆఫీసునించివచ్చి రోజూ చుట్టుపక్కలకి ఎక్క డికో తీసికెళ్ళేది. ఫెర్మింగ్‌హామ్, పెన్ట్‌బరో.... యిలా పాతికముప్పై మైళ్ళ దూరంలో వుండే 'మాల్స్' (అంటే పెద్ద పెద్ద డిపార్ట్‌మెంటల్

షాపులు)కి తీసికెళ్ళేది. అమెరికాలో 'మాల్స్'లోకి వెడితే పిచ్చెక్కుతుంది ఇండియానించి వెళ్ళినవారికి. అక్కడ దొరకని వస్తువులుండవు. సూదులు మొదలు సూట్లు వరకు, సూట్ కేసులవరకు అన్నీ దొరుకుతాయి. రక రకాల డ్రస్సులు, బ్యాగులు, మేకప్ సామాన్లు, కిచెన్ వేర్, బాత్ రూమ్ ఎక్విప్‌మెంటు, దుప్పట్లు, రగ్గులు, బ్లాంకెట్స్, పరదాలు పింగాణీ అలంకార వస్తువులు, గాజు వస్తువులు. డిన్నరు సెట్లు, ప్లాస్కులు, ఎలక్ట్రిక్ సామాన్లు గార్డెనింగ్ సామాన్లు, యినుపసామాన్లు, డెకరేటివ్‌పీసెస్.... యిదీ అదీ అని లేకుండా అన్ని రకాల వస్తువులు దొరుకుతాయి. ఆ డిపార్ట్ మెంటల్ స్టోర్సులో. మామూలు పాష్ లొకాలిటీ షాపులకంటే ఈ షాపుల్లో చాలా చవక. అంతేకాక ఎప్పుడూ అమెరికాలో ఏవో 'సేల్స్' పెట్టి నగం ధరకి అమ్మేస్తుంటారు సామాను. ఆ 'సేల్స్' గురించి పేపర్లో పడిన ప్రకటనలు టిక్కులు పెట్టుకుంటూ అవన్నీ కత్తిరించి పెట్టుకుంటుంది మా శారద. అమెరికా వెళ్ళి ఐదేళ్ళయినా దానికింకా 'సేల్స్' పిచ్చి వదల లేదు. సేల్స్‌లో చవగ్గా వచ్చినవన్నీ కొనిపడేసి యిల్లంతా నింపేస్తుంది. దానింట్లో అరడజనుమంది తిన్నా రెండేళ్ళకి సరిపోయే ఆహారపదార్థాలు, సబ్బులు, షాంపూలు, టూత్ పేస్టులు స్టాకువున్నాయి. ఏమిటే యీ పిచ్చి అంటే చవగ్గా వచ్చాయంటుంది. దాన్నెందుకు అనడం? అక్కడున్నన్ని రోజులు మేం వెళ్ళి నానారకాలు కొనేశాం. పెట్టెలు, బ్యాగులు, సబ్బులు, షాంపూలు, దుప్పట్లు, ప్లాస్కులు, కిచెన్‌సామాన్లు. అవి నిజంగా నాణ్యతగా చవగ్గా వున్నాయి.

మేం అక్కాచెల్లెళ్ళం శారద అందరూ కల్సి అక్కడే 'వరలక్ష్మి పూజ' చేసుకున్నాం. అమెరికాలో వున్నా మాకు ఇండియాలో పూజ చేసు కున్నట్టే వుంది తప్ప ఏం తేడా కనిపించలేదు. అసలు నిజానికి కొన్ని వస్తువులు యిండియాలో కంటె కూడా మంచివి దొరుకుతున్నాయి. అన్ని రకాల పప్పులు, పూరలు, చింతపండు, కొబ్బరికాయలు, ములక్కాడలు, గుమ్మడికాయలు-అసలు దొరకనివి అంటూ ఏం లేవు. ఆఖరికి మామిడి కాయలు కూడా ఫ్లారిడానించి వస్తాయి. ఆకారణంగా అక్కడి తెలుగువారికి, ఇండియన్స్‌కి దేనికీ లోటు లేదు-అసలు నిజం చెప్పాలంటే యిండియాలో

వున్నప్పటికంటె అమెరికా వెళ్ళాక మనవారు మన ఆచారవ్యవహారాలు, పూజాపునస్కారాలు బాగా జరుపుతున్నారనిపించింది నాకు. స్వదేశంలో మనవాళ్ల మధ్య వుంటే మన సంస్కృతి గురించి అట్టే పట్టించుకోం గాని, విదేశాలు వెళ్ళి మన దేశానికి, మనుష్యులకి దూరం కాగానే మన భాష, మన సంస్కృతి మీద అభిమానం పుట్టుకొచ్చేస్తుంది. అక్కడున్న మన వాళ్లందరూ చాలా శ్రద్ధగా వినాయకచవితులు, వరలక్ష్మివ్రతాలు, దసరా, సంక్రాంతి లాంటి పండుగలు, సత్యనారాయణవ్రతాలు అన్నీ చేస్తున్నారు. అమెరికాలో వున్న తెలుగువారు విసిరేసినట్టు యిక్కడ అక్కడ పాతిక ముప్పై మైళ్ల దూరాల్లో వున్నా....వారానికీ, నెలకి ఓచోట ఏదో వంకన సత్యనారాయణవ్రతం అనీ, పూజ అనో, పుట్టిన రోజు అనో ఏదోలా ఓ పది పదిహేను కుటుంబాలు కల్సి వీక్ ఎండ్స్ సరదాగా గడుపుతారు. శారద కొత్తయిల్లు కట్టుకుందని, మేం అందరం వున్నామని ఓ వీక్ ఎండ్ సత్యనారాయణ పూజ చేసి ఓ పదిమంది కుటుంబాలని భోజనాలకి పిల్చింది. ఓ ముప్పైఏభై మంది తెలుగువారు వచ్చారు. అందరూ 25,30 మైళ్ల దూరాలనించి వచ్చినవారే — అక్కడ ఓ ఉద్యోగి యిలాంటి పూజలు పునస్కారాలకి పౌరోహిత్యం జరపడానికి వున్నారు, శాస్త్ర తెలుగు, సంస్కృతం వచ్చినాయన. ఆయన వచ్చి పూజ జరిపించారు. మా అక్క చెల్లెళ్లం అందరం నడుంకట్టి బూరెలు, పులిహోర, ఆవడలు దగ్గరనించి ములక్కాయల పులుసు, ఆవకూరలు, వంకాయ మెంతికారం కూర అన్నీ అచ్చ తెలుగువంటలు వండాం — అక్కడ పనివారుండరు కనక వచ్చిన గెస్టులు అందరూ తలోపని అందుకుని యిల్లాలికీ సహాయం చేస్తారు. ఎవరింట్లో ఏ అవసరం వచ్చినా అందరూ నడుంకట్టుకుని పని చేయడం మెచ్చదగిన విషయం. మేం వున్నాం కనక ఆ అవసరం ఆ రోజు రాలేదు. లేకపోతే భార్యాభర్తలిద్దరూ పార్టీ అంటే రెండురోజులు యిల్లు సర్దుకోడం, ఓ రెండు రోజుల ముందునించి నాలుగైదు రకాల వంటలు ముందుగా చేసి ఫ్రిజ్‌లో పెట్టేసి ఆ రోజు తాజాగా వండాల్సిన అన్నం, పప్పు, చారు లాంటివి ఏవో కొన్ని చేస్తారు. అలా చేసుకోక

పోతే వచ్చినవాళ్లని చూసుకోడం, పాతిక ముప్ఫైమందికి వంట అంటే మాటలు కాదు. అందరి ఇళ్ళలో పెద్ద పెద్ద డీప్‌ఫ్రీజర్స్ వుంటాయి. కూరలపేకట్లు, వండిన వంటలు, ఐస్‌క్రీములు అలా అన్నిరకాలు ఏ వేళకి అతిథులు వచ్చినా రెండు, మూడు రకాలు వుండేట్టు శని, ఆదివారాలు తయారు చేసిపెట్టుకుంటారు. మా శారద వారానికి రెండు రోజులు వంట చేస్తుందిట రాత్రిపూట. అవి వారంలో ఐదురోజులు తిని, శనివారం సాధారణంగా పార్టీలుంటే పార్టీకి, ఏదీ లేనపుడు బయటికి వెళ్లి హోటల్లో తింటారుట. ఆదివారం మళ్ళీ రెండు, మూడు రకాలు వండుకోడం, ఫ్రిజ్‌లో పెట్టుకోడం....యిదీ అక్కడ యిల్లాళ్ళందరూ చేసే పని.

సత్యనారాయణవ్రతం చాలా సరదాగా బాగా జరిగింది. వాళ్లకి అక్కడ, అందరి దగ్గరా సాధారణంగా వీడియోకెమెరా లుంటాయి గనక అంతా టేప్ చేశారు. పూజ అనే కాదు, పండగ అనే కాదు, ఊరికే ఒకరింటికి ఒకరు భోజనాలకి వెళ్ళినా ఏవో కానుకలు ఒకరికొకరు యిచ్చుకుంటూనే వుంటారు అక్కడ.

అమెరికాలో చాలాచోట్ల హిందూ దేవాలయాలు కడ్తున్నారు. పిట్స్‌బర్గ్‌లో వెంకటేశ్వర స్వామిదీ, న్యూయార్క్‌లో గణేశ ఆలయం (అక్కడ అన్నిరకాల దేముళ్లు వున్నారనుకోండి) హూస్టన్‌లో రాజేశ్వరి ఆలయం, చికాగోలో కొత్తగా యింకోటి....యిలా చాలాబాగా కడ్తున్నారు. పూజావిధానాలు అక్కడ యిండియాలో కంటే చక్కగా జరుగుతున్నాయి. తిరుపతి నుంచి పురోహితులని అక్కడికి పంపి శాస్త్రోక్తంగా అక్కడ అన్ని పూజావిధానాలు జరిపించడం చూస్తే మన వూళ్లకంటే ఏం తీసిపోలేదు సరికదా యింకా అందంగా, శుచిగా, శుభ్రంగా వున్నాయి అనిపించింది. శని, ఆదివారాలు యిండియన్స్ అంతా వచ్చి కళకళలాడుతాయి దేవాలయాలు. కొందరు ఉపనయనాలు, వివాహాలు కూడా ఆ దేవాలయల్లో జరిపిస్తున్నారు.

మనవాళ్లందరూ వీలయినపుడల్లా కల్సుకోడం, పార్టీలిచ్చుకోడం బాగానే వుంది. కాని అక్కడ అమెరికన్స్ మాత్రం మనవాళ్లతో కలవరు.

వాళ్లనలు పక్కింట్లో ఎవరున్నది పట్టించుకోరు. ఎప్పుడన్నా ఏ లాన్‌లోనో కనిపిస్తే చేయి ఊపడం, హాయ్ అనడం తప్ప పెద్దగా రాకపోకలు, వగైరా స్నేహాలు మన యిండియన్స్‌తో ఏర్పరచుకున్న వారుండరు సాధారణంగా. అసలు మనలా వాళ్లకింతమంది ఫ్రెండ్సు, యిలాభోజనాలు పెట్టడం వగైరా లుండవు. టప్ మీనాట్‌లా ఎవరిపనివారు చేసుకుంటూ అంటీముట్టనట్లుంటారు. వాళ్లు. మనవాళ్లు ఇండియన్స్ ఎవరూ చుట్టుపక్కల లేకపోతే చాలాలోన్లీగా ఫీలవుతారు. ఆఫీసునించి వచ్చాక ఎంతసేపూ ఫేమిలీతో గడపాల్సిందే కాని ఎవరితో మాటామంతీ వుండదు. అసలు అక్కడ లైఫ్‌కూడా బిజీ ఏమో టైము కూడా వుండదు. ఉదయంలేచి పనులకి పోవడం, రాత్రి వచ్చి వండుకుని తిని టివి చూసి నిద్రపోవడం, శని, ఆదివారాలు వస్తే క్లీనింగులతో—పక్కవారితో మాట్లాడే కోరిక, ఓపిక ఎవరికీ వుండవు అక్కడ. విదేశీయుల జీవన విధానంవేరు. వాళ్ళకి మనలా యిలా బంధువులు రావడం, వాళ్ళకి వండి వార్చి అతిధి మర్యాదలు చెయ్యాలన్న బాధలు, యిచ్చి పుచ్చుకునే ఆచారాలులేవు. బంధువులు వచ్చినా హోటలులో వుంటారు. వీళ్ళకిష్టమయితే ఏదో ఒక పూట డిన్నరుకి బయట హోటల్‌కిపిలిచి యిస్తారు తప్ప యింట్లో నానా హైరానా పడి మనలా వంటలు వార్పులు చేయరు. ఏవో క్రిస్టమస్ కార్డులు, చిన్న బహుమతులూ తప్ప పుత్తప్పుడు యింటికెవరన్నా వస్తే చీర, సారె అనే ఆచారాలు వాళ్ళకి లేవు. వాళ్ళ ప్రపంచం ఎంతసేపు వాళ్ళ ఫేమిలీతోనే వుంటుంది. భార్యాభర్త, పిల్లలు అంతే. భర్త భార్యకి అన్ని యింటి పనుల్లో సాయం చేస్తాడు. ఆడపని మగపని అని లేకుండా అన్నీ యిద్దరూ కల్సి చేసుకుంటారు. పిల్లలని చిన్నప్పుడు వాళ్ళ చాలా ముద్దుగా, అపురూపంగా చూస్తారు. చిన్నప్పుడు ఎంత శ్రద్ధ చూపిస్తారో పెద్దయ్యాక 16, 17 ఏళ్ళు వచ్చిన దగ్గరనించి అంతగా పట్టించుకోకుండా వదిలేస్తారు. వాళ్ళ పిల్లల పెంపకంచూస్తే - పక్షులు, జంతువులు పిల్లకి ఎగరడం, వేటాడడం వచ్చేవరకు కంటికి రెప్పలా నిద్రాహారాలు మాని, ఎవరైనా శత్రువు దగ్గిరికి వస్తే చీల్చి చెండాడే తల్లి - రెక్కలు రాగానే

గూట్లోంచి తరిమేసే తీరు కనిపిస్తుంది. చిన్నప్పుడు వాళ్ళతో ఆడుతూ పాడుతూ, ప్రతిది ఓపికగా వివరించి చూపుతూ, సెలవుల్లో ప్రతిసారి బోలెడు ఖర్చుపెట్టి వాళ్ళని తిప్పి వాళ్ళ సంతోషం కోసం ఎంతయినా చేస్తారు. ఇంట్లో—వాళ్ళని ఎంతో ప్రేమగా, ఎంతో నేర్పుగా అదుపులో పెట్టి క్రమశిక్షణతో పెంచుతారు తల్లిదండ్రులు. వాళ్ళ భోజనం, బట్టలు అవి ఎంతో శ్రద్ధగా చూస్తారు. పిల్లల్లో పిల్లలా కల్సిపోయి వారితో సమయం అంతా గడుపుతారు. అలాంటిది వ్యక్తిత్వం రాగానే తల్లిదండ్రులు పిల్లల యిష్టాలకే వదిలేస్తారు అన్నీ. వాళ్ళ 'చదువుకోం, ఉద్యోగం చేస్తాం' అంటే వూరుకుంటారు. ఆ ఉద్యోగం ఎంత చిన్నదైనా వాళ్ళేం నామోషీ అనుకోరు మనలాగా. అయ్యో పిల్లాడు మెట్రిక్ చదివి ఆపేశాడు అని బెంగపడి, సిగ్గుపడి అవమానం అనుకోరు. వాడిష్టం అనుకుంటారు. కూతురు ఎవడ్నో అనామకుడ్ని పెళ్లాడుతానంటే తల్లిదండ్రులుగా చెప్పి చూస్తారు. కాదంటే వూరుకుంటారు తప్ప మనలా అవమానం అనుకుని ఏడ్చి రాగాలెట్టి సీన్లు తయారుచెయ్యరు. అసలు ఒక వయసు రాగానే పిల్లలకి స్వతంత్రం వచ్చేస్తుంది. సమ్మర్ జాబ్స్ చేసుకొంటారు. పేపర్లు వేస్తారు. పెట్రోలుబంకుల్లో పనులు చేస్తారు. బేబి సిటింగ్ చేసి సంపాదించుకుంటారు. ఆ డబ్బుతో వాళ్ళ ఫ్రెండ్సుతో తిరగడం, జల్సాలు చేసుకోడంచేస్తారు. పిల్లలు చదువుకోడానికి ఉత్సాహం చూపితే స్తోమతగల తల్లిదండ్రులు తప్పక డబ్బుయిచ్చి చదివిస్తారు. చదువుకోం అంటే వాడి భవిష్యత్తు ఏమిటా అని దిగులుపడిపోరు. ఆడ మగ వయసు వచ్చినదగ్గిరనించి డేటింగులు చేస్తారు. అది వాళ్ళకి తప్పు లేదు కనక కట్టడి చేయరు.

మంచయినా చెడయినా అనుభవించాల్సింది వాళ్ళేగాని తల్లిదండ్రుల బాధ్యత వుండదు. కొడుకు పెళ్ళి కాగానే వేరుగా వెళ్ళిపోతాడు. ఒకే వూళ్ళో వున్నా. వీళ్ళకి వాళ్ళకి యిష్టం అయితే ఏ పండుగ దినాల్లోనో కలుస్తారు రాలేదని వీళ్ళనుకోరు. పెళ్ళకపోతే ఏం అనుకొంటారో నన్న బాధ కొడుక్కీ కోడలికి వుండదు. అంటే అంటీ ముట్టనట్టు

వుంటారు. ఏ భార్యా భర్త, చిన్నప్పుడు, పిల్లలు తప్ప మిగతా బంధుత్వాలు ఏమీ పటిష్ఠంగా వుండవు వాళ్ళకి. ఆ భార్యాభర్త నిజంగా ఒకరిమీద ఒకరికిష్టం, ప్రేమ వుంటేదే కల్సివుంటారు లేదంటే విడిపోతారు. కనక, వాళ్ళకి మిగతావారితో అట్టే ప్రమేయం లేకుండా వాళ్ళిద్దరూ ఒకరి కోసం ఒకరు బతుకుతూ ఆనందంగా గడిపేస్తారు. అందుకే పిల్లలు ఘోరమైనా, నిర్లక్ష్యం చేసినా అంత బాధ పడరేమో అనిపిస్తుంది. మన వివాహాలలో నూటికి తొంభై ఐదు శాతం భార్యాభర్తలు లోకం కోసం, పిల్లలకోసం, ఏదో ఒక మొగుడు, పెళ్లాం అనుకుని కాపురాలుచేసే రకాలు కనక వాళ్ళ అభిమానాలు, ప్రేమలు పిల్లలమీద ఎక్కువ కేంద్రీకృతమై వుంటాయి. అందుకే పిల్లలు ఏ మాత్రం పాడయినా, నిర్లక్ష్యం చేసినా, తమ మాట వినకపోయినా తల్లడిల్లిపోతారేమో అనిపిస్తుంది నాకు. మనలా వాళ్ళకి పిల్లలకోసం అన్ని త్యాగాలు చేసి ఆస్తులు పోగు చేసి యివ్వాలన్న ధోరణి కనపడదు. వారున్నన్ని రోజులు వారికోసం వారు ఎంజాయ్ చేసి వుంటే మిగతాది పిల్లలకిస్తారు. కొందరయితే ఛారిటీస్‌కి యిచ్చిపోతారు. పెద్దయ్యాక ఎలావున్నా చిన్నప్పుడు మాత్రం వాళ్ల పిల్లల్ని ఎంత చక్కగా పెంచుతారో చూసి నేర్చుకోవాలి మనం. చాలా మంచి ఉద్యోగం చేసే తల్లులు పిల్లలకోసం ఉద్యోగం వదిలివేస్తారు—పిల్లలు పెద్దవాళ్ళయ్యేవరకు. మా శారద వాళ్ళ యింటి చుట్టుపక్కల వుండే అమెరికన్ ఆడవాళ్ల పిల్లల తల్లులు యింటిపట్టునే పిల్లలను చూసుకుంటున్నారు అని తెలిసి ఆశ్చర్యపడ్డాం. మన అవసరాలకంటే వాళ్ళ అవసరాలు తక్కువ అంటుంది మా శారద. మనలా యిలా ఏది చూస్తే ఆ డ్రస్సులు, చీరలు కొని పడేయరు వాళ్లు. వాళ్ళ వింటర్‌కి సరిపోయే—దుస్తులు రెండు, మూడు రకాలు, సమ్మర్‌కి సరిపోయే బట్టలు కొన్ని, బయట పార్టీలకి వేసుకోడానికి రెండుమూడు మంచి డ్రస్సులుంటాయి. మనలా ఏభై వంద చీరలంటే వాళ్ళు ఆశ్చర్యపోతారు. తిండి విషయంలో కూడా వాళ్ళకిన్ని రకాలు లేవు. యిన్నిరకాలు చేసుకోరు. మనలా చుట్టాల పక్కాల బాధలేదు వాళ్ళకి. వాళ్ల ఏడాదికి రెండేళ్ళకి నాలుగు డబ్బాలు

పోగుచేసుకుని సైట్ సీయింగుకి వెళ్లాలన్న కోరిక తప్ప వాళ్ళకి నగలు, డ్రస్సులు, పిల్లలకి డబ్బులు దాచాలని లేదు కనక వాళ్ళ అవసరాలు పరిమితమే అంటుంది. తరువాత మనదేశంలో మాదిరి ప్రతివాళ్లు తమ పిల్లలని యింజనీరు, డాక్టరు చెయ్యాలనుకోరు. చాలా యింటరెస్ట్ వుండి, తెలివిగా చదువుకునే వారు తప్ప పై చదువులకి వెళ్ళరు. చాలామంది 12వ తరగతి తరువాత ఏవో కోర్సులు తీసుకుని ఉద్యోగాలకి పోతారు. అంచేత తల్లి తండ్రులకి పిల్లల చదువులకి అట్టే ఖర్చు పెట్టాల్సిన అవసరం లేదు. పదహారు పదిహేడేళ్ల వచ్చిం దగ్గిరనించి పిల్లలు పనులుచేసి సంపాదించుకుంటారు వారి ఖర్చులకి, వారి పాకెట్ మనీకి. అంచేత ఆ బరువు తల్లి తండ్రుల మీద వుండదు.

అక్కడ ఆ దేశాలలో స్కూలింగ్ వరకు చాలా తక్కువ డబ్బు. యించుమించు ఉచితం. కాని టెక్నికల్ కోర్సులు-డాక్టరు, యింజనీరింగు, ఎమ్. బి. ఏ. లాంటివి, కాలేజి స్థాయిలో చాలా డబ్బు ఖర్చుపెట్టాలి చదువుకి. మనదేశంలో మాదిరి పెద్ద చదువులు చదివినవారు చాలా తక్కువ శాతం వుంటారు అక్కడ. ఐనా ఇంతమంచి డాక్టర్లు, యింతమంది యింజనీర్లు, ఎమ్.బి.ఎలు, ఏ దేశంలోనూ లేరు నిజంగా. మనదేశంలో టెక్నికల్ కోర్సులు యింతమంది చదవ గలుగుతున్నారు అంటే, మధ్య తరగతి సంసారులు సయితం పిల్లల్ని డాక్టర్లు ఇంజనీర్లు చదివించ గలుగుతున్నారంటే గవర్నమెంటు కాలేజిల్లో ఈ చదువులు యించుమించు ఫ్రీగానే లెక్కవేసుకోవచ్చు. మనదేశంలో యీ విద్య, వైద్య సదుపాయాలు ఫ్రీగా వున్నట్టు చాలా దేశాల్లో లేవు. అక్కడ డాక్టరు చదివించాలంటే ఏడాదికి పాతికవేల డాలర్ల వరకు అవుతుందిట. ఆ లెక్కన 5, 6 ఏళ్ల చదువుకి ఎంత అవుతుందో ఆలోచిస్తే మామూలు కుటుంబీకులు చదివించలేరు. ఐతే, ఒకసారి డాక్టరు అయ్యాక అక్కడ బాగా సంపాదిస్తారనుకోండి. అంచేత నిజంగా శ్రద్ధ, తెలివి, కుతూహలం, భరించగలిగినవారు మాత్రమే పెద్ద చదువులు చదువుతారు. చాలామంది స్కూలుతోనే ఆపేసి ఏవో కోర్సులు చదువుతారు. కొంతమంది కాలేజి స్థాయి ముగించి మిగతా ఏడాది రెండేళ్లకోర్సులు చదువుతారు.

అక్కడ ఈ ఉద్యోగం చెయ్యకూడదు-ఫలాన ఉద్యోగమే చెయ్యాలని లేకపోతే పరువు తక్కువ అని ఎవరూ అనుకోరు. కనక ప్రతి ఉద్యోగానికి వెడతారు—హోటలు సర్వర్స్, పెట్రోలు బంకుల్లో, హోటల్లో క్లీనింగ్, షాపుల్లో సేల్స్ గరల్స్, కంప్యూటర్స్‌లో, ఆఫీసులో సెక్రటరీలు, టైపిస్టులు-రకరకాలుగా ఉద్యోగాలు చేయటానికి సంసిద్ధులు అవుతారు. అక్కడ మనదేశాల్లో మాదిరి ఆఫీసుల్లో యింతమంది స్టాఫ్ వుండరనలు. యిలా ప్యూనులు.... కాగితాలు తీసికెళ్లడం, ఫైల్స్ అందించడం, యిలాంటి పనులకి ఎవరూ వుండరు. ఎంత పెద్ద ఉద్యోగి అయినా ఎవరి పనులు వాళ్లు చేసుకుంటారు. కింద ఉద్యోగితో డిస్కస్ చెయ్యాలంటే ఇంటర్‌కమ్‌లో పిలిచి పని జరుపుకుంటారు తప్ప గుమాస్తా నించి, ఆఫీసరుకి, ఆఫీసరు నించి పై ఆఫీసరుకి, అక్కడినించి యింకా పైకి అలా ఫైల్సు నెలల తరబడి ప్రయాణం చెయ్యవు. మన యీ రెడ్ టేపిజమ్, ఆఫీసుల్లో పని అవడానికి లంచాలు, డబ్బు ముట్ట చెప్పకపోతే కాగితాలు కదలకపోవడం లాంటివి అనలుండవు. ప్రతివారికి రెస్పాన్సిబిలిటీ వుంటుంది. ఎవరి పని వారు చేసుకోవాలి. పనిలో ప్రోగ్రెస్ లేకపోతే పై అధికారికి సంజాయిషీ యివ్వాలి కనుక ఎవరి పని వారి నిర్ణీత సమయాల్లో పూర్తిచేస్తారు. వారానికి ఐదు రోజులు ఠంచనుగా ఆఫీసుకు వెళ్ళి, టైము ప్రకారం పనిచేసి, మళ్ళీ టైము అయ్యేసరికి వెళ్ళిపోతారు. ఆఫీసులో వున్నంతసేపూ వళ్ళువంచి పనిచేస్తారు.

ఉద్యోగస్తుల్లోనే కాదు వర్తకులలో కూడా నిజాయితీ వుంది. ఏ వస్తువులోనూ కల్తీ వుండదు. తూకంలో తప్పు వుండదు. ధరలో మాయ వుండదు. కొనుక్కునేవారూ తమని ఎవరూ చూడకపోయినా చిన్నవస్తువు కూడా దొంగచాటుగా తీసుకోరు. పెద్ద పెద్ద షాపుల్లో, డిపార్ట్‌మెంట్ స్టోర్సులో సేల్స్‌గర్ల్స్ ఎవరూ వుండరు. ఓ ట్రాలీ తీసుకొని మనకు కావల్సిన సామాను తీసుకొని ఆఖర్న బిల్లు వేసేందుకు మాత్రం రెండు మూడు కౌంటర్లుంటాయి. అక్కడ బిల్లు వేయించుకోవాలి. ఈలోగా చెయ్యాలంటే

ఏ చిన్న చిన్న వస్తువులో బ్యాగుల్లో పడేసుకోవచ్చు — పెద్ద నగల దుకాణాల్లో, పెద్ద పెద్ద షాపుల్లో టి.వి. సర్క్యూట్స్ వుంటాయి ఎవరన్నా దొంగతనం అదీ చేస్తే కనిపెట్టడానికి. మామూలు షాపుల్లో చూసేందుకు ఎవరూ లేకపోయినా వారు నిజాయితీగా అన్నీ తీసుకొచ్చి బిల్లు వేయించు కుంటారు. షాప్ లిఫ్టర్స్ వాళ్ళ దేశంలోనూ వుంటారుగాని, నూటికి, వెయ్యికి ఒకరు కూడా వుండరు సాధరణంగా.

అదే మన ఇండియన్ షాప్స్‌లో అయితే మనలాంటివాళ్ళం ఏదైనా కొనడానికి వస్తే ఏం కావాలి అని అడుగుతూ ఏం కావాలో చూపిస్తారు. అదే ఫారినర్స్ వస్తే మనవెంట వచ్చినట్టు వాళ్ళవెంట తిరగకపోవడం నేను కనిపెట్టాను. మన నిజాయితీ ఎంతో వాళ్ళకీ తెలుసు, మనకీ తెలుసన్న మాట. అంటే ఇండియన్స్ అందరూ దొంగలని, నీతినిజాయితీ లేనివారని చెప్పడంకాదు. ఆ పర్సంటేజ్ మనలో ఎక్కువ అని చెప్పగలం మనం. అంతేకాదు అమెరికాలో అమెరికన్స్ షాప్స్ ఖచ్చితంగా టైము ప్రకారం 6 గంటలకల్లా మూసేసి యింటికి పోతారు. అదే మన ఇండియన్ షాప్స్ అయితే రాత్రి తొమ్మిది వరకు తెరిచి కూర్చుంటారు. అక్కడ కస్టమర్స్ వున్నా "టైమ్ అయిపోయింది సారీ వెళ్ళిపొండి" అనేసి తలుపు మూసేస్తారు వాళ్ళు. మనవాళ్ళు టైము అయిపోయినా షాపు తెరిచి కూర్చుంటారని ఇండియన్స్‌కి డబ్బు కాపీనం, ఓ ఎంజాయిమెంటు లేదని అనుకుంటారు అక్కడ అని అక్కడున్న మన తెలుగువాళ్ళు అన్నారు. వాళ్ళు అంత పంక్చువల్‌గా, స్ట్రిక్ట్‌గా రూల్సు ఫాలో అవుతారు.

అక్కడ పెట్రోలు బంక్స్‌లో కూడా సెల్ఫ్ సర్వీస్. డబ్బులు వేసి ఎవరంతట వాళ్ళు పెట్రోలు నింపుకోవాలి. అన్నింటికి మిషన్సు వుంటాయి. డబ్బులు వేసినంతే వస్తుంది. కనక చీటింగ్‌కి తావుండదు. రైలు టిక్కట్లు, బస్సుల్లో టిక్కట్లు అన్నీ మిషనులో డబ్బులు వేస్తేనే వస్తాయి గనక ఎక్కడా టిక్కట్లు లేని ప్రయాణీకులు, టిక్కట్లు కొనకపోవడం వగైరాలు జరగవు. బస్సులో మనలా కండక్టరు వుండడు. సీటు దగ్గిర డ్రైవర్ ఒక్కడే వుంటాడు. ఎక్కిన తరువాత అతని దగ్గిరున్న మిష

సులో చిల్లర వేస్తే టిక్కెట్టు వస్తుంది. అతను బటన్ నొక్కగానే ఆటో మెటిక్‌గా తలుపులు మూసుకుంటాయి. ఒక్క మనిషి మేనేజ్ చేస్తాడు అక్కడ. బస్సులు నిమిషాలతో సహా టైము ప్రకారము వస్తాయి. ఆల శ్యం అయితే డ్రైవరుకి జరిమానా వుంటుంది కనక ప్రతివారు టైము నిబంధన తప్పక పాటిస్తారు. ఎప్పుడన్నా ఏ కారణంగానైనా ట్రాఫిక్ జామ్ జరిగి బస్సు బాగా ఆలశ్యం అయితే డ్రైవరు బస్సులో వున్న ఫోనులో డిపోకి మెసేజ్ పంపుతాడు.

అక్కడ కార్లు పార్కింగ్ స్థలాల్లో తప్ప పార్క్ చెయ్యడానికి వీలులేదు. పార్కింగ్‌కి స్థలాలు నిర్దేశించినచోట పార్కింగ్ మిషను వుం టుంది. అందులో అరగంటకి అరడాలరు చొప్పున వెయ్యాలి-మీటరు వుం టుంది. మనమేదన్నా షాపుకి వెడితే అరగంటలో పని కాకపోతే ఎవరో ఒకరు వెళ్ళి మళ్లీ డబ్బులు వేసిరావాలి చచ్చినట్టు. ఆ కారు దగ్గిరలో కాకుండా ఏ మూలో దూరంగా వున్నా ఆ బాధ తప్పదు. అంచేత సిటీలో చాలామంది షాపింగులకి కార్లు తీసికెళ్ళరు పార్కింగ్ బాధ పడలేక—ఏ మాత్రం అశ్రద్ధ చేసినా ఏ క్షణంలోనైనా పోలీసులు "టో" చేసి తీసికెళ్ళి పోతారు. 150 డాలర్లు ఫైను కట్టడమే కాకుండా ఎక్కడో పడేసిన కారు వెళ్ళి తెచ్చుకోవాలి. అక్కడ అంత స్ట్రిక్టుగా వుంటారు పోలీసులు. వాళ్లకి చాలా పవర్సు వున్నాయి కనక ప్రతివారు రూల్సు తుణ్ణంగా పాటిస్తారు. న్యూయార్కు, వాషింగ్టన్, శాన్‌ఫ్రాన్సిస్కో లాంటి పెద్దపెద్ద పట్టణా లల్లో కారు పార్కింగ్‌కి ప్లేసు దొరకడమే గగనం-దొరికినా ఏ కిలోమీరుట అవతలో దొరుకుతుంది. అందుచేత చాలామంది యింటినించి కారులో వెళ్ళి ట్యూబ్ రైలు స్టేషను (అండర్ గ్రౌండ్ రైలు) దగ్గిర పార్కింగ్ చేసి, ట్యూబ్ రైలులో ఆఫీసులకెళ్ళి తిరిగి మళ్లీ రైలుకు వచ్చి కారు తీసుకుని యిళ్ళకి వెళ్లిపోతారు. రైలు స్టేషను దగ్గిర పెద్దపెద్ద పార్కింగ్ ప్లేసులుంటాయి ప్రతి ఏరియాలో. అక్కడ రోజూ కార్లు పెట్టేవారికి కన్సె షన్ రేట్సు వుంటాయి పార్కింగ్‌కి (ఆ ట్యూబ్ రైలు టిక్కెట్టు చూపిం చాలి.) ఎయిర్‌పోర్టుకు దగ్గిర సిటీలో పెద్ద పెద్ద ఏరియాల్లో, ఆఫీసులు

షాపులున్నచోట చాలా పార్కింగ్ లాట్స్ వదేసి అంతస్థులున్నవి కూడా వుంటాయి. అక్కడ పార్క్ చేసిన కార్లు వేల సంఖ్యలో వుండి మన లాంటివారికి ఆశ్చర్యం కలిగిస్తాయి. వాళ్ళు అంత పకడ్బందీగా, అంత కరక్ట్‌గా రూల్సు రెగ్యులేషన్స్ పాటిస్తున్నారు. గనక లక్షల కార్లు వున్న ఆ దేశాలలో అంత సిస్టమెటిక్‌గా వుంటుంది ట్రాఫిక్. బిజీరోడ్ల మీద, షాపింగ్ సెంటర్స్, ఆఫీసులుండేచోట తప్ప మిగతా ఏరియాల్లో యిళ్ళు వుండేచోట, రోడ్ల కిరుపక్కలా కార్లు బారులు తీరి నిలిపి వుంటాయి. సిటీల్లో ఫ్లాట్స్‌లో వుండేవారికి రోడ్లే పార్కింగ్ ప్లేసులు అలా రోడ్లమీద కార్లు పార్క్ చేసినా పోతాయన్న బాధలేదు అక్కడ. ఆ దేశంలో ఎటు చూసినా కార్లే కనిపిస్తాయి. మనుష్యులకంటె కార్లెక్కువ అక్కడ అని పిస్తుంది. చూస్తే కార్ల ఖరీదు 5, 6 వేల డాలర్ల దగ్గిరనుంచి మొదలయి మంచి ఖరీదయిన కార్లు 25, 30 వేల డాలవర్లవరకు వుంటాయి.

మనదేశంలో 5, 6 వేల రూపాయలకి కారురాదు కదా స్కూటరు, మోపెడ్ కూడా రావడం లేదు. సెకండ్‌హాండ్ కార్లు అయితే 1,500, 2,000 డాలర్లకి కూడా దొరుకుతాయి. సాధారణంగా స్టూడెంట్స్, మరీ లేనివారు అయితే సెకండ్‌హాండ్ కార్లు వాడుతారు. ఏ కాస్తపాడయినా రిపేరు చార్జీలు ఎక్కువ అక్కడ అని కొత్త కారే కొంటారు అక్కడ అందరూ—అకారణంగా కాస్తపాడయిన కార్లు అన్నీ డంపింగ్ ఏర్డ్సులో వదేసి మిషనుతో నొక్కించేస్తారు. అదంతా మెటల్ బై వెయిట్ కింద అమ్మేస్తారు. అలా డంప్‌చేసిన కార్లు వేలకొద్దీ కనిపించాయి చాలాచోట్ల. ఆ కార్లు చూస్తుంటే నిజంగా ఎవరైనా ఇండియా తీసుకొచ్చి 20, 25 వేల కైనా అమ్ముకోవచ్చు నిక్షేపంగా అన్నట్టు అంతబాగున్నాయి—అయ్యో! పోనీ స్పేర్ పార్టులయినా టైర్లు, సీట్లలాంటివైనా తీయకుండా అలా పారే శారే అని విచారిస్తాం యిండియా నుంచి వెళ్లిన వాళ్ళం.

కార్లేకాదు, ఆ దేశాలలో ఏ వస్తువుకీ రిపేర్లు వుండవు. సూట్ కేసులు, బ్యాగులు, ఫర్నిచర్, ఫ్రిజ్‌లు, ఒకటేమిటి అన్నీ బాగా రిపేరు వచ్చిన వన్నీ విసిరిపారేస్తారు. ఆ దేశాలలో మాన్‌పవర్‌కి ఎక్కువ ఖరీదు

అని చెప్పాను కదా. లేబర్ కి డబ్బిచ్చి షాపులు పెట్టుకుని ఏ వస్తువైనా రిపేరు చెయ్యాలంటే చాలా చార్జి చేస్తారు కనుక ఎవరూ రిపేరు చేయించరు. ఆ డబ్బుతో కొత్త వస్తువులు వస్తాయని—మరీ బాగున్నవి, పారేయడం ఇష్టం లేనివి అయితే చేయిస్తారు. సాధారణంగా కార్పెంటరీ పనులు, ప్లంబింగ్ పనులు, యింటికి పెయింటులు వేసుకోవడం దగ్గిర నుంచి ఎవరికి వారే చేయించుకుంటారు. ప్రతివారి దగ్గర వడ్రంగి పనిముట్లు, ఎలక్ట్రిక్ రిపేరు సామానులు, కొళాయిలు అవి రిపేరు చేసుకొవడానికి అన్నింటికి పనిముట్లు వుంచుకుని మగవారే చేసుకుంటారు. మరీ పెద్దపని వారికి చాతకానిదయితే తప్పని ఖర్చు అయితే వర్కర్స్‌ని పిలుస్తారు. వాళ్ళు రిపేరు చేయించలేని వస్తువులను రోడ్లమీద చెత్తడబ్బాల దగ్గర గార్‌బేజ్ వ్యాన్ వచ్చే రోజున పెట్టేస్తే వేన్ వచ్చినపుడు తీసికెళ్ళిపోతారు. అలా వదిలేసిన వాటిలో పెట్టెలు, బ్యాగులు, ఫర్నిచర్, పాడయిన కుషన్స్, డన్‌లప్‌లు, కొత్త విరిగిన కప్పులుసాసర్లు లాంటివి అన్ని రకాలు వుంటాయి. అవన్నీ చెత్తతీసే వ్యానులోపడేసి తీసుకుపోయి క్రష్ చేసేస్తారు. ఇంక పాల వ్యానులు, కోక్‌సీసాలు, అనేక ప్లాస్టిక్ కంటైనర్స్, ఆఖరికి రోజూ వచ్చే న్యూస్ పేపర్లు నుంచి చెత్తలో పారేయడమే అక్కడ పాలు రెండు లీటర్లవి, నాలుగు లీటర్లవి మన ప్లాస్టిక్ పెట్రోలు క్యాన్‌లాంటి వాటిల్లో, కూల్‌డ్రింకులు, పెద్ద పెద్ద ప్లాస్టిక్ సీసాల్లో దొరుకుతాయి. అవన్నీ అక్కడ అందరూ విసిరిపారేస్తుంటే అలాంటివి మనం యిక్కడ 10, 15 యిచ్చి కొనుక్కొని వాడుకుంటాం. అయ్యో వేస్టు అనిపిస్తుంది. ఇండియా నుంచి వెళ్ళిన మనవారు మొదట్లో ఏదీ పారేయడానికి మనసురాక దాస్తారు. కానీ రోజూ వచ్చే ప్లాస్టిక్ కంటైనర్స్ అవి ఎన్నాళ్ళని దాస్తారు. పాత పేపర్లు అక్కడ ఎవరూ కొనరు కనుక పారేయాలి. పాత పేపర్లు కొని మన దేశంలో వందలాది నుంచి బిజినెస్ చేస్తారు. అక్కడ అంత నిర్లక్ష్యంగా పారేస్తే మనలాంటి వారికి ఉసూరుమనిపిస్తుంది. అక్కడ యిళ్ళల్లో చెత్త ఎక్కడపడితే అక్కడ పారేసే వీలులేదు. పెద్ద పెద్ద ప్లాస్టిక్ సంచులలో కట్టి గార్‌బేజ్ వేన్ వచ్చే రోజు

బయట రోడ్డుమీద పెట్టాలి. సిటీల్లో వారానికి రెండు మూడు రోజులు. విలేజిల్లో అయితే శుక్రవారం శుక్రవారం తీస్తారు. ఆ సంచులు అలా రోడ్డుమీద పెడితే మన దేశంలో చెత్తడబ్బాలు వెతుక్కునేవారు, ఆ సంచులు కింద గుమ్మరించి సంచులు పట్టుకుపోతారు అనిపించింది. యూరప్‌లో ఎక్కడా ముష్టివాడన్నది మాకు కనపడలేదు. న్యూయార్క్‌లో మాత్రం చెత్తడబ్బాలు వెతుక్కుని ఏరుకునే కొందరు బీదవాళ్ళు కనిపించారు. న్యూయార్క్‌లో నీగ్రోలలో కొందరు బీదవారు (అడుక్కోలేదు) గార్‌బేజ్ వేస్ట్స్ వెతుక్కునే వారు కన్పించారు. యింకెక్కడా నాకు కనపడలేదు.

కొందరు కొంతపాతసామాను తమ యిళ్ళ ముందు బయట పెట్టి అమ్మకం చేస్తారు అలాంటి సీన్లు అక్కడక్కడ కన్పించాయి. కావల్సిన వారు సెకండ్‌హాండ్ సామాను చవగ్గా కొనుక్కుంటారు. కొందరు పిల్లలయితే కాస్త పెద్దవాళ్ళయ్యాక తమ ఆటసామాను బొమ్మలు, పుస్తకాలు బయటపెట్టి అమ్మడం చూశాను. అది వాళ్ళకి పాకెట్‌మనీకోసం తమ వస్తువులు అమ్ముకుని డబ్బుచేసుకొంటారన్నమాట—అది తప్పు పని కాదు—దొంగతనం తప్ప అక్కడ ఏ పని ఆత్మనూన్యత అనుకోరు.

యూరప్‌లో, అమెరికాలో అన్నిచోట్ల యిళ్ళు కర్రతో కడ్తారు. యూరప్‌లో కనీసం రూఫ్‌కి పెంకులు, పైపక్క గోడలకి యిటుకలు వాడినవి కన్పించాయి కానీ అమెరికాలో మొత్తం యిళ్ళు అంతా కలపతోనే కట్టేస్తారు. సైజువారీగా కోసిన బల్ల చెక్కలు బిగించేసి వారం రోజుల్లో యిల్లుపూర్తి అయిపోయింది. అసలు ఆలశ్యం అంతా లోపల వుడ్‌వర్క్ ప్లంబింగ్, ఎలక్ట్రిక్ ఫిట్టింగ్స్ వగైరాలకి అవుతుంది తప్ప, యిల్లు స్కెలిటన్ వారం రోజులలో పూర్తి అయిపోతుంది. యిటుకలు, సున్నాలు, సిమెంట్లు అది మోసే కూలీలు యీ గొడవలు ఏం లేవు కనక అక్కడ లేబర్ ఖర్చు కూడా వుండదు. వాళ్లు పెట్టే ఖర్చు అంతా యింటీరియర్ డెకరేషన్‌కోసం అవుతుంది. బాత్‌రూముల్లో చాలా మంచి సానిటరీ ఫిటింగ్స్, తళతళలాడే గాజు అద్దాల కిటికీలు, మంచి షోకేసులు, వార్డ్

రోబ్‌లు యిళ్ళు లోపల చాలా బాగుంటాయి. కాని మన యిళ్ళంత గట్టిగా వుండవు. సిమెంటు గోడలు కావు కనక సౌండ్‌ప్రూఫ్ కావు. బిల్ల చెక్కల మధ్య యిన్సులేషన్ పెట్టి గోడలకింద కడ్తారు కనక హీట్ రెసిస్టెంట్ వుంటుంది. చలికాలం వేడిగా వుంటుంది. అక్కడ ప్రతి యింటికి కింద బేస్‌మెంటు తప్పక వుంటుంది. విడియిళ్ళకి బేస్‌మెంటులో కూడా చాలామంది పిల్లలకి స్టడీ రూములు. స్టోరు రూములు అక్కరలేని సామాను పడేసుకోడానికి వాడుతారు. ప్రతి యింటికి హీటింగ్ ఎరేంజు మెంటు, వేడినీళ్ళు యిరవైనాల్గు గంటలు రావాలి కనక పెద్ద పెద్ద బాయి లర్స్ అన్నీ వుంటాయి. బేస్‌మెంట్‌లో యిల్లు కట్టినప్పుడే ప్రతి యింటికి కుకింగ్‌రేంజ్, ఫ్రిజ్, వాల్‌టువాల్‌కార్పెట్లు అన్నీ కలిపే వేస్తారుబిల్లు.

అక్కడ ఇళ్ళు టౌన్ ప్లానింగ్ కాంట్రాక్టర్స్ లాంటివాళ్ళు కట్టి స్తారు. వాళ్ళే ప్లాన్సు, యిళ్లకట్టడం అన్నీ చేస్తారు. యిళ్ల కడుతున్న ప్పుడు మనకి కావలిసిన చిన్న చిన్న మార్పులు ముందుగా చెబితే చేస్తారు. వాళ్ళు ఇచ్చే ఫిట్టింగులు కాక మనకి వేరేరకం కావలిస్తేముందుగా చెప్పాలి. అవన్నిటికీ వేరే ధర చెల్లించాలి. మనంతట మనం కట్టు కోవడం కుదరదు. ఆ కాంట్రాక్టర్లు కట్టిన యిళ్ళు మనం కొనుక్కోవాలి. మెటీరియల్, ప్లాన్ అన్నీ వాళ్లే చూసుకుంటారుకనక మనకి బాధవుండదు. ప్రతియింటికి ఎలక్ట్రిక్ హీటింగ్ సిస్టమ్ తప్పక వుంటుంది. పెన్టరిన్‌సైడ్ అంటే లాస్‌ఏంజిల్స్, శాన్‌ఫ్రాన్సిస్కోలాంటి వూర్లలో వేడిగా వుంటుంది కనుక అక్కడ యిళ్ళకి, కావల్సిన వారికి సెంట్రల్లీ ఎయిర్‌కండిషన్స్ వుంటాయి—సిటీల్లో పెద్ద పెద్ద భవనాల్లో ఫ్లాట్స్ అయితే చాలా పటి ష్ఠంగా రాతితో కడతారు. పెద్ద పెద్ద ఫ్లాట్స్‌లో అన్ని ఫ్లాట్స్‌కి కలిపి కింద బేస్‌మెంట్‌లో పెద్ద వాషింగ్‌రూము వుంటుంది. అక్కడ 10, 15 వాషింగ్ మెషిన్సు, డ్రైయింగ్ మెషిన్సు వుంటాయి. ఫ్లాట్స్‌లో వుండేవారు వారా నికి ఒకసారో రెండు సార్లో బట్టలు తీసుకొని లాండ్రిరూముకి వెళ్ళి మిష నులో డబ్బులువేసి, సోపుపౌడరు వేసి బట్టలు ఉతుక్కొని, ఉతికినవి మళ్ళీ డ్రైయ్యరులో వేసి తెచ్చుకుంటారు. ఫ్లాట్స్‌లో వుండేవారికి అసలు

బట్టలు ఆరవేసుకోడానికి చోటు వుండదు కనక వుతికినవి వెంటనే డ్రైయ్యర్‌లో వేస్తే 15 నిమిషాల్లో ఎండిపోయి బయటికి వస్తాయి. పెద్ద పెద్ద కాంప్లెక్స్‌లకి వాటర్ హీటింగ్ సిస్టమ్, నీళ్ళు అన్నీ కింద బేస్‌మెంట్‌లో వుంటాయి. వాళ్ళకి కార్ల పార్కింగ్ కూడా కింద బేస్‌మెంట్‌లో వుంటాయి. న్యూయార్క్‌లో బేస్‌మెంట్‌లో కారు పార్కింగ్‌కి నెలకి 150 డాలర్లు యివ్వాలి. పెద్ద కాంప్లెక్స్‌లో వుండేవారి యింటికి గెస్ట్స్ వస్తే లోపలికి వచ్చేముందు ఒక ఫోను వుంది. ఆ ఫోను మనం తీసి మనం ఎవరమో ఎవరింటికి వచ్చామో చెప్పాలి. అక్కడ టి. వి. నర్క్యూట్‌లో వాళ్ళకి మనం కనిపిస్తాం. అప్పుడు ఆ బిల్డింగ్ సెక్యూరిటీవాళ్ళు మనం వెళ్ళదలిచిన వారికి ఫోన్ చేసి ఫలానవారు వచ్చారు అంటే వాళ్ళు వదలమని చెప్పాక అప్పుడు అక్కడినుంచి బటన్ నొక్కి తలుపులు తీస్తారు. అపార్ట్‌మెంట్స్‌లో అంత టైట్‌గా వుంటుంది సెక్యూరిటీ. ఎంత చిన్న అపార్ట్ అయినా సరే కుకింగ్ రేంజ్, ఫ్రిజ్, కార్పెట్లు అన్నీ యింటితో పాటే వుంటాయి. సిటీల్లో అయితే పెద్ద పెద్ద హీటింగ్ స్టేషన్సు వుంటాయి. అక్కడ నుంచి నీళ్ళ పైపుల్లాంటి వాటి ద్వారా శీతాకాలం హీట్ అన్ని యిళ్ళకి సరఫరా చేస్తుంది. గ్యాస్ కూడా గొట్టాలలోనే వస్తుంది. అన్నింటికీ మీటర్లు వుంటాయి. చిన్న చిన్న పూర్లలో, విడి విడి యిళ్ళలో అయితే ఎవరింట్లో వారికి బేస్‌మెంట్‌లో హీటర్స్ వుంటాయి.

అమెరికాలో న్యూయర్క్, వాషింగ్టన్, బోస్టన్, క్లీవ్‌లాండ్ వగైరా యీస్ట్‌కోస్ట్ అంతా చాలా చలిగా వుంటుంది. శీతాకాలం మంచు బాగా పడుతుంది. ఒకోసారి 4,5 అడుగుల స్నో పడి రోడ్లు అన్నీ కప్పి విడిపోతాయి. శీతాకాలం వస్తే మాకు నరకమే అంటుంది మా శారద. యిళ్ళల్లో, ఆఫీసుల్లో కార్లలో అన్ని చోట్ల హీటింగ్ సిస్టమ్ వుంటుంది కనక చలి బాధించదు. ఎక్కడికన్నా వెళ్ళాలంటే, ఏ పాలో ఐదునిమిషాల్లో వెళ్ళి తెచ్చుకోవాలన్నా ఫుల్ డ్రెస్, స్వెట్టర్లు, కోటు, ఓవర్‌కోట్, మఫ్లర్స్, ఉలెన్ సాక్స్, బూట్స్ అన్నీ వేసుకోందే గుమ్మం కదలడం అవదు. మళ్ళీఆఫీసుకో,ఇంటికోచేరాక ఆ కోట్లుఅవితీసేయాలి. బైటికివెళితే

మళ్ళీ తొడుక్కోవాలి. స్నో పడుతుంటే కారు డ్రైవ్‌చేయడం చాలా బాధ, ప్రమాదకరం. టైర్లు స్లిప్ అయిపోతుంటాయి. చక్రాలు స్నోలో దిగబడి నర్రున తిరుగుతాయి తప్ప కారు కదలదు. ఒక్కొక్కసారి గంటలకొద్దీ ట్రాఫిక్ ఆగిపోతుంది. హైవే పెట్రోలు పార్టీ ఎప్పటికప్పుడు స్నో తవ్వి రోడ్లు క్లియర్ చేస్తూనే వుంటారు. అయినా అప్పుడప్పుడు కార్లు కదలక ఆగిపోయి ట్రాఫిక్ జామ్ అయిపోతుంది.

మామూలు సమయాల్లో ఆఫీసునించి అరగంటలో వెళ్ళేవాళ్ళు స్నో పడుతూంటే 2, 3 గంటలు కూడా పడ్తుందిట-ఆడవాళ్ళు ఒక్కరూ కారు డ్రైవ్ చేసుకుంటూ వెడ్తుంటే చాలా యిబ్బంది పడతారుట - రోడ్ల మీద అయితే హైవే బాగుచేసేవారు స్నో తొలగిస్తారు కాని, యింటి ముందు అయితే గ్యారేజినించి రోడ్డువరకు ఎవరింటిముందు వాళ్ళే స్నో తవ్వుకోవాలి - ఆ ఎముకలు కొరికే చలిలో పలుగు, పారలు పట్టుకుని భార్యాభర్తలు స్నో తవ్వుకోవాలి అంటే ఏడుపు వస్తుంది. చల్లగాలికి ఏ మాత్రం డ్రస్సు సరిగా వేసుకోకుండా అశ్రద్ధ చేస్తే అవయవాలు కొయ్యబారిపోతాయి. చలిగాలికి చెవులు నొప్పెడతాయి. పొద్దునే 7 గంటలు అయినా వెలుతురు రాదు. ఆ చీకటిలో స్నోలో పిల్లలు స్కూళ్ళకి ఆడ, మగ అందరూ తయారయి ఆఫీసుకి వెళ్ళడం నిజంగా నరకమే. ఆ యిచ్చే శలవులు సమ్మర్‌లో జూలై నించి సెప్టెంబరు 15 వరకు స్కూళ్ళకి, ఆఫీసులకి యిచ్చే బదులు చలికాలం యివ్వొచ్చుగదా అని అంటే చలికాలం స్నో కురుస్తూంటే శలవులు ఎలా గడుపుతారు. ఎక్కడికి వెడతారు యింట్లో కూచోవలసిందేగదా. అందుకే చలికాలం పనిచేసి సమ్మర్ రాగానే ఎంజాయ్ చేస్తారు అంది శారద. అక్కడ నవంబరునించి చలికాలం ఆరంభించి డిసెంబరు, జనవరి, ఫిబ్రవరి, మార్చివరకు విపరీతమైన చలి. జనవరి, ఫిబ్రవరిలో స్నో పడ్తుందిట. ఏప్రిల్‌నుంచి జూన్‌వరకు అక్కడ వర్షాలు పడ్తాయి. స్నో, వర్షం అంతా కలిసి మరింత చలి. జూలై

నుంచి సెప్టెంబరువరకు ఎండ వస్తుంది వాళ్ళకి - ఏడాదికి ఎనిమిది నెలలు పైగా చలి. సూర్యరశ్మికోసం మొహం వాచివున్న వాళ్ళకి సమ్మర్ రాగానే పిల్లా పెద్దా అంతా హాలిడేకి వెళ్ళిపోతారు. కొంచె ఎండ రాగానే బట్టలు విప్పుకుని స్విమ్మింగ్‌కి సముద్రతీరాలకి వెళ్లిపోతారు. వాళ్ల ఎండాకాలం మన చలికాలంలా కొంచెం ప్లెజంట్‌గా కూల్‌గా వుంటుంది. అదే వారికి పెద్ద ఎండకింద లెక్క- యూరప్‌లోకంటె అమెరికాలో కొన్ని ప్రాంతాల ఎండలు ఎక్కువే. జూలై మొదలు రోడ్లమీద కారవాన్స్ ఎక్కువ కనిపిస్తాయి.

ఫామిలితో వెళ్లేవారికి కారవాన్‌లో వెడితే చాలా చవక పడ్తుంది. కారవాన్ అంటే ముందు డ్రైవింగ్‌కి రెండు సీట్ల వెనకాల మన పెద్ద వ్యాన్‌లావుండి ఒక గది వుంటుంది. అద్దాల కిటికీలు వుంటాయి. ఆ గదిలో నలుగురు పడుకోడానికి రైల్లో కంపార్టుమెంటులో బెర్తులా యిటూ అటూ రెండు నాలుగు సోఫాలు చిన్న కుకింగ్ రేంజ్, మినిఫ్రిజ్....చిన్న టాయిలెట్ వుంటుంది. ఆ కారవాన్‌లో భార్యా భర్త యిద్దరు ముగ్గురు పిల్లలున్న కుటుంబం అయితే హోటలు ఖర్చు లేకుండా రోజంతా ప్రయాణంచేస్తూ, తోవలో చూడాల్సినవి చూసుకుంటూ రాత్రిపూట ఏదో వూరి దగ్గర హాల్టుచేసి ఆ కారవాన్‌లోనే అందరూ పడుకోవచ్చు. కుకింగ్ రేంజ్ వుంటుంది కనక కాఫీ, టీలు బ్రెక్‌ఫాస్ట్ లంచ్ అన్నీ అక్కడే తయారుచేసుకుని తింటారు. వాళ్ల బ్రెక్‌ఫాస్ట్ ఎగ్‌లు. బ్రెడ్‌లతో అయిపోతుంది. లంచ్ కావలిస్తే వాళ్ళకి తోవ పొడుగునా రెస్టారెంట్సు వుంటాయి. ఎక్కడ కావలిస్తే అక్కడ తినచ్చు—లేదంటే వండుకోవచ్చు. ఆ కారవాన్ పైన చిన్న బోట్, సైకిళ్ళులాంటివి కూడా తగిలించుకుని మైళ్ళకి మైళ్ళు వెళ్లిపోతుంటారు. బోట్ రైడింగ్‌కీ, సాయంత్రాలు పిల్లలు పెద్దలు సరదాగా సైకిలింగ్ వెళ్లడానికి అలా అవి కూడా తీసికెడతారు. ఆ కారవాన్ లోపల చక్కగా చిన్న కంపార్టుమెంటులా ముచ్చటగా వుంటుంది. ఆడ, మగ అందరికీ డ్రైవింగు వచ్చును కనక కొంతసేపు భార్య, కొంతసేపు భర్త డ్రైవ్ చేస్తారు.

ఇలా కారవాన్స్‌లో వచ్చే వాళ్లందరికీ వూరి చివర ఓ పార్కింగ్ ప్లేస్ ఎలాట్ చేస్తారు ప్రతీ చోట. అందరూ పార్కింగ్ చేసుకుంటారు. అలా పార్కు చేసిన చోట కారవాన్స్‌కి వాటర్, డ్రైనేజ్ కనక్షన్సు యిస్తారు. కారవాన్‌లోపల నీటి సదుపాయం—బాత్ రూములు ఉపయోగించినపుడు, లెవెట్రీకి సూయిజ్‌లోకి యిస్తారు. ఆ దేశంలో ప్రతీదీ అంత ప్లాన్డ్‌గా ఆలోచించి చేస్తారు కారవాన్స్ డబ్బున్నవాళ్లు స్వంతానికి కొనుక్కుంటారు. లేనివాళ్లు రోజుకింత అని అద్దెకు తీసుకుంటారు—కొనడానికి ఏభై వేల డాలర్లపైన వుంటుంది. అద్దెవయితే రోజుకి 100, 150 డాలర్ల వరకు వుంటుంది. ఫ్యామిలీ వెళ్లినపుడు ప్లేను చార్జీలు, హైలు చార్జీలు అన్నీ కలిసివస్తాయి కనక చాలామంది సరదాగాకూడా వుంటుందని కారవాన్‌లో వెడుతుంటారు.

యూరప్‌లో, అమెరికాలో కార్లు కాకుండా సైకిళ్లు కనిపిస్తాయి. చాలా స్కూటర్లు ఎక్కడా వుండవు. అక్కడ అక్కడ టీనేజ్ బాయిస్ మోటారు సైకిళ్లమీద కనిపిస్తారు. సైకిళ్లు చిన్న పెద్ద ఆడ మగ ముసలి వాళ్లూ అందరూ తొక్కుతూ కనిపిస్తారు. మనకి సైకిలు అంటే బీదవాడి వాహనం. అక్కడ సైకిలుమీద వెడితే ఎక్సర్‌సైజు అవుతుందని చాలా మంది మార్కెటింగ్‌కి, ఊరి బయట షికార్లకి తిరగడానికి వాడతారు—ముసలివాళ్ళు కూడా చకచక తొక్కుతుంటారు. అక్కడ సైకిల్సు చాలా లైట్‌గా వుంటాయి. అంచేత తొక్కడం సుళువు, సైకిల్ టూర్స్ అని సమ్మర్‌లో చాలామంది వెళ్తుంటారు.

వీటన్నింటికంటే కూడా ఆ దేశాలలో నన్ను అతిగా ఆకట్టుకున్న విషయం ఆ దేశంలో యిన్‌వేలిడ్స్‌కి. వికలాంగులకి వారిచ్చే ప్రత్యేక ట్రీట్‌మెంటు. వికలాంగులందరికీ సర్వ సాధారణంగా వీల్‌చెయిర్ వుంటుంది. వీల్‌చెయిర్‌లో ప్రయాణించే వారందరి కోసం ప్రతిచోట ప్రత్యేక సదుపాయాలుంటాయి. ఆఖరికి రోడ్డుమీద పార్కింగ్‌ప్లేసులలో కూడా ఇన్‌వేలిడ్స్‌కి, (అంటే రోగంతో ముసలితనంతో నడవలేని వారికి)

కాళ్లు చేతులులేని వారికి ప్రత్యేకమైన పార్కింగ్ ప్లేసులుంటాయి. అలా రాసినచోట మిగతావారెవరూ కార్లు పెట్టకూడదు. అన్ని టూరిస్ట్ ప్లేసులలో వికలాంగులకి ప్రత్యేకమైన ద్వారం, క్యూలు లేకుండా తిన్నగా లోపలికెళ్లేందుకు వీలు వుంటుంది—వీల్ ఛెయిర్ నడవడానికి వీలుగా స్లోపుగా కట్టిన వాక్ వేలుంటాయి. మెట్లు లేకుండా ప్రతిచోట మ్యూజియంలుగాని, ఆర్ట్ గేలరీలు కానీండి, డిస్నీలాండ్, సీవరల్డ్‌లాంటి వినోద యాత్ర స్థలాలలోగానీండీ, చర్చిలు, ఎగ్జిబిషన్స్, సినిమా హాళ్ళు, నాటకశాలల్లు, ప్రతిచోట వారికి ప్రత్యేక సదుపాయాలుంటాయి. కొన్ని కొన్ని చోట్ల టూరిస్ట్ ప్లేసులలో వీల్ చెయిర్‌తో వచ్చిన వారిని బస్సులో ఎక్కించడానికి స్లోపుగావున్న బల్ల చెక్కలు చకచక అమర్చి, బస్సులో ఓ పక్క పూర్తిగా తలుపు తెరుచుకునేటట్లు చేసి వీల్ చెయిర్‌తోసహా మనిషిని బస్సులో ఎక్కిస్తారు. మామూలు వాళ్లకి ఎంత క్యూలున్నా వీల్ చెయిర్ వాళ్లని తిన్నగా లోపలికి పంపిస్తారు. ప్రతిచోట వాళ్ల గురించి అంత శ్రద్ధ తీసుకుని కుంటి వెధవలు యింట్లో పడుండక ఇలా అన్నింటికి తయారవడం ఏమిటి అని అనుకోకుండా వారిని ప్రత్యేక శ్రద్ధతో వాళ్లూ మనుష్యులే వాళ్లకీ కోరికలుంటాయని అవి తీర్చడానికి శాయశక్తులా తంటాలుపడే వారినిచూస్తే అభినందించకుండా వుండలేం. పీడిత మానవాళి పట్ల అంత సానుభూతి చూపే వారి హృదయ వైశాల్యానికీ జోహార్లు అర్పించాలి అనిపిస్తుంది.

వికలాంగులకీ, గుడ్డివారికి, చెవుడు, మూగ వారిని గురించి అతి శ్రద్ధగా వారు మిగతా మామూలు మనుష్యులకంటె దేనిలో తీసిపోని వారన్నట్టు అన్ని రకాల సదుపాయాలు యిస్తుంది ప్రభుత్వం. అలాంటి వారిని గ్రూపులుగా వెంటపెట్టుకుని టీచర్లు అతి శాంత సహనాలతో ఆ పిల్లలకి అన్నీ ఓపిగ్గా వివరించి, చూడలేనివారికి స్పర్శతో, వినలేనివారికి సౌంజ్ఞలతో రకరకాలుగా వివరిస్తారు. ఆ దేశాలలో అలాంటి వారిపట్ల ప్రతి వారికి సానుభూతి, శ్రద్ధాసక్తులు కనపరచడం ముదావహం—న్యూయార్క్‌లో ఒక ఆర్ట్ గేలరీలో ఒక వీల్ చెయిర్‌లో ఒక మనిషిని

చూశాం. కాళ్ళు చేతులు అష్టవంకరలు తిరిగివున్నాయి. తల అదోలా వుంది. మొహంలో ఏ అవయవమూ సరిగ్గాలేదు. వీపున యింత మోపులా కందిపోయివుంది. ఆ మనిషికి ఆక్సిజన్ సిలెండర్ (చిన్నది) పెట్టి ముక్కుకి ఆక్సిజన్ మాస్క్ తొడిగి వీలు చెయిర్‌లో ఓ నర్సు తిప్పుతూ పెయింటింగ్సు అవీ చూపిస్తోంది. ఆ మొహంలో కళ్ళు మాత్రం వాటిని చూస్తున్నాయి. ఆక్సిజన్ పెట్టాల్సిన స్థితిలోవున్న ఆ పేషంట్‌ని ఆర్ట్ గేలరీకి తీసుకొచ్చి తిప్పడం నిజంగా వింత విషయం అన్పించింది. ఆ ప్రపంచ ఖ్యాతిగాంచిన పెయింటింగ్సు చూడాలని అతని కోరిక. ఆ కోరిక తీర్చడం వారి కర్తవ్యంగా భావించి అలాంటి స్థితిలో అతన్ని అన్ని ఏర్పాట్లుచేసి తీసుకురావడం నిజంగా వారి మానవతా వాదానికి ఉదాహరణగా చెప్పవచ్చు.

ఆ దేశాలలో గవర్నమెంట్ ఓల్డ్‌ఏజ్ హోమ్సు నడుపుతారు ముసలివారికోసం. ఆ దేశాలలో బాగా డబ్బున్న వారయితే ఫరవాలేదు గాని సామాన్యులు అయితే పండు ముసలివారయ్యాక చూసే దిక్కులేని వారంతా ఆ హోములలో చేరతారు మన దేశంలో మాదిరి తిట్టుకుంటూనో విసుక్కుంటునో కన్నవాళ్ళని చూడడం తన కర్తవ్యం అని ఏ కొడుకులు అనుకోరు. ఎవరి దారి వారిదే అక్కడ. కొన్నిచోట్ల ప్రభుత్వమే ఓల్డు ఏజ్ పెన్షన్ ఏర్పాటు చేస్తుంది. వారి భుక్తికి ఆస్ట్రియా దేశంలో ముసలి వారికి నెలకి నాలుగు వేల షిల్లింగులు ఇస్తుంది ప్రభుత్వం.

అన్నట్టు అమెరికా యాత్రకి బయలుదేరే ముందు ఇంకో చిన్న విషయం. అమెరికాలో క్రెడిట్ సిస్టము గురించి చెప్పందే అమెరికా గురించి చెప్పడం పూర్తి కానట్టే. అమెరికాలో క్రెడిట్ సిస్టమ్ చాలా తమాషాగా అన్పిస్తుంది. క్రెడిట్ అంటే అప్పు. అమెరికాలో ప్రతివారు క్రెడిట్ మీదే బతుకుతారు అన్పిస్తుంది. ఇల్లు కట్టుకోవడం మొదలు ఫర్నిచరు, కార్లు ప్రతిది క్రెడిట్ మీదే కొంటారు. అమెరికాలో క్రెడిట్ దొరకడం చాలా సులువు. ముందుగా ఒక కంపెనీ మీ ఉద్యోగం చూసి అప్పు ఇస్తుంది. ఆ కంపెనీ ఇచ్చిందని తెలిసి మరో కంపెనీ ముందుకు వస్తుంది. ఇలా ఆ దేశంలో ఎన్ని క్రెడిట్ కార్డులు వుంటే అంత

గొప్ప పరపతి అన్నమాట. ఎక్కువ క్రెడిట్ కార్డులు వున్నవారికి 'గోల్డెన్ కార్డు' అని ఇస్తారు. ఆ విధంగా ఫలానావాడు అని ఒకరిద్వారా ఒకరికి తెలిసి మా కంపెనీ 14% వడ్డీకే ఇస్తాం, అంటే మేం 13%కే ఇస్తాం అని పోటీపడి అప్పులు ఇస్తారు. అక్కడ అంచేత ప్రతిది క్రెడిట్‌మీద అమర్చుకుని జీతంలోంచి అప్పులు తీరుస్తుంటారు. అలా తీసుకున్నవారు ఎవరూ పారిపోరు అన్న నమ్మకం వారికుంటుంది. ఆ నిజాయితీ ఆ మనుష్యులలో వుంది కనుక వారు అప్పులు ఇవ్వడానికి ముందుకు వస్తారు. అప్పటికీ వారి గురించి వివరాలు సేకరిస్తూనే వుంటారు.

అమెరికాలో అంత అందమైన వారెవరూ కనబడలేదు నాకు అమెరికన్స్ అంటే అన్ని రకాల యూరోప్ జాతుల మిశ్రమం. ఫ్రెంచ్ జర్మన్, ఇంగ్లీష్, డచ్ యిలా అన్ని జాతులవారు అమెరికా వలసవెళ్ళి, అమెరికన్స్ అయ్యారు. ఫ్రాన్స్. ఇటలీ, స్విట్జర్లాండ్, యింగ్లండులో కనిపించినట్టు చక్కనివారు ఎవరూ కనిపించలేదు. బ్రిటీష్ వారితో పోల్చి చూస్తే అమెరికన్స్ కేర్ ఫ్రీ లైఫ్. అన్పిస్తుంది. టీనేజ్ బాయిస్, గరల్స్‌కి అక్కడ ఏ కట్టుబాట్లు లేవు. విచ్చలవిడిగా తిరుగుతారు. 14, 15 ఏళ్ళు వచ్చిన దగ్గరనుండి బాయ్ ఫ్రెండు, గరల్ ఫ్రెండు లేకపోతే అది వారికి అసహజం అన్పిస్తుంది. అక్కడ సెక్స్ అన్నది ఒక అనుభవం తప్ప ఏవో తప్పు చేసేం అన్న భావన సాధారణంగా వుండదు. అంటే అమెరికాలో అందరూ పెళ్ళి కాకముందే పాడైపోతున్నారు. అని చెప్పటం కాదు నా ఉద్దేశం. అక్కడ జీవన విధానం ఆ విధంగా వుంటుంది.

అమెరికాలో ఉన్న మన భారతీయులు ముఖ్యంగా ఎదుర్కొనే సమస్య టీనేజ్ పిల్లలదే. ఎన్ని లక్షలమంది భారతీయులో అమెరికాలో ఉద్యోగాలలో స్థిరపడి, అక్కడ సెటిల్ అయిపోయారు. అక్కడ సంపాదన, అక్కడి వసతి సౌకర్యాలు అన్నీ బాగానే వుంటాయి వారికి కానీ, పిల్లలు, ముఖ్యంగా ఆడపిల్లలు 14, 15 ఏళ్ళు వచ్చింది

మొదలు మనవాళ్ళు చాలా గాబరా పడిపోతారు. అక్కడ స్కూళ్ళలో, కాలేజీల్లో మిగతా పిల్లల ప్రభావం చాలా వుంటుంది వీళ్ళు వాళ్ళలాగే ప్రవర్తిస్తారేమో! పెళ్ళికాకముందు సెక్స్ సంబంధాలు పెట్టుకుంటారేమో! అని ఎంతో భయపడిపోతూ వుంటారు. అమెరికాలో వున్నా ఇండియాలో మాదిరిగానే పిల్లలను కట్టుదిట్టాలలో పెట్టి కట్టడి చేస్తారు. కాస్త బుద్ధి మంతులు, మెతక పిల్లలు అయితే మాట వింటారు. అదే పెడసరం పిల్లలయితే 'ఏం అమెరికాలో వుండచ్చు, ఏం అమెరికా డబ్బు పనికి వస్తుంది. కానీ అమెరికా మనుష్యులు పనికి రారు. వారితో తిరిగితే తప్పేమిటి' అని వాదిస్తారు. అమెరికాలో వున్నా అమెరికన్స్‌లా పిల్లలను వాళ్ళ ఖర్మానికి వదలలేక అవస్తపడుతూ బాధపడతారు ఆ తల్లి దండ్రులు. అక్కడ వున్న ఇండియన్ అక్కడ వుండే ఇండియన్ అమ్మాయినో, అబ్బాయినో చేసుకోపడంకంటే, ఇండియా వచ్చి చేసుకుని వెళ్ళడమే ప్రిఫర్ చేస్తున్నారు.

అమెరికాలో సెటిల్ అయిన మన భారతీయులు లక్షలమంది వున్నారు. వారందరూ ముందు చదువుల కోసమో, ఉన్నత విద్యాభ్యాసానికో, ఉద్యోగానికో వెళ్ళి రెండు మూడు ఏళ్ళు ఉండి వచ్చేద్దామని అనుకున్నవారే కాని అక్కడికి వెళ్ళాక అక్కడ లైఫ్ స్టయిల్, అక్కడ సుఖాలు, అక్కడ డబ్బు అలవాటయ్యాకా ఇండియా రావడానికి ఇష్టపడరు. వారు చదివిన చదువుకి గుర్తింపు వుండదని కొందరు, ఉద్యోగాలు యిచ్చినా జీతాలు తక్కువని, రీసెర్చి వగైరాలకి మన దేశంలో కంటే విదేశాలలో అవకాశాలు గుర్తింపులు ఎక్కువని అక్కడే వుండి పోవడానికి యిష్టపడతారు. తీరా చేసి అక్కడ ఉద్యోగాలు సంపాదించుకుని, ఇల్లు కట్టుకుని సెటిల్ అయిపోయాక, పిల్లల పెంపకం గురించి బాధపడుతున్నారు. ఎంత సంపాదించినా ఎన్ని సదుపాయాలు, సుఖాలు వున్నా మాతృదేశానికి, తమ వారికి దూరంగా వున్నామన్న భావన అక్కడ వారందరిలో వుంది.

అమెరికాలో మీరు వూరు మారాలన్నా, ఇల్లు మారాలన్నా ట్రాన్స్‌పోర్టు, ప్యాకింగు అన్నీ చేసే కంపెనీలు వుంటాయి. వాటికి ఫోన్ చేస్తే

చాలు వాళ్ళే వచ్చి నీట్‌గా పాక్ చేసి మీ కొత్త ఇంటిలో ఏ గదిలో తీసినవి ఆ గదుల్లో అమర్చి వెళ్లిపోతారు. అక్కడ ఇంటి తాళాలు వాళ్ళకి ఇచ్చి ఆఫీసుకి వెళ్ళిపోతే, సాయంత్రం కొత్త ఇంట్లో సామానులు అన్నీ అమర్చి వుంటాయి ఒక్క వస్తువు పోకుండా.

అక్కడ ఇళ్లకి కూడా ఎంత పకడ్బందీగా సెక్యూరిటీ సిస్టము వుంటుందో చూస్తే ఆశ్చర్యం వేస్తుంది. అక్కడ చాలామంది వూరికి దూరంగా అడవుల్లో వున్నట్టు, ఇళ్ళు అక్కడొకటి, ఇక్కడొకటి వున్నా వారికి ఏ భయం వుండదు ప్రతి ఇంటికి కోడ్ నెంబర్లుతో లాకింగ్ సిస్టము వుంటుంది. మనం ఏదన్నా వూరు వెళుతున్నప్పుడుగాని, ఆఫీసుకి వెళ్లే ముందుగాని కోడ్ నెంబరులతో లాక్ చేసేముందు లోపల వున్న స్విచ్ ఆన్ చేస్తే దగ్గరలో వున్న పోలీసు స్టేషన్‌కు కనక్టు అవుతుంది. ఎవరన్నా తలుపు తెరవడానికి ప్రయత్నిస్తే పోలీసు స్టేషన్‌లో అలారం మ్రోగుతుంది. ఐదు నిముషాలలో పోలీసు బలగం ఇంటిముందు వుంటుంది. ఆ సిస్టము ఎంత పర్‌ఫెక్టు అంటే, మనం బయటికి వెళ్లే ముందు స్విచ్ ఆన్ చేయగానే ఎర్రలైటు వెలుగుతుంది. ఒకవేళ బయటివైపు తలుపులు, కిటికీ సరిగా వేయకపోతే ఎర్రలైటు వెలుగుతూ, ఆరుతూ బీప్ సౌండుతో సిగ్నలు ఇచ్చి హెచ్చరిస్తుంది. ఈ తలుపులు గడియలు సరిగా పడకపోయినా సిగ్నల్ వస్తుంది. ప్రతి సదుపాయం పట్టణాల మాదిరే వుంటాయి గనుక వారికి సిటీకి పల్లెకి తేడాలేదు కనకే అందరూ ప్రశాంత వాతావరణంలో సిటీకి దూరంగా వుండటానికి యిష్ట పడతారు.

యూరప్ చూసి వచ్చాక నిజం చెప్పాలంటే అమెరికా మమ్మల్ని అంత ఇంప్రెస్ చెయ్యలేదు. యూరప్ దేశాలకున్న చరిత్ర, చారిత్రాత్మక స్థలాలు అమెరికాలో లేవు. అమెరికా చరిత్ర రెండువందల ఏళ్ల గలది అయితే యూరప్ దేశాల చరిత్ర రెండువేల సంవత్సరాలనాటిది. అమెరికా ఆధునికంగా పెద్ద బిల్డింగులతో వుంటుందిగాని, యూరప్‌లా సహజ సౌందర్యం లేదు.

అమెరికాలో కూడా దాదాపు అన్నిచోట్ల ఎవరో ఒకరు బంధువులో, స్నేహితులో వున్నారు. కనుక బోర్డింగ్, లాడ్జింగుల ప్రోబ్లమ్ లేక పోయింది. ఓర్లండ్‌లో ఎవరూ లేరు. ఓర్లండ్ వెళ్ళాలంటే, మియామి నుంచి ఫ్లయిట్‌లో వెళ్ళాలి. మియామిలో ముందుగా ఎవరికో చెప్పి ఎయిర్‌పోర్టుకి దగ్గరలో వున్న ఓ హోటల్ రూమ్ బుక్ చేసుకున్నాము. మియామిలో రాత్రి హాల్ట్ చేసి, ఉదయం విమానంలో ఓర్లండ్ వెళ్ళాలి. కనుక రాత్రికి హోటల్‌లో వున్నాం. మేం ఎయిర్‌పోర్ట్‌లో దిగి ఆ హోటల్‌కి ఫోను చేయగానే, హోటల్ ట్రాన్స్‌పోర్టు వచ్చింది. ఎయిర్ పోర్టుకి దగ్గరగానే యీ హోటల్. మియామిలో కూడా చాలా వేడిగా యిండియాలో మాదిరిగానే వుంది. అమెరికాలో అన్ని హోటల్స్‌కి ఎయిర్‌కండిషన్స్ వున్నాయి. మేం ఆ రాత్రికి ఆ హోటలులో బసచేసి, తిరిగి ఉదయం 8 గంటల విమానంలో ఓర్లండ్ వెళ్ళాం. అక్కడ ఎవరో యిండియన్ గురుముఖ్‌సింగ్ అన్న అతను ఓర్లండ్‌లో హోటల్లో బస, డిస్నీవరల్డు, అప్‌కాట్ సెంటర్, సీ వరల్డు అన్నీ చూపించడానికి, ఎయిర్‌పోర్టులో దిగబెట్టడానికి అన్నింటికి కలిపి తొంభై డాలర్లకే సర్వీసు అన్న ప్రకటన చూసి బోస్టన్‌నుంచే అతన్ని ఓర్లండ్‌లో కాంటాక్ట్ చేసి ఆ హోటలు అదీ బుక్ చేసుకున్నాం. ఓర్లండ్‌లో దిగగానే గురుముఖ్ సింగ్ అంటే సర్దార్జీలా వుంటాడనుకొని అలాంటి మనిషి కోసం ఎదురు చూసేం. కాని అతను సర్దార్జీలా లేడు. ఫారినర్‌లా వున్నాడు. ఇండియన్ తండ్రి, విదేశీ తల్లి అంచేత అతను ఇండియన్‌లా లేడు. మమ్మల్ని హోటల్‌లోకి కారులో తీసుకువెళ్ళాడు. ఆ హోటల్ చిన్నది. కాటేజిస్‌లా వున్నాయి. కాని ఫైవ్‌స్టార్ హోటల్ కంఫర్ట్స్ అన్నీ వున్నాయి.

డిస్నీలాండ్ చూశాక అప్‌కాట్ సెంటర్‌కి వెళ్ళాం.

అప్‌కాట్ సెంటర్ అనేది డిస్నీలాండ్. డిస్నీవరల్డు లాంటి మాత్రాస్థలం. కాని అక్కడ అంతా మోడర్న్, కంప్యూటర్, ఎలక్ట్రానిక్స్, స్పేస్ షిప్స్, సర్కిల్ విజన్ లాంటి ఆధునిక అద్భుత ప్రపం

చాన్ని మన కళ్ళ ముందు పరుస్తారు. సర్కిల్ విజన్ అనేది రౌండుగా అన్ని వైపులా తెరలు వుంటాయి. మధ్యన మనం నిల్చుంటే అన్ని వైపులనుంచి స్క్రీన్ మీద ప్రొజెక్షన్ వేస్తారు. అమెరికాలో చూడాల్సినవి కెనడా, ఫ్రాన్స్ దేశం. యిలా ఒక్కొక్క దేశంలో చూడాల్సిన వింతలు, విశేషాలు చూపిస్తారు. అది చూస్తుంటే మనం ఆ రైళ్ళల్లో కూర్చుని స్పీడుగా వెడ్తున్నట్టు, ఆ షిప్పుల్లో కెరటాల మీద మనం వెడ్తున్నట్టు, జలపాతం మన మీదకి దూముతున్నట్టు మన చుట్టు కార్లు వెడుతున్నట్టు, పారిస్ రోడ్లమీద మనం నడుస్తూన్నట్టు, ఆ ప్రదేశంలో ఆ ఏంగిల్‌లో తీసిన షాట్స్‌లో మనమే ప్రయాణిస్తున్నట్టు....ఆ అనుభూతి చెప్పలేనిది.

ఇంకోటి స్పేస్ షిప్ అని, మనల్ని చిన్నచిన్న రైలు పెట్టెలలాంటి వాటిల్లో కూర్చోపెట్టి పట్టాలమీద నడుపుతూ చీకటి చోటికి తీసుకువెళ్ళి ఒక్క ఐదు నిముషాలు అతి వేగంగా కిందకి పైకి, గుండ్రంగా, ఎత్తుగా, పల్లంలోకి ఆ రైలు ఊహకందనంత వేగంతో మనల్ని గుండ్రంగా తిప్పేసి, కిందికి పడేసి, పైకిలేపేసి, పక్కకి తిప్పేసి గుండెలు జారిపోయి భయంతో నాలిక పిడచకట్టుకుపోయి, ఆ వేగానికి కళ్లు తిరిగిపోయి, ఆ ఎత్తునుంచి రైలులోంచి కిందకి జారిపడతామేమోనన్న భయంతో విభ్రాంతుల్ని చేస్తుంది. ఐదు నిమిషాలు పాటు ఆ రైలు. అది చుట్టు తిరుగుతున్నంతసేపు కెవ్వుమని కేకలు—కన్ను పొడుచుకున్నా కనపడని చీకట్లో మనం ఎక్కడ తిరుగుతున్నామో అంతుబట్టదు. అప్పుడే నాకనిపించింది. ఒక్క సెకను కనక కరెంటుపోతే ఆ వేగానికి మనం కింద పడి క్రాష్ అయి సున్నంలో ఎముక మిగలదు అన్పించింద. కాని ఎన్నో జాగ్రత్తలు తీసుకుని కానీ అలాంటి రైడ్స్ ఏర్పాటు చేయరు. యిప్పటి వరకు అలా జరిగిన సంఘటనా లేదు.

మైకేల్ ఏంజిలో త్రీడైమన్షన్ పిక్చరు, అతని యాక్షను, ఆ త్రీడైమన్షన్ ఎఫెక్టు చూడాల్సిందే.

ఆదిమానవుల దగ్గరనుంచి నవీనయుగంలో మానవుడు సాధించిన ప్రగతివరకు ఓ గుహ—ఫ్యూచర్ వరల్డు కంప్యూటర్స్‌తో చేసేపనులు, తమాషాలు ఒకటేమిటి ఈ నవీనయుగంలో వింతలు, విశేషాలు అన్నీ అప్‌కాట్ సెంటర్‌లో ఆకర్షణీయంగా చూపించారు. ఓర్లండ్‌లో ఎండ దంచిపారేసింది. ఫ్లారిడా అంతట యిండియన్ వాతావరణం వుంటుంది. అందుకే అక్కడ ఇండియాలో పండే కూరగాయలు, మామిడితోటలు వగైరా అన్నీ పెంచుతున్నారు. అమెరికాలో ఇండియాలో దొరికే కూరలు అన్నీ ఫ్లారిడాలో పండించి సప్లయి చేస్తున్నారు.

మర్నాడు సీవరల్డు చూడటానికి వెళ్ళాం. సీవరల్డు అంటే మొత్తం జలచరాల గురించి చూపించుతారు. 125 ఎకరాల స్థలంలో ఏర్పాటు చేశారు. అక్కడ డాల్ఫిన్స్, నీటి గుర్రాలు, షార్క్ చేపలు, వేల్స్ రకరకాల వాటితో వాటిని సర్కస్ కంపెనీలమాదిరి ట్రైన్‌చేసి వాటితో రకరకాల ప్రదర్శనలు యిప్పిస్తారు. చిన్నపిల్లలకు మంచి తమాషాగా వుంటుంది. అక్కడ సముద్రం లోతులోకి మనల్ని గాజుతొట్టిలో తీసుకువెళ్ళి సముద్రంలో వుండే రకరకాల జలచరాలను చూపిస్తారు.

ఓర్లండ్ తర్వాత మా ప్రయాణం హూస్టన్, టెక్సాస్ రాష్ట్రానికి ముఖ్య పట్టణం హూస్టన్. అక్కడ పెద్ద స్పేస్ సెంటర్ వుంది. మర్నాడు వెళ్ళి స్పేస్ సెంటర్ చూసి వచ్చాం. చంద్రమండలం మీద ముందు దిగిన షిప్పు, స్పేస్‌షిప్ విభాగాలు, ఆస్ట్రోనాట్స్ నిలువెత్తు బొమ్మలు అన్నీ ఆకర్షణీయంగా ఏర్పాటుచేశారు. ఆ సాయంత్రం హూస్టన్‌లో వున్న రాజేశ్వరీ ఆలయానికి వెళ్ళాము. పూజారులు తిరుపతి నుంచి వచ్చిన పండితులు, కుంకం పూజ చేయించాం. అక్కడ యింకో తెలుగు ఆడపడుచు ఆ రోజు వరలక్ష్మీవ్రతం గుడిలో చేసుకుని అందరినీ పేరంటానికి పిలిచింది. ఆ రోజు హూస్టన్ దగ్గరలోవున్న వూరి నుంచి మన సీత, అనసూయ, జంటలో అనసూయగారి కుమార్తె రత్నపాప వచ్చారు. ఆవిడ అక్కడ డాన్సుక్లాసులు నడుపుతుందట. అనసూయగారు, రత్నపాప రాత్రి పదకొండు వరకు కూచున్నారు. సరదాగా గడిపాం కబుర్లతో.

మరురాడు హూస్టన్‌కి 150 మైళ్ళ దూరంలోవున్న 'నేచురల్ కేవ్స్' చూడటానికి అందరం పిక్నిక్‌లాగా రెండు కార్లలో వెళ్ళాం. ఆ కొండ గుహలు లైమ్‌స్టోన్‌వి. ఆ గుహల లోపల కొన్ని మిలియన్ సంవత్సరాల నుంచి ఒక్కొక్క చుక్క సున్నపునీరు జారిపడి గట్టిపడి రకరకాల ఆకారాలు, ఆకృతులు ఏర్పరచుకున్నాయి. ఆ గుహలలో ఎంతో చల్లగా గజ గజ వణికించినట్లుంది. లోపల అంతా గుహలలో మెట్లు ఏర్పరచి, ఎలక్ట్రిసిటీ పెట్టి గైడ్‌తో మాత్రం లోపలికి వెళ్ళనిస్తారు. ఆ కొండగుహలు 1962లో మాత్రమే కనుక్కున్నారట. అలా వేలకొద్ది సంవత్సరాలనుంచి ఆ గుహల లోపల నీరు చుక్కలు పడి పడి గడ్డకట్టి చూస్తుంటే దంతంలా కనిపిస్తుంది. ఏసుక్రీస్తు, మేరీమాత, గణేశ్, స్టేచ్యూ ఆఫ్ లిబర్టీ—మారు నుంచి చాండిలయర్స్‌లా వేలాడే రకరకాల ఆకృతులు—ప్రకృతి మానవాళికి యిచ్చిన వరాలు ఇవన్నీ అనిపిస్తుంది. ఒక అరంగుళం పొడుగుకి ఎత్తుకి రావాలంటే వందఏళ్ళు పడుతుందట. చుక్క చుక్క పడి గట్టి పడుతూపడుతూ అలా పదిహేను, యిరవై, యాభై అడుగుల ఆకారాలు ఉన్నాయి అంటే ఆ లెక్కన కొన్ని మిలియన్ల సంవత్సరాల నుంచి ఆ గుహలు ఏర్పడ్డాయి. అవి భూగోళ శాస్త్రజ్ఞులు లెక్కలుకట్టి చెప్పినవి. మన పైజాగ్, అరకు దారిలో బొర్రాకేవ్స్ అని ఉన్నాయి. వాటిలాంటి వన్న మాట. బొర్రా కేవ్స్ చాలా చిన్నవి

మా తరువాతి ప్రయాణం వాషింగ్టన్. అమెరికా రాజధాని. చాలా అందమైన నగరం. న్యూయార్క్‌ని మనం బొంబాయితో పోలిస్తే వాషింగ్టన్‌ని ఢిల్లీతో పోల్చవచ్చు. వాషింగ్‌టన్‌లో అన్నపూర్ణ యింట్లో మా మకాం. వాషింగ్‌టన్ వూరికి 35 మైళ్ళ దూరంలో వున్నారు వాళ్ళు. అన్నపూర్ణ గాకుండా వాషింగ్‌టన్‌లో మా చెల్లెలు హేమ కూతురు 'చెల్లి' (అసలు పేరు కల్పన) కూడా వుంది. వాషింగ్‌టన్ యూనివర్సిటీలో అసిస్టెంట్ ప్రొఫెసర్‌గా ఉద్యోగంలో చేరింది. వాషింగ్‌టన్ వచ్చి పది రోజులయింది. రెండు బెడ్‌రూముల ఫ్లాట్ కొత్తగా తీసుకుంది. ఇంకా ఫర్నిషింగ్ అదీ అవలేదనీ, అన్నపూర్ణ యింట్లో దిగాం. మేము అమెరికా వచ్చే వేళకి మా చెల్లెలు అబుదాబి నుంచి వచ్చింది. మేము

నలుగురం అక్క చెల్లెళ్ళం అమెరికాలో కలుసుకోవడం చాలా బాగా కుదిరింది. వాషింగ్టన్ చేరాక నెలా పదిరోజులుగా తిరిగినవాళ్ళం తిరిగినట్లున్నాం ఏమో కొంత డల్ అయిపోయాము. తిరిగిచూడాలన్న కోరిక తగ్గిపోయింది. కాని మర్నాడు బయలుదేరి ట్యూబ్ రైల్లో ఊరంతా చుట్టివచ్చాం. స్మిత్‌సోనియా ఎయిర్ స్పేస్ మ్యూజియం. నేచురల్ హిస్టరీ మ్యూజియం చూశాం. ఈ మ్యూజియం చాలా బాగుంది. ఆ మర్నాడు మా చెల్లెలు అందరం కలసి సిటీటూర్ టిక్కెట్ కొనుక్కొని ఊరంతా తిరుగుతూ, కాపిటల్ బిల్డింగ్ (అంటే మన పార్లమెంటులాంటిది) లింకన్, జెఫరసన్ మెమోరియల్స్, అమెరికా ప్రెసిడెంటు యిల్లు వైట్ హౌస్ బయటినించి చూసాం. ఆ బిల్డింగు చూడాలంటే ఉదయం ఏడు గంటలకే వెళ్లి క్యూలో నిలబడాలట. ఏ పన్నెండు ఒంటిగంటకో మన చాన్సు వస్తుందిట. అంతసేపు నిలబడి ఇరవై డాలర్ల టిక్కెట్ కొనుక్కొని చూసేంత ఏమీలేదు. మన రాష్ట్రపతి భవనమే దీని ముందు చాలా బాగుంటుంది అన్నారు చూసినవాళ్లు, కెనడీ హాల్ పెద్ద బిల్డింగ్ అక్కడ పెద్ద థియేటర్ పెద్దపెద్ద షోలు, నాటకాలు ఆడతారు అక్కడ. అన్ని దేశాల యంబసీలున్న భవంతులు, వాటర్ గేట్ మొదలైనవి. రెండు మూడు గంటలు ట్రామ్‌లాంటిదాంట్లో తిప్పుతారు.

వాషింగ్టన్ అండర్‌గ్రౌండ్ మెట్రోరైళ్ళు చాలా ఆధునికంగా చాలా బాగున్నాయి. మూడు అంతస్థులలో ప్రతి రెండు నిముషాలకి ఒక రైలు వస్తుంది. అక్కడ టికట్ సిస్టమ్ ఎంత పకడ్బందీ అంటే మేం వెళ్ళినరోజున చిన్న సంఘటన చెప్తాను. టికట్ తీసుకోడానికి యిన్ని డాలర్లు అని వేసి తీసుకోవాలి. మేం డబ్బులువేసి టిక్కెట్ తీసుకున్నాం. తిరగాల్సినవన్నీ తిరిగి రిటరన్ టిక్కెట్ కొని వస్తున్నప్పుడు అక్కడ గేట్ దగ్గర ఒక మిషన్‌లో వేస్తే తలుపు తెరుచుకుంటుంది. అంతా కంప్యూటర్ సిస్టమ్. నా టిక్కెట్ వేసినా అది బయటికి తన్ని కొచ్చేసి రిజెక్టు వేసింది. తలుపు తెరుచుకోలేదు. ఒక మనిషి ఒక టిక్కెట్ ఆ గడిలో వేస్తే ఆ మనిషి మాత్రం వెళ్లాక వెంటనే మళ్ళీ లాక్ పడిపోతుంది. నా టిక్కెట్ పైకి ఎందుకు వచ్చేస్తోందో తలుపు తెరుచు

కోదేం అని గాబరా వేసింది. నా అవస్థ చూసిన అక్కడి ఆఫీసర్ నా దగ్గరకొచ్చి 'మే ఐ హెల్ప్ యూ' అంటూ నా చేతిలో టిక్కెట్ తీసుకుని చూశాడు. మేం చూడలేదుగాని దానిమీద నా టిక్కెట్ ధరలో పది పెన్నీలు తక్కువ వేశారంట టిక్కెట్ కొన్నప్పుడు. ఈ టిక్కెట్, ఆ తక్కువైన డబ్బు యింకో మిషనులోవేస్తే టక్కున యింకో టిక్కెట్ వచ్చింది. ఆ టిక్కెట్ అప్పుడు ఎగ్జిట్ గేట్ దగ్గర వేయగానే ఝాపాలి తలుపు తెరుచుకుంది. అంటే లెక్కల్లో అంత పర్ఫెక్టు—పదిపెన్నీలు తక్కువైనా మనం గేట్ దాటి బయటికి వెళ్ళలేం—వాళ్ళకి రావల్సిందే కాదు-మనకివ్వాల్సి వచ్చిన డబ్బు అప్పుడూ అలాగే జరిగింది ఒకసారి. 25 పెన్నీలు టిక్కట్టు కొన్నప్పుడు ఎక్కువవేస్తే టిక్కట్టుతోపాటు ఆ 25 పెన్నీలు బయటికి వచ్చేసాయి. కంప్యూటర్ సిస్టమ్ అంత పర్ఫెక్ట్ అన్నమాట—చూడాల్సినవన్నీ పూర్తి అయ్యాక రాత్రి మా 'చెల్లి' ఫ్లాట్లో డిన్నర్‌కి పిల్చింది. యింకోరోజు మన తెలుగువాళ్ళ భార్యభర్తా డాక్టరయి అక్కడికి 40 మైళ్ళ దూరాన మిలియన్ డాలరు యిల్లు కట్టుకున్నారు చూపిస్తానంటూ తీసుకువెళ్ళింది. మిలియన్ డాలర్ యింట్లో స్విమ్మింగ్‌పూల్స్, సోనాబాత్‌లు, కారు వస్తుంటే ఆటోమేటిక్‌గా తెరుచుకునే గారేజీలు. మనం ఎక్కడ నడిచివస్తుంటే అక్కడ తోటలో లైట్లు వెలగడం, యింటి చుట్టూ ఎకరాల కొద్దీ స్థలం ఇంట్లో ఫర్నిచర్ అదీ సరేసరి. ఆ రోజులలో వెళ్ళిన డాక్టర్లు బాగా సెటిల్అయి బాగా సంపాదిస్తున్నారు.

వాషింగ్‌టన్‌నుంచి తిరిగి బోస్టన్ వెళ్లాలంటే న్యూయార్క్‌మీదుగా వెళ్లాలి. అంచేత మళ్ళీ న్యూయార్క్ వెళ్లాము. అక్కడనుంచి మా మామయ్య కూతురు పద్మ కారులో బోస్టన్ తీసుకువెళ్ళింది. న్యూయార్క్ నుంచి బోస్టన్‌కి బస్సులో వెళ్ళితే 25 డాలర్లు టిక్కెట్ మనిషికి. కాని అదే కారులో వెళితే 10 డాలర్ల పెట్రోల్‌కంటే ఎక్కువ అవదు, పద్మ న్యూయార్క్‌కి బోస్టన్‌కి మధ్య స్మిత్ కాలేజీలో బి. ఏ. చదువుతోంది. త్రోవలో తన కాలేజీ. హాస్టల్‌రూమ్స్ అవి చూపించింది. ఆ హాస్టల్‌లో బట్టలు ఉతకడానికి కామన్‌గా వాషింగ్, డ్రయింగ్ మిషన్లు వుంటాయి.

హాస్టల్ రూమ్స్‌లో కొందరు అమ్మాయిలు టి.వీ.లు, వీడియోలు, స్టీరియోలు పెట్టుకున్నారు. మా చెల్లెలి కూతురు చదివే బ్రౌన్ యూనివర్సిటీ కూడా బోస్టన్‌కి న్యూయార్క్‌కి మధ్య వున్నది. అది కూడా చూశాము. ప్రతి స్టూడెంట్‌కి పోస్ట్‌గ్రాడ్యుయేట్ వచ్చిందగ్గర్నుంచి సాధారణంగా స్కాలర్‌షిప్స్ వుంటాయి. స్కాలర్‌షిప్ కనుక దొరకకపోతే చదువు చాలా ఖర్చుతో కూడినది. అక్కడ కొందరు హాస్టల్స్‌లో వుండి చదువుకుంటారు. అంత డబ్బు ఖర్చు భరించడం కష్టం గనుక సాధారణంగా ముగ్గురు నలుగురు కలిసి ఫ్లాట్ అద్దెకు తీసుకుంటారు. అమెరికా కాలేజీల్లో, యూనివర్సిటీల్లో చదివే వారిలో అమెరికన్స్ కంటే మిగతా దేశాలవారు ఎక్కువగా వున్నారట.

లాస్‌ఏంజిల్స్, శాన్‌ఫ్రాన్సిస్కో, బోస్టన్. న్యూయార్క్, వాషింగ్‌టన్, హూస్టన్. మియామీ, ఓర్లండ్ అప్పటివరకు చూశాము. ఇంకా అమెరికాలో ముఖ్యంగా మేము చూడాలనుకున్నది నయాగరా.

సెప్టెంబర్ ఫస్ట్ వీక్‌లో అక్కడ 'లేబర్ డే' సెలవులప్పుడు నయాగరా ప్రయాణం పెట్టుకున్నాము. నయాగరా వుండే వూరు పేరు బఫెలో. అక్కడ చిన్న కాటేజి ముందుగానే బుక్‌చేశాము. మేడ మీద ఒక బెడ్‌రూమ్. బాత్‌రూమ్‌కింద సిటింగ్, డైనింగ్‌రూమ్. ఒక గోడలో వుండే బెడ్, కుకింగ్‌రేంజి, ఇవన్నీ వున్నాయి. మేము బియ్యం, తంబూరి కొట్టెలు, రైస్‌కుక్కర్, నాలుగైదు రకాలు కూరలు వండినవి అన్నీ తీసుకువెళ్ళి ఫ్రిజ్‌లో పెట్టుకుని రోజూ అన్నం వండుకుని తినే వాళ్ళం. హోటల్‌లో బ్రేక్‌ఫాస్ట్ ఫ్రీ. రెండురోజులుండి నయాగరా చూశాము.

అమెరికా అంతటికి నాకు నచ్చింది నయాగరా జలపాతం. ప్రకృతి ప్రసాదించిన అందం. మిగతా సిటీలన్నీ ఆధునికంగా వుండి ఒకేలా కనిపిస్తాయి. కాని నయాగరా సహజసౌందర్యం ముందు ఏ నగరాల అందాలు పనికిరావు. నయాగరా అమెరికావైపునుంచి కంటే కెనడావైపు నుంచి ఇంకా అందంగా వుంది. అమెరికావైపు నుంచి చూస్తే ఎత్తుగా

కొండమీద నుంచి నిలువుగా ధారలాపడి కనిపించి పెద్ద వింతగా కొత్తగా అనిపించదు. అదే కొండకి అవతలప్రక్క (కెనడావైపు) చూస్తే జలపాతం మాహారన్ ఆకారంలో వుండి గుండ్రంగా పూర్ణ వేగంతో కిందకి దుమికే జలపాతం, పొగలా కప్పేస్తుంది ఆ ప్రాంతాన్ని. కెనడావైపు నుంచి నయాగరా చూడాలంటే కెనెడియన్ వీసా వేరే తీసుకుని అమెరికా బోర్డర్ దాటి వెళ్లాలి. అమెరికావైపు నుంచి కెనడావైపు ఫాల్స్‌వరకు నీళ్ళలో బోట్‌లో తీసుకువెళతారు. దానికి కెనెడియన్ వీసా అక్కర్లేదు. "మెయిడ్ ఆఫ్ ది మిస్ట్" అనే బోట్ రైడ్‌లో జలపాతం పడేచోట అంతా తిప్పి తీసుకువస్తారు. ఆ చోట అందరికీ రైన్‌కోట్లు వాళ్ళే యిస్తారు. జలపాతం, మధ్యనుంచి బోట్ వెళుతుంటే తుంపరలు వానలా పడి మనల్ని తడిపేసి చలిలో వొణుకెత్తిస్తుంది.

176 అడుగులు కిందకి సెకండుకి 205,000 క్యూబిక్ ఫీట్ ఫాల్స్ అతివేగంగా దుముకుతూ ఇంత నీరు ఎక్కడినుంచి వస్తూవుంది ప్రకృతి వింతకి ఆశ్చర్యచకితులమై ఆనందపారవశ్యంతో నిలబడిపోతాం. రాత్రి అవగానే నగరమంతా దేదీప్యమానంగా వెలిగిపోతుంది. ఫాల్స్ ఇల్యూమినేషన్ ఉంటుంది. ఒక్కొక్క రంగు ఇంద్రధనస్సులోని రంగులనీ దూరంనుంచి ఫాల్స్‌మీద పడేటట్లు ఫోకస్ చేస్తే నీళ్ళు కాస్సేపు ఆరంజి, బ్లూ, పసుపు, ఎరుపు, ఊదా రంగులుగా మారుతు అద్భుత దృశ్యాన్ని అందిస్తుంది. ప్రతి ఏడూ పదిహేను మిలియన్ల టూరిస్టులు నయాగరాని సందర్శిస్తారట. అమెరికా వెళ్ళినవారు ఎవరూ నయాగరా చూడకుండా రాకూడదు. నయాగరా అందాలని చూడడానికి ఎత్తైన టవర్‌లు కట్టారు చుట్టూ. సైక్లాన్ టవర్ ఎత్తు 775 అడుగులు. ఆ రివాల్వింగ్ టవర్ మీద నుంచి ఎటుపక్కనుంచైనా నయాగరా అందాలు చూడవచ్చు. వెళ్ళదల్చినవారికి 'రోప్‌వే' లున్నాయి నయాగరా మీదనుంచి తీసుకువెళ్ళడానికి హెలికాప్టర్ రైడ్స్ ఉన్నాయి. వింటర్‌లో ఈ ఫాల్స్ అన్నీ గడ్డకట్టుకుపోతాయిట చాలావరకు. మేమందరం కెనెడియన్ వీసా తీసుకున్నాము. కెనడావైపు వెళ్ళి ఫాల్స్ చూడడానికి. అక్కడి పట్టణాలు

చూడడానికి. కెనడాలో టొరెంటో, అట్టావా పెద్ద పట్టణాలు. కెనడాకి ముఖ్యపట్టణం అట్టావా. టైమ్ లేనందున మేము కేవలం టోరంటో మాత్రం వెళ్లాము. టోరాంటో న్యూయార్క్‌లా చాలా పెద్ద పెద్ద బిల్డింగ్‌లు అవి వున్న సిటీ. మన ఇండియన్స్ ముఖ్యంగా సర్దార్జీలు చాలామంది వున్నారు అక్కడ. ఇండియన్ షాప్‌లన్నీ గుజరాతీలు, సర్దార్జీలవే. ఒక పెద్ద వీధివీధి ఇండియన్ షాప్‌లు వున్నాయి. అమెరికాలోకంటే ఇక్కడ చవక....టోరంటోలో మూడు నాలుగు గంటలవరకు గడిపి మళ్ళీ బయలుదేరి సాయంత్రం చీకటిపడుతూ వుండగా నయాగరా ఫాల్స్ వెళ్లాము కెనడావైపు నుంచి చూడడానికి. కెనడావైపు నుంచి మరింత అద్భుతంగా కనబడిన నయాగరాని లైట్లు వెలిగేవరకు ఆగి చూసి హోటల్‌కు బయలుదేరాం.

ఆ మర్నాడు తిరిగి బోస్టన్‌కు ప్రయాణం అయ్యాము. అక్కడితో మా అమెరికా యాత్ర ముగిసింది. వచ్చేటప్పుడు అందరం కలిసి వచ్చినా వెళ్ళేటప్పుడు మా అందరిది తలోదారి అయింది. ఈ రెండున్నర నెలలూ నిజంగా మరపురాని అనుభూతులని అందించింది మా యాత్ర.

యూరప్, యు. కె., అమెరికా వీటన్నిటికన్నా నన్ను ఇంప్రెస్ చేసిన దేశం స్విట్జర్‌లాండ్. అయితే ఈ దేశాలన్నిటిలో-నన్ను ఆకర్షించింది- ఆ మనుష్యులలో పంక్చువాలిటీ, టైమ్‌సెన్స్, నిజాయితీ, డిగ్నిటి ఆఫ్ లేబర్, పరిశుభ్రత, సివిక్ సెన్స్, కృషి, పట్టుదల, ప్రతి దశలో, ప్రతి పనిలో పురోగమించాలనే తపన, దేశాలుచూసి అన్నీ తెలుసుకోవాలన్న వారి ఉత్సాహం, ఇలా చెప్పాలంటే ఎన్నో ఉన్నాయి. ఆ దేశాలు చూశాక ప్రతిచోటా, ప్రతి దశలో వారితో పోల్చుకుని మనం

ఎప్పటికలా అవుతాంఅన్న ఆవేదన పెరిగింది. మన దేశంలోని ప్రజలలో మార్పు రావాలి. చైతన్యం రావాలి. అంటే ముందు భారతదేశం జనాభా పెరుగుదల తగ్గాలి. పుట్టిన ప్రతివాళ్ళూ కనీసం మెట్రిక్ వరకు చదవాలి. వృత్తి విద్యలు ప్రోత్సహించాలి. ఓటింగ్‌కి కనీస విద్యార్హత మెట్రిక్ వరకు వుండాలి. గ్రామాలలో సౌకర్యాలు కల్పించి ప్రతివారు పల్లెను వదిలి పట్టణాలు పరిగెత్తిరాకుండా చూడాలి. నరికిన అడవులను పెంచాలి. దాంతో వర్షాలు పడాలి. నీటి కరువు తీరాలి. పంటలు పండాలి. ధరలు అదుపుచేయాలి. రోడ్లు బాగుచేయాలి. ఇలా రాసుకుంటూ పోతే అంతులేదు.

ఇంత ఆవేదన మధ్యకూడా నాకు ఎవరైనా ఛాయిస్‌యిచ్చి విదేశాలలో వెళ్లి వుంటావా అంటే ఊహూ వెళ్ళను అని చెప్పడానికి అరక్షణం ఆలోచించను. తిరిగి చూసి రావడం ఇష్టం. మంచిని పొగడడం యిష్టం. కాని నా మాతృభూమిని వదిలివెళ్లి పరాయిదేశంలో వుండడం ఊహూ నాకు వద్దు. ఆ దేశాలలో ఎన్ని సుఖాలువున్నా ఎంత సౌఖ్యంవున్నా.... పరాయి యింటిలో పట్టుపరుపుమీద ఎయిర్‌కండిషన్ గదిలోకన్న మన యింటిలో నేలమీద, ఉక్కలో, దుమ్ములో పడుకున్న స్వతంత్రం, హాయి నాకు అక్కడ దొరకవు. జననీ జన్మభూమి అన్నమాట తియ్యనిది. ఆ మాటలోని తీపిదనం, చాలు. కడుపు నిండకపోయినా కన్నతల్లి వొడిలో దొరికే శాంతి, సుఖం మరెక్కడా వుండవని నమ్మేవారిలో నేనూ ఒకరిని!

# కంచె మేసిన చేను

అదొక పల్లెటూరు! దేశంనిండా అలాంటి పల్లెలు కొల్లలు! ఆ పల్లెలకి సంరక్షకుడిలా-నాలుగైదు పల్లెల మధ్య ఒక టౌను! ఆ టౌనును సంరక్షించడాని కన్నట్టుగా మధ్యలో ఒక పోలీసు స్టేషను—

ఊరంతా తెల్లారినా ఇంకా ఆ పోలీసు స్టేషనులో తెల్లారలేదు. ఊళ్ళో కోడి నాలుగు గంటలకే కూసింది. పాలవాళ్ళు-పనివాళ్ళు-పనున్న వాళ్ళంతా కోడి వార్నింగ్‌కే లేచారు. ఇంకా లేవని వాళ్ళని లెండంటూ రెండో కూత పెట్టింది కోడి. ఆ పోలీసు స్టేషనులో చక్కగా రెండు బెంచీలు దగ్గరగా కలిపి పక్కేసుకుని ఫేనుకిందకి లాక్కొని గుర్రు పెడుతూ నిద్రపోతున్నాడు నైట్ డ్యూటీ కానిస్టేబిల్ గవర్రాజు.

ఆ గవర్రాజు బంగారంలాంటి నిద్ర చెడకొట్టాడూ ఎవరో తలుపులు దబదబ బాదారు....గవర్రాజు కళ్ళిప్పితే మళ్ళీ నిద్రపట్టదన్నట్టు ఒక కన్ను సగం తెరచి గోడనున్న గడియారం చూశాడు. ఇంకా ఐదున్నరే చూపిస్తూంది గడియారం - గవర్రాజుకి బెదిరినట్టు. మళ్ళీ తలుపులు బాదారు. "ఎవడ్రా అని - యింత పొద్దున్నే నీయమ్మ సిగ తెరగా-" తిట్టుకుంటూ వూడిపోతున్న లుంగీ సవరించుకుంటూ యింక తప్పదన్నట్టు లేచాడు గవర్రాజు. లేచి నిలబడ్డ గవర్రాజు గజరాజులా వున్నాడు. ఆరడుగుల పొడుగు, ఆ పొడుక్కి ఎక్కువే అయినంత లావు, ముందుకి జారి కిందపడ్తానని బెదిరించే పొట్ట-వంటికి సరిపోయిన పెద్ద మొహం, ఆ మొహంలో కనపడని ఏనుగు కళ్ళు, కనపడే తొండంలాంటి పొడుగు ముక్కు....వీడికి పెదాలు లేవా అన్నట్టు కప్పేసే మీసాలు....గంజిపెట్టిన కాకీ నిక్కరు వేసి షర్టు టక్‌చేసి, లాఠీపట్టి కాకీ స్టాకింగ్స్‌లో టకటకలాడే బూట్లు చప్పుడు చేస్తూ నడుస్తుంటే పోలీసంటే యిలా వుండాలి భయపడేట్టు.

అనుకుంటారు. కానిస్టేబిల్ అయిపోయాడుగాని ఇన్‌స్పెక్టర్ అయితే ఇంకెంత ఠీవిగా వుండేవాడో అన్పించేది అందరికీ....ఆ గవర్రాజు దర్పా ఇప్పుడు లుంగీతో కాస్త తగ్గిందికాని, గజరాజు చచ్చినా, బతికినా వెయ్యి వరహాలే అన్నట్టు లుంగీలోవున్న కానిస్టేబిలూ కానిస్టేబిలేకదా - ఆ కాని స్టేబిల్‌గారు నిద్ర చెడిపోయిన కోపం తలుపులమీద చూపిస్తూ ధఢాల తలుపులు తెరిచాడు.

తలుపు అవతల....తలుపు తట్టడమే నా నేరం అన్నట్టు బెదురుగా, భయంగా, దీనంగా చూస్తున్న ఆ మనిషికి....వయసు ఎంతో చెప్పడం కష్టం ముప్ఫై వుండచ్చు. నలభై వుండచ్చు. ఎభై వుండచ్చు. జుత్తు పీకేసిన తాటి టెంకలా వుంది. గడ్డం గీసుకోడానికి, గీయించుకోడానికి డబ్బుంటే దాంతో నాలుగుల్లిపాయలు కొనుక్కుంటేను అన్నట్టు బాగా మాసి వుంది. తింటున్న తిండి బుగ్గలదాకా యెక్కడ చేరుతుంది అన్నట్టు దవడలు పీక్కుపోయి వున్నాయి. రంగు నలుపయినా ఆ రంగులో నిగా రింపు కాకుండా చర్మం ఎండి, పొడలు పొడలుగా వుంది. కట్టుకున్న పంచె "వెర్ అండ్ టేర్" అన్నట్టు వుతుకుచూసిన పాపాన పోయినట్టు లేదు. తొడుక్కున్న బనీనులో గుడ్డకంటే చిరుగులే యెక్కు వున్నాయి. రాత్రంతా పరిగెత్తి వచ్చినట్టు ఆయాసంగా రొప్పుతున్నాడు.

ఆ మనిషిని చూడగానే అదా కానికి చెల్లని వాటని అర్థం అయి పోయింది గవర్రాజుకి. అలాంటి అష్టరాల్‌గాడు వచ్చి నిద్ర చెడగొట్టి నందుకు-నిద్ర చెడగొట్టేంత ధైర్యంగా తలుపు తట్టినందుకు కోపంకంటే ఆశ్చర్యం ఎక్కువేసింది. ఆశ్చర్యపడ్డం అయ్యాక మళ్ళీ కోపం ముంచుకు వచ్చింది. "ఎవర్రా నువ్వు....నీ యమ్మ....పొద్దుటే ఏం కొంపలంటు కున్నాయిరా" చూపులతో భస్మంచేసేటట్టు అపాదమస్తకం చూస్తూ అడి గాడు గవర్రాజు....ఆ చూపుకే వణుకుతూ....నీళ్ళు నమిలాడు ఆ మనిషి- "బాబూ....మా ఆడదాన్నట్టుకొచ్చారండి"....ఆ అనడంతో తన తప్పు న్నట్టు నసుగుతూ బెదురుచూపులు చూస్తూ అన్నాడు. గవర్రాజు ఆశ్చ ర్యంగా, వింతగా, అర్థం కానట్టు చూశాడు. ఏ దొమ్మీ కేసో....ఏ పొలాల

తగాలో, కొట్టుకున్న కేసో, ఏ గేదో, ఎద్దుతో ఎవరో పట్టికెడితే ఫ్రెండ్ యివ్వటానికి వచ్చాడనుకున్నాడు గవర్రాజు.

"ఆడదాన్నట్టుకొచ్చారా.... ఎవర్రా....ఏటంటున్నావు అసలు...." తీవ్రంగా అడిగాడు.

"తవరేనండీ...." ఎదురుగా చూస్తూ అన్నాడు.

"ఏట్రా .... నంజకొడకా, తాగొచ్చావా? నీ ఆడదాన్ని నేనట్టు కొచ్చానా....ఏట్రా పేలుతున్నావు....మక్కెలిరగ్గొట్టగలను" గవర్రాజు మత్తు పూర్తిగా వదిలిపోయింది వాడి మాటలకి....

"మీరంటే మీరుకాదు బాబూ, పోలీసోళ్ళు తీసికెళ్ళిపోనారండి...."

"పోలీసులు తీసికెళ్ళారా....ఎందుకు....ఏట్రా నీ గోల....ఏటంటా వసలు - ఏటి జరిగింది. వృత్తి పున్నానికి పోలీసోళ్ళు నీ ఆడదాన్నెందుకు తీసికెడతార్రా...." గవర్రాజుకి కోపం తగ్గి కుతూహలం పెరిగింది-

"ఏటోనండి నే నింటికాడ లేనండి. సాయంకాలం ఇద్దరు పోలీసోళ్ళు దాన్ని లాక్కెళ్ళినారంట- రాత్రికాడంతా సూశాను బాబూ అంద న్నారూ, బానెళ్ళి పోలీసు టేషనుకాడ అడుగు అంటే పరుగెత్తి వచ్చాను బాబూ మా చుక్కని ఇప్పించండి. అసలదేటి సేసింది దొరా, వృత్తి పున్నానికి దాన్నెందుకు లాక్కొచ్చారు బాబూ-" ఎంత వినయంగా అన్నా వాడి గొంతులో ఆగ్రహం, బాధ ధ్వనించింది.

"మళ్ళీ అదే మాట, ఎవర్డా అట్టుకొచ్చాడు - నేను నీ పెళ్ళాన్ని తీసుకొచ్చినట్టు దబాయిస్తున్నా వేటిరా....ఏ లంజకొడుకు అట్టు కెళ్ళారో అక్కడడుగు....పో .... ఇక్కడినించి. బంగారంలాంటి నిద్ర సెడగొట్టి పైగా పెళ్ళాన్ని అట్టుకొచ్చానంటావు. ఫో ముండు. నేకపోతే నిన్ను లాకప్పులో పడేయిస్తాను....ఎళ్ళరా....అదెవరితో పడుకోడానికి పోయిందో రాత్రి నీలాంటి మొగుడు ఏ ఆడదానికి కావాల్రా అంచేతే యెవడితోనో

పోయుంటుంది. తెల్లారి వచ్చి వుంటుందిలే....షో...." తిక్కరేగి కసిరాడు గవర్రాజు.

ఆ మాటలకి ఆ మనిషి మొహం ఆకాశంలో మబ్బేసినట్లు నల్ల బడింది. తరువాత ఒక్క మెరుపు మెరిసినట్లు కళ్ళల్లో ఒక్కక్షణం కోపంతో తళుక్కుమంది. ఆ తరువాత చినుకులు రాబోతున్నట్టు వాడి కళ్ళు తడి అయ్యాయి- "బాబూ. మేం కూటికి పేదయినా గుణానికి కాదండి. మా సుక్కి అలాంటిది గాదండి. మీ పోలీసోల్లు లాక్కెళ్ళి నారని మా గూడెం అంతా సెప్పినారు బాబూ. కావలిస్తే మా వోళ్ళని అడగండి బాబూ. ఓ ఆడకూతురిని బలవంతంగా ఎందుకు లాక్కెళ్ళి నారో మీ పోలేసోల్లని పిలిచి అడగండి దొరా. దాని తప్పేటి సెప్పండి బాబూ.....రాత్రంతా అదింటికి రాలేదండి ఎక్కడుంది అది. దానితప్పేటి సెప్పండి బాబూ" గవర్రాజు మాటలకి ముందు బాధగా, ఆ తరువాత కోపంగా, పౌరుషంగా అడిగాడు.

అప్పటికి గవర్రాజుకి యిదేదో కొట్టిపారేసే విషయంకాదని అర్థం అయి వాడి మాటల తీక్షణలకి తగ్గాడు — ఓరి వీడి దుంపతెగ. వంట్లో వూపిరి లేనట్టున్నా మాటలు జోరుగా వస్తున్నాయే-అనుకున్నాడు,

"ఏ పోలీసులు తీసికెళ్ళారు. ఆళ్ళ పేరేటి అసలు సుప్పోవేం. ఏటి గొడవ" - ఇదేదో తొందరగా తేలే వ్యవహారంలా కనపడక, అక్కడి కుర్చీ లాక్కొని కూర్చుని బీడి తీసి వెలిగించాడు.

"ఆళ్ళ పేర్లు మాకేటితెలుస్తాయిబాబూ. గుడిసెలో కూకొంటు తున్నదాన్ని, గుడిసెలో జొరబడి "నీ మొగుడు దొంగతనం సేసి గుడి సెలో డబ్బు దాచాడట పదవే పోలీసుస్టేషన్‌కి' అంటూ లబోదిబోమని ఏడుస్తున్న దాన్ని లాక్కెళ్ళినారండి. గుడిసెల్లఅంతా ఆడోళ్ళే. మగా ళ్లంతా పనికి పోనారు. ఆడోళ్ళు అడ్డుపడితే అందరిని లాఠీతో బెదిరించి లాక్కెళ్ళిపోనారుబాబూ. నే నింటికాడ కొచ్చేసరికి ఆడోళ్ళంతా యిసయం చెప్పారు. నే దొంగతనం సేయడం ఏటి, డబ్బేటి,. దాన్ని లాక్కెళ్ళడం

ఏటి....ఏటి బాజయ్య ఈ గొడవవంతా. బాబూ, ఇన్‌స్పెకరు బాబుకి యిసయం సెప్పాలని వచ్చాను."

"ఒరి నీ....నీకుకానిస్టేబిల్ చాలలేదురా? ఇన్‌స్పెక్టర్ కావాలిరా గాడిదకొడకా' అనుకున్నాడు గాని అనలేదు-అంటే-అసలే ఈ వెధవలు యిండి వచ్చినాళ్ళు-ఆ ఇన్‌స్పెక్టర్ వచ్చేవరకు కదలకుండా కూచుని మీ కానిస్టేబిల్ తిట్టాడని సెపితే సికాకు. యింతకీ ఈ గొడవేంటో తుది మొదలు అంతుచిక్కలేదు. పోలీసులంటే, ఎవరెళ్ళారు-దొంగతనం వీడు సేసాడే అనుకున్నా. ఆడి పెళ్ళాన్ని లాక్కెళ్ళి రాత్రి అంతా ఎక్కడ పెట్టారు? అసలు వాళ్ళు పోలీసులా?....డ్యూటీలో నిన్న వున్నదెవరు? ఆక్షపనే యిది. అడకూతురిని లాక్కెళ్ళి....ఆలోచించిన గవర్రాజుకి ఏదో తట్టింది....అంతలోనే ఆబ్బే అదికాదు అనుకున్నాడు. ఎవరన్నా పోలీసుడ్రస్సు వేసుకెళ్ళి దాన్ని లాక్కెళ్ళారా? అర్థరూపాయికి వళ్ళమ్ము కునే అడదివొరుకుతూండగా డ్రస్సుకి, గిస్సుకి డబ్బుతగలెట్టి అంత కష్టపడ్డేపడేందుకు అది రంభా, ఊర్వశా? ఈడింత అందంగా వున్నాడు-ఆడి పెళ్ళాం రంభయితే యీడితో కాపురం సేస్తుందా-యింతకీ యీ బుద్ధి లేని పనిసేసి పీకలమీదకి తెచ్చిన ఆ యిద్దరుతమ వోళ్ళే అయితే పోలీసు డిపార్టుమెంటుకే ఎంత ప్రదిష్ట-సబ్‌యిన్‌స్పెక్టర్‌ది. అసలే ఉడుకురక్తం. కొత్తగా వచ్చాడు-యిన్నాడంటే ముందే సస్పెండ్ చేసిపారేస్తాడు ఈళ్ళ కష్టకర్మ మండిపోను....మనసులోనే వాళ్ళని తిట్టిపోశాడు....ఎంత అను కున్నా తన డిపార్టుమెంటోళ్ళు- అళ్ళ ఉద్యోగాలూడితే.... పెళ్ళాం పిల్లలు ఏం తింటారు. స్వజన పక్షపాతంతో ఆలోచించాడు గవర్రాజు. ఈ విషయం సబిన్‌స్పెక్టర్ వరకు వెళ్ళకుండా వీడికేదోచెప్పి, అక్కడికెళ్ళి మాటాడి....ఏదోచేసి కేసు, గీసు లేకుండా చెయ్యాలి....గవర్రాజు ఆలో చన అది. వీడిని తిట్టి కసిరి లాభంలేదు మంచి మాటలతో నచ్చచెప్పాలి. అనుకున్నాడు.

"సూడు....నీ పేరేటి?....ఏం చేస్తావు నువ్వు"

పెంటయ్యండి....కూలి సేస్తానండి పొద్దుల్లో, కోతల్లో, పిల్లా తాడ, యిటిక ఆంపకాడ ఎక్కడ కూలి దొరికితే ఆక్కడ సేస్తానండి."

"మరి నీ పెళ్ళాం-దాని పేరేంటి-అదీ కూలిసేస్తుందా....నీకు పిల్లలున్నారా....నీ పెళ్ళాం ఎలాగుంటుంది....ఆహా....అదికాదురా. దాన్ని గురించి సెప్పాలంటే, అడగాలంటే ఎలాగుంటదో తెలియాలి కదా...."

అంత సేపటికి పెంటయ్య మొహంలో మెరుపు వచ్చింది- "సుక్క....సుక్కలా గుంటదండి. అందరూ పెంటిగా, సన్నాసి ఎదవా, ఏహో పుణ్యం సేసుకున్నావురా సుక్కలాటి పెళ్ళానిచ్చాడురా దేముడు అంటా రండి. సుక్క నల్లగుంటే నేం అండి లచ్చిందేవి కల వుందండి దాని మొహంలో." పెళ్ళాంసంగతి చెప్తూ గర్వపడ్డాడు పెంటిగాడు "అది పొద్దులపుడు, కోతలప్పుడు కూలికెల్తదండి. ఉత్తప్పుడు యింట్లోనే మాకెంత గావాలండి, పిల్లా పీచులేరు...."

"సర్లే. సెప్పావుగా....మావోలు డ్యూటీలోకి రాగానే అడుగుతాను, అసలేటయిందో....నువెళ్లు యింటికి. నే తరువాత ఎండెక్కాక వస్తాను మీ వూరికి...."నవ్వుచెప్పే ధోరణిలో అన్నాడు గవర్రాజు.

పెంటయ్య ఒక్క క్షణం ఆలోచించాడు. తల గోక్కున్నాడు. "మరి కపిలెంటు రాసియ్యాలిగందా....మా వూళ్లో అల్లు సెప్పారు. యిన్‌స్పెక్టరుగారికి నీ పెళ్ళాంనిలా సేశారని కపిలెంటు యిచ్చిరా పో....అన్నారండి."

ఓర్ని....యీ వెధవలు తెలివిమీరిపోయారు. కంప్లయిట్ రాసివ్వాలని తెలిసేటంత తెలివి మీరారు. "పోరా- యిప్పుడేం రాసివ్వక్కరలేదు. నే మీ యింటి కొచ్చి అందరితో మాటాడి, మా పోలీసోళ్ళు నిన్న డ్యూటీలో ఎవరున్నారో అల్లని అడిగాక అప్పుడు నీ పెళ్ళాం యింకా యింటికి రాకపోతే రాసిద్దువుగానిలే." గట్టిగా దబాయిస్తే సదిన్‌స్పెకర్ వచ్చేవరకు గుమ్మం ముందు కూర్చుంటాడని నెమ్మదిగానే అన్నాడు.

అప్పుడింక తప్పదన్నట్టు, తమ దయ అన్నట్లు చేతులు జోడించి, భారంగా, భారంమీదే నన్నట్టు చూస్తూ కదిలివెళ్ళాడు.

★ ★ ★ ★

"ఎవఁడ్రా ఈ యెదవ పని సేసింది, మీ నల్గురిలో యెవఁ్రా చెప్పండి." డ్యూటీకొచ్చిన నలుగురు పోలీసు జవాన్లమీద యెగిరిపడ్డాడు గవఁ్రాజు విషయం చెప్పి, నలుగురూ బెరురుగా చూసి అడ్డంగా తలలాడించారు. మీరు కాకపోతే యింకిక్కడ! యెవరున్నార్రా....మీ నల్గురిలో యిద్దరు పెధవ పని చేశారు చెప్పండి....లేకపోతే ఎస్. ఐ. తో చెప్పి సస్పెండు చేయిస్తా-లాకప్పులో పడేయిస్తా. నీ....ఏం జన్మరా. ఆడదంటే అంతకక్కుర్తిరా, రేపుద్యోగం ఊడితే అప్పుడు తెలుస్తుంది ఆ సుకం ఏంటో....సెప్పండిరా అబద్దం సెపితే మీ పాట్లుకుక్కలుకూడా పడవు. దాని మొగుడు పొద్దుటే యిన్‌స్పెక్టరు అంటూ వచ్చి కూర్చున్నాడు ఆడ్ని ఏదోసెప్పి వదిలించుకున్నాను. నిజం సెప్పకపోతే సబిన్‌స్పెక్టర్ రాంగానే కేసు పుటప్ చేయిస్తా. మీకు తెలుసు ఎస్. ఐ. రూల్సు మనిషిని, ఈ సంగతి తెలిస్తే మీ వుద్యోగాలు వెంటనే పీకిస్తాడు. ఎదవల్లారా! రేప్ కేస్‌మీద కనీసం మూడేళ్ళు జైల్లో కూకోవాలి. అందులో పోలీసోడు అంటే మరి స్పెషల్గవడ్డిస్తారు జడ్జి. సెప్పండిరా దొంగ నా కొడకల్లారా" తరౌంచుకుని చెక్క మొద్దుల్లా నిల్చున్న వాళ్ళని చూసేసరికి గవఁ్రాజు తిక్క మరింద రేగింది. "ఏరా....అప్పిగా....వరేయ్, సెప్పు....నీ పనేనా యిది" అప్పల కొండ నల్ల బడిన మొహం, కళ్ళల్లో బెదురు సూడగానే పోల్చుకున్నాడు గవఁ్రాజు. ఎదవ పని సేసినాడి మొగం లావుంది ఏ కోర్టులు, ఏ జడ్జీలు అక్కర లేదు నిజంలాగడానికన్నది గవఁ్రాజు థీరీ. అతని సర్వీసులో దోషెవరో మొఖం చూసి పోల్చగలడు. కోర్టులో సాక్ష్యాలు కావాలంటే అది వేరే సంగతి. అప్పలకొండ దగ్గరకి వెళ్ళి...."ఊ....ఏరా వళ్ళు కొవ్వు బలిసిందేట్రా. ఏదవా, సేసినా దొరక్కుండా సేయాలిరాసన్నానీ.... పోలీసుడ్రస్సేసుకెళ్ళి పబ్లిక్‌గా అడదాన్నట్టుకెడితే ఎవరూ ఏం సేయరనుకున్నావేట్రా.... రూపాయి డబ్బులకి దొరికే ఆడకూతుర్లుండగా....ఆ

సన్నాసిగాడి పెళ్ళాం కావలసివచ్చిందిరా. దాని మొగుడూరుకుంటాడను కున్నా పెట్టా.... యిప్పుడాళ్లూ తలిపిమీరిపోనారు. కేసెడితే ఏం సేస్తా వురా....ఇంతకీ రెండో వాడెవడో....ఏరా నర్సింలూ....ఇద్దరూ తోడు దొంగలనుకున్నారా....పదండిరా మీకు మూడిందిరా. అందుకే ఎదవబుద్ధు లొచ్చాయి....సెప్పండిరా. యింత మందుండిగా దానిమీద మీ కళ్లెలా పడ్డాయిరా. అంతా సెప్పండి-అబద్దాలాడితే తొక్క చింపేస్తా....గవర్రాజు చేతులు వెనక్కి పెట్టి సీరియస్‌గా పచార్లు చేస్తూ అన్నాడు గవర్రాజు లుంగీలోంచి డ్రస్సులోకి మారిపోగానే కానిస్టేబిల్ శీని వచ్చింది. "డ్యూటీలో వున్నాను. అబద్ధం సెపితే లాఠీతో కుళ్ళబొడతాను. అందరినీ కొట్టాను- ఇప్పుడు మీమీద రుచి చూద్దురుగాని" నోరు మూసుకుని నీళ్ళు నములుతున్న ఇద్దరినీ చూశాడు. చెప్పండన్నట్టు.

"సుక్క బాగుంటుంది...." నసిగాడు అప్పలకొండ.

"బాగున్న ఆడోళ్ళందరితో తొంగుంటావా....చెమడా లూడగొడ తాను. బాగున్న వాళ్ళందరితో పడుకుంటే...." కన్నెర్రజేశాడు గవ ర్రాజు.

"అసలు నీకళ్ళ ఎప్పుడు పడింది?"

"ఓసారి....సంతకెళితే....అక్కడ సూశా" గొణిగాడు.

"సూసి మోహించేశాడు. పెద్ద మొగుడు బయలుదేరాడు, ఏరా నర్సింలూ నువ్వేలా చూశావు?"

"అప్పలకొండ చూపించాడు....చూపించి...." భయంగా ఆగిపో యాడు నర్సింలు. "ఊ....ఇద్దరూ కలిసి ప్లానేసి గుడిసెలో జొరలాక్కెళ్దా రన్నమాట....ఎక్కడికి తీసికెళ్ళారు-రాత్రంతా అది ఇంటికి రాలేదన్నాడు దాని మొగుడు-ఎక్కడ దాచారు దాన్ని-"

అప్పలకొండ, నర్సింలు మొహాలు చూసుకున్నారు...."ఎలిమెంటరీ స్కూలు పాకలో...." అన్నారు ఎర్రబడిన మొహాలతో.

"మీరు లక్ష్మీడికి తీసికెళ్ళడం ఎవరూ చూడలేదా?"

"రేపు చీకటపడ్డాది-ఆ స్కూలు కాసంత దూరంగా వుంది వూరికి. ప్రేతాత్మ అనగానే అంతా బయపడి మా ఎనక ఎవరూ రాలేదు...."

"మరి అది తెల్లారేదాకా యిల్లు చేరలేదన్నాడు వాడు"

"మేం యిడిసిపెట్టగానే పరిగెత్తి అరిచి గోలచేస్తుందని...." చీకటి మాటున వేడిరక్తంలో చేసిన పాపపు పని. తెల్లారి వెలుగులో చెప్పకోవా లంటే వాళ్ళిద్దరికీ మొహాలు చెల్లడంలేదు-చెప్పకపోతే మరింత శిక్షిస్తారని చెప్పకా తప్పలేదు-"కాళ్ళు తాడెట్టి కట్టేసి వచ్చాం...." తలలు దించుకుని చెప్పారు. గవర్రాజు బీడీ తీసి తుపుక్కున ఉమ్మాడు. "ఛీ....ఒక ఆడ కూతురిని కట్టేసి అంబోతుల్లా....ఛీఛీ మీకురిశిక్ష వేసినా పాపంలేదు" ఛీత్కారంచేస్తూ అన్నాడు. ఇద్దరి మొహాలూ మరింత వంగాయి.

గవర్రాజు సర్వీసంత వయసున్న వాళ్ళిద్దరు చేసిన పనిని అతను క్షమించలేక పోయినా....తనకింద పనిచేసేవాళ్ళు, డిపార్టుమెంటుకే మచ్చ పడే ఆ పని చేసిన ఆ యిద్దరినీ బయటపడేస్తే అవమానం తమదేకదూ— జరగకూడనిదెలాగో జరిగింది- ఇప్పుడు వీళ్ళ ఉద్యోగాలు పీకించి పెళ్లాం పిల్లల్ని పస్తులుంచితే ఆ పాపం తనది కాదూ కోపం ఆవేశం తగ్గాక.... అరగంటసేపు గదిలో పచార్లుచేసి ఆలోచించాడు గవర్రాజు.

★ ★ ★ ★

ఆ పాలెంలో....వూరందరికీ తెల్లారినా పెంటయ్య ఇంట్లో తెల్లార లేదు. పొయ్యిలో పిల్లి లేవలేదు. తెల్లారి పోలీసు స్టేషన్‌కి నడిచివెళ్ళి- కాళ్ళీడ్చుకుంటూ వచ్చి, చుక్కి జాడ కానరాక దిగులుగా, నీరసంగా, నిస్త్రాణగా నక్కి మంచంలో కుక్కిన పేనులా వాలిపోయాడు. చుక్కి తన చుక్కిని ఆ పోలీసులు లాక్కెళ్ళి ఏం చేశారో, ఎందుకు లాక్కె ళ్ళారో, ఎంత చదువు సంధ్యలేక జ్ఞానంలేని వారయినా, రాత్రంతా రాలే పంచే అతని మనసు జరిగిన సంగతి గ్రహించగల్గింది. దిక్కుతోచని

వాడిలా మంచంలో పడుకున్నవాడిని యిరుగు పొరుగు వచ్చి ఓదార్చ సాగారు. పది గంటలయ్యాక స్కూలుకెళ్ళిన పిల్లలు కట్టిపడేసి వున్న సుక్కిని చూసి కట్లిప్పి పరుగున వచ్చి పెంటయ్యకా వార్త చెప్పారు.

కట్లిప్పినా, కాళ్ళు రానట్టు నడవలేనట్టు నడిచివెళ్ళి అందరినీ చూడలే నన్నట్లుగా చుక్కి అక్కడే కూలబడింది. పరుగున వచ్చిన పెంటయ్యకి పెళ్ళాన్ని చూడగానే కడుపులో దేవినట్లయింది. చక్కని చుక్కి ఒక్క రాత్రికే చిక్కిపోయినట్టు- వాడిన తోటకూరకాడలా, పీల్చిన చెరకు పిప్పిలా, రసం జుర్రేసిన మామిడి పండులా....చక్కని చుక్కికి దిష్టి తగలకుండా పెట్టినట్లు బుగ్గన గాట్లతో, మచ్చలలో కనిపించిన పెళ్ళాన్ని చూసి-మరి చూడలేక తల దించుకున్నాడు. మొగుణ్ణి చూసిన చుక్కి మొగంలో మిగిలిన రక్తం కాస్తా యింకిపోయినట్లయిపోయింది. రాత్రంతా ఏడ్చి వాచిన కళ్ళు ఏడవటం ఆపి మొండికేశాక నిలువుగుడ్లు పెట్టుకు చూస్తూండిపోయింది. రాత్రంతా శతకోటి దేవుళ్ళని పేరు పేరున రక్షించ మని పిలిచి పిలిచి అలిసిపోయిన ఆ నోట్లోంచి మరి మాట పూడి పడిపో లేదు. భయపడాల్సినదంత నిన్నే అయిపోయింది. ఇంకే భయం. ఇంకెం దుకు భయం! భయపడాల్సింది మొగుణ్ణి చూసి కాదన్నట్టు చుక్కి రెప్ప వాల్చకుండా చూస్తూండిపోయింది. చుక్కి పిచ్చిచూపులు చూడగానే పెంటయ్య "సుక్కీ ఏటయిందే. ఏం చేశారే ఆ ఎదవలు ఏటే అలా సూస్తావు" అంటూ కలవరంగా అడిగాడు. నోరిప్పని చుక్కిని ఎలా మాట్లా డించాలో పెంటయ్యకి అర్థంకాలేదు. "భయపడిపోనాదిరా ఆడకూతురు. దానిని- ఇంటికి తీసుకెళ్ళు- నెమ్మదించాక చెపుతుంది" ఓ ముసలాడు అన్నాడు. "సుక్కీ రాయే ఇంటికెడదాం" చెయ్యి పట్టుకు నిల్చోపెట్టాడు. నిలబెడితే నిలబడింది. నడిపిస్తే నడిచింది. ఇంటికి తీసికెళ్ళి కూర్చోపెడితే కూర్చుంది. ఆ వాడవాడంతా గుడిసె ముందు మూగారు. సుక్కిని చూసి కొందరు జాలిపడ్డారు— కొందరు వింతగా, కుతూహలంగా చూశారు. కొందరు చెవులు కొరుక్కున్నారు. ముసలాళ్ళు కొందరు లోపలికెళ్ళి చుక్కిని బుజ్జగించి, ధైర్యంచెప్పి మాట్లాడించాలని చూశారు. జరిగిందొక

ఎత్తు, జరుగుతున్నది ఒక ఎత్తులాగా బతుకు బట్టబయలు అయి నలుగురి ముందు గుడ్డప్పగించి చుక్కని నిలబెట్టినట్లు విలవిల్లాడిపోతున్నాడు పెంటయ్య. చూడొచ్చిన వాళ్ళని చూడద్దనలేక, పొమ్మనలేక, మా బతుకు మమ్మల్ని బతకనీయండి అని అనలేక, ఏం చెయ్యలేనివాడిలా చేతులు ముడుచుకుని గుడిసెముందు కూర్చున్నాడు పెంటయ్య.

అదే సమయంలో దుష్టశిక్షణ, శిష్టరక్షణే మా ధ్యేయం. న్యాయ రక్షణకే మేమున్నాం- అన్నట్లుగా గవర్రాజు, నలుగురు పోలీసులని వెంట బెట్టుకు వచ్చాడు. ఆ ఐదుగురు బూట్ల టకటకలతో ఆ పల్లెలో ఇల్లు అదిరిపోయి కెలికిన చీమల పుట్టలోంచి చీమలు వచ్చినట్లు గుడిసెల్లోంచి జనం బయటకు వచ్చి కుతూహలంగా చూడసాగారు గవర్రాజు మిలిటరీ పేరేడ్ చేయిస్తున్న సైనికాధికారిలా ఇటు, అటు చూడకుండా పెంటయ్య చెప్పిన గుర్తున్న వారి దగ్గరకి వచ్చాడు. అక్కడ మూగిన గుంపు పోలీసులని చూడగానే రాయిపడిన నీళ్ళమాదిరి చెదిరిపోయారు. గుంపు చెదర గానే గుడిసెముందు అప్పుడే ఇంట్లోంచి శవం వెళ్ళినట్టు దిగులుగా, దీనంగా కూర్చున్న పెంటయ్యని చూసి చరచర అటు నడిచాడు గవర్రాజు సిబ్బందితో. "ఎవర్రా మా పోలీసోళ్ళు నీ పెళ్ళాన్ని అట్టుకెళ్ళారని చెప్పినవాళ్ళు. ఎదవనాయాళ్ళ మీకేం పనిపాటలేక మా పనులు సెడగొడ తారు. ఎవర్రా ఆళ్ళని రమ్మను. ఇదిగో మా జవాన్లని యీడ్చుకొచ్చాను. సూపమనరా ఇందులో ఎవరో. ప్రతివోడికి పోలీసోడు లోకువయిపోనాడు. పోలీసోడు వూ అంటే తప్పు, ఆ అంటే తప్పు. డ్యూటీసేస్తే తప్పు. సేయకపోతే తప్పు. డ్యూటీసేసి యెవడికన్నా పనిష్మెంటిస్తే యెందు కిచ్చావంటాడు. పైవోడు గమ్మునూరుకుంటే యెందుకూరుకున్నావంటాడు యెవడో కాకీ డ్రస్సేసుకు వస్తే అడు పోలీసోడే- కాకీ డ్రస్సేసుకొచ్చిన ప్రతి అణాకాని ఎదవా పోలీసోడే! నీ పెళ్ళాంమీద మోజున్న ఏ రవుడీ ఎదవలో, పోలీసు డ్రస్సేసుకు వస్తే ఎవరూ ఏటీ అనరని తొడుక్కుని వచ్చుంటారు- రాత్రంతా దాంతో పడుకుని వుంటారు- మీ మాటలు నమ్మి మా యిన్స్పెక్టరికి కంప్లైయింట్ చేశా. అయన నామీద పైరయిపోయి

ఎవరు సూశారో తెలసట్టుకు పోలీసు స్టేషని కీడ్సుకురా. అక్డే అబద్దం ఆడారో, యీ ఎదవలే సేశారో తేలుస్తా అని సిందులు తొక్కాడు. ఇదిగో యీల్లిసట్టుకు వచ్చా—సెప్పండి యీలలో ఎవరో. అబద్ధాలాడితే తొక్క చీరేస్తా- సరిగా సూసి సెప్పండి. అబద్ధం సాచ్యానికి అర్నెల్లు జైలు శిచ్చ సూసినవాళ్ళు నాతో పోలీసు స్టేషన్‌కి రండి. ఊ రండి. ముందుకొచ్చి ఈ నలుగురిలో ఆ ఇద్దరున్నారేమో సూసి సెప్పండి" వస్తూనే గవర్రాజు చూపించిన 'కానిస్టేబిల్ ఛాటీ'కి అక్కడ గుమిగూడిన అంతా మొహాలు చూసుకున్నారు. గుసగుసలాడడానికి కూడా భయపడి గమ్మున ఊరకున్నారు. "ఏరా నీ పెళ్ళాం ఇంటికొచ్చిందా. దాన్ని పిలు" జరగాల్సిన అన్యాయం జరగనే జరిగింది-కానిస్టేబిల్ వచ్చినా, క్యాబినెట్ మినిస్టర్ వచ్చినా జరిగేదేం వుంది అన్నట్టు నిర్లిప్తంగా జరుగుతున్నది ఏదో వింతలా చూస్తూ కూర్చున్నాడు పెంటయ్య- "ఏరా మాట్లాడవేం నీ ఆడదింటికి వచ్చిందా?"

"వచ్చింది బాబూ వచ్చింది - చక్కని చుక్కలా వెళ్ళిన పక్షి - చింపిన విస్తరిలా వచ్చింది బాబూ" అని అనాలనుకున్నాడు పెంటయ్య - కానిస్టేబుల్‌ని. ఆ చేతిలో లాఠీనిచూసి అనలేక తలాడించాడు - "నే చెప్ప లేదురా, ఎటో వెళ్ళిందదే వస్తుందిలే అని...."

"లేదు బాబూ అది రాలేదు. స్కూల్లో కట్టిపడేస్తే తెచ్చాం బాబూ. కానిస్టేబుల్ బాబూ దాని బతు కన్యాయం సేశారు. యెవరు సేశారో దేముడికెరిక. అది మాట పలుకు లేకుండా కూకుండిపోయింది. న్యాయం చెయ్యండి దొరా" ఒక ముసలాడు ముందుకువచ్చి అన్నాడు.

"నాయం సేయాలంటే సాచ్చికం వుండాలి. సాచ్చెం చూపండిరా. ఈళ్ళే సేశారని యెవరొచ్చి చెప్తారో చెప్పండిరా" అంతా మొహాలు చూసుకున్నారు తప్ప ముందుకు రాలేదు. పెంటయ్య ఉలుకు పలుకు లేకుండా నిల్చున్న అందరిని చూశాడు. "సూకాలప్పా- మాలచ్చిమ్మ నిన్న సూశాం అన్నారుగందా ఈళ్ళల్లో ఎవరో సెప్పండే...." అన్నాడు దీనంగా. సూకాలు, మాలచ్చిమి ఎదురుగా పోలీసులని చూశారు- వాళ్ళ మొహాలు

వాళ్ళు మాసుకున్నారు. "ఏటో.... ఎవరో మాకే బెరిక- సందెకాడ వచ్చి నారు- పోలీసులని చూశాంగాని మొకాలు మాకేటి గుర్తు" నసిగింది నూకాలు. పోలీసులు స్టేషన్‌కెళ్ళి చెప్పాలి అనగానే బెదిరిపోయారు వాళ్ళు. గవర్రాజు మహా ఉదారంగా నలుగురిని తీసికెళ్ళి వాళ్ళముందు నిలబెట్టాడు. "సూడండి- యీడా....వాడా.... ఎవరో సరిగ్గా సూడండి" నలుగురినీ చూపిస్తుంటే యిద్దరు నలుగురిని చూసి అవునంటూ తల ఊపారు- కాసేపు కాదంటూ తలలూపారు. "యీల్లి సాచ్చికాలట్టుకుని కోర్టు కెక్కితే అయి నట్టే- గంగిరెద్దుల్లా తలలూపుతున్నారు. అవునా అంటే తల వూపు తున్నారు. పొండెపాస్.... మాకేటి పని పాట నేటనుకున్నారేంటి- పెంటయ్యా నీ పెళ్ళాం నీ యింటికొచ్చింది సాచ్చికం లేందే కేసెట్టడాని కవదు ఈల్లే సేశారని సాచ్చికం సూపిస్తే చెప్పు ఇన్‌స్పెక్టరు బాబుకాడ కంప్లైంట్ రాసిద్దువుగాని" చాలా నెమ్మదిగా, సౌమ్యంగా అన్నాడు. పెంటయ్య వెర్రిమొహం పెట్టి చూశాడు. తర్వాత అదోలా నవ్వాడు చేతు లెత్తి కనిపించని దేవుడికి దండం పెట్టాడు. "బాబూ కని పెట్టి సూడాల్సిన ఆ బగమంతుడే కనుసాటు చేశాడు యింక మీరేటి సేస్తారు. న్యాయం, అన్యాయం సూడాల్సిన ఆ బగమంతుడే వల్లకున్నాడు యింక కోర్టులో కేసులు ఎటవానికి నాకెవరున్నారు బాబూ! నిజం సెప్పాల్సిన సుక్క నోరు ఆ దేవుడే మూయించి సేసినోల్లపచ్చం అయిపోనాడు. సాచ్చికాలు సెప్పాల్సినోళ్ళు నాయానికి, నిజానికి బయపడి మాట తప్పించినారు వదిలేయి బాబూ మమ్మల్నిట్టా వదిలేయి బాబూ! ఎల్లండి బాబూ ఎల్లండి" చేతులెత్తి నుదుటి తాటించి ఎవరో తరుముకొస్తున్నట్టు లోపలికెళ్ళిపోయాడు పెంటయ్య.

గవర్రాజు విజయగర్వంతో చుట్టూ చూశాడు. ఇంకెవరన్నా నోరెత్త డానికి మిగిలారా....ఎవరొస్తార్రా ముందుకు తొక్కచీలుస్తా అన్నట్టు గుంపుని చూశాడు. అంతా వెనక్కడుగులేశారు. గజరాజులా గవర్రాజు ముందడుగువేసి కదిలాడు.

★ ★ ★ ★

నాటకం అయిపోగానే బట్టలిప్పేసి వేషాలు తీసేసినట్లుగా.... పోలీసుస్టేషన్‌కి రాంగానే నలుగురూ కాకీ బట్టలిప్పేసి, ఎర్రటోపీలు తీసి పారేశారు. అప్పలకొండ చేసిన తప్పు కడుక్కున్నట్టుగా వాళ్ళకి తలో ఐదు చేతిలో పెట్టి పంపాడు. లుంగీలతో, అండర్‌వేర్లతోవున్న ఆ నలుగురు మళ్ళీ తమ డ్రస్సులు తొడిగేసుకున్నారు.

గుర్తడితే- ఎదవల్లారా మీ సాచ్చికం యిదా. మీరేటంటారోనని యీదనపోయే నల్గురికి డ్రస్సేసి తీసుకొచ్చాను. ఎదవలారా కాకీ డ్రస్సేసుకున్న ప్రతివోడు పోలీసోడు కాదురా ఎవర్ని సూసి మా వోల్లంటార్రా. తప్పుడు సాచ్చికం చెప్పేసందుకు పదండి పోలీసుస్టేషన్‌కి అని దాబాయించాలని–గుర్తట్టకపోతే నాలుగు తిట్టి బెదిరించి వచ్చేయాలని- గవర్రాజు పెద్ద బుర్రకి తట్టిన పెద్ద ఆలోచన.

"వెదవల్లారా, ఆల్లు పల్లెటూరోళ్ళు సదూకోనోళ్ళు అని బతికిపోనారు. నేకపోతే మీ ఉద్యోగాలూడి జైల్లో కూకునేవారు" గజేంద్రుడు ప్రార్థించగానే వెళ్ళి సహాయం చేసివచ్చిన విష్ణుమూర్తిలా బెంచిమీద తల కింద చెయ్యిపెట్టి శేషశాయి పోజులో పడుకున్న గవర్రాజు గర్వంగా అన్నాడు. నిజమే ఆపద్బాంధవుడివి, అనాధ రక్షకుడివి అన్నట్టు అప్పలకొండ వినయంగా ఐదు మైళ్ళు నడిచివచ్చిన గవర్రాజు కాళ్ళు వత్తాడు.

గవర్రాజు 'కంచె'ని రక్షించుకున్నాడు. రక్షించాల్సిన 'చేను' మాట మరిచిపోయి. 'చేనే' లేనపుడు 'కంచెం'దుకు- అన్నది గవర్రాజు బుర్రకి తట్టదు. ఆ బుర్ర పెద్దదయినా బుద్ధి పెద్దదిగాదు మరి.

(ఆంధ్రజ్యోతి వార పత్రిక)

—0—

# వేట

దట్టమైన దండకారణ్యం మధ్య రోజూ చీకట్లో నిశ్శబ్దంగా నిద్ర పోయే "మల్కానగిరి" ఫారెస్ట్ గెస్ట్‌హౌస్ ఆరోజు కలకలలాడిపోతూంది. బయట వరండాలో పెట్రోమాక్స్ లైట్ దేదీప్యమానంగా వెలిగిపోతూంది. బయట రెండు జీపులు నిలబడి వున్నాయి. నలుగురు ఫారెస్ట్ గార్డులు బయట సాయుధులై నిలబడ్డారు. నలుగురు ఫారెస్ట్ రేంజర్లు ఒకచోట నిలబడి కబుర్లు చెప్పుకుంటున్నారు. ఇద్దరు డి.ఎఫ్.వో.లు బయట వరండాలో కుర్చీల్లో కూర్చొని కబుర్లు చెప్పుకుంటున్నారు. వెనక కిచెన్‌లో కోళ్ళ పీకలు తెగిపోతున్నాయి. మసాలా వాసనలు ఘాటుగా పైన కూర్చున్న వాళ్ళకి నోరూరిస్తున్నాయి. ఆ వాసనలు పసిగట్టి నాలుగైదు కుక్కలు ఆరాటంగా తోకాడించుకుంటూ తిరుగుతున్నాయి.

ఎవరయినా ఫారెస్ట్ ఆఫీసర్లు టూర్లమీద వచ్చినపుడు తప్ప మిగతా టైములో ఆ డాక్ బంగళా నిశ్శబ్దంగా నిద్రపోతున్నట్టుంటుంది. అడవి మధ్య వుందేమో మిగతా డిపార్టుమెంటులవారు ఎంతో అవసరం అయితే తప్ప అక్కడ విడిది చేయరు. ఫారెన్ డిపార్టుమెంటు వారయినా షికారీ కరవాకి వచ్చేవారే అక్కడ క్యాంప్ చేస్తూంటారు. శీతాకాలం విపరీతమైన చలి. వర్షాకాలం కుంభపోతగా వర్షం. ఎండాకాలం మాత్రం చాలా హాయిగా వుంటుందేమో అప్పుడు మాత్రం ఎక్కువమంది ఆఫీసర్లు టూర్ మీద వస్తుంటారు.

ఈరోజు ఈ ఆర్భాటానికి హడావుడికి కారణం కన్సర్వేటర్ ఆఫ్ ఫారెస్ట్‌గారు టూర్ వేంచేస్తున్నారు. ఆయనగారి టూర్ ప్రోగ్రాం అందుకో గానే ఆ జిల్లా ఫారెస్ట్ ఆఫీసర్‌గారు కాంట్రాక్టర్‌గారితోచెప్పి చెప్పనట్లు అధికారిగారి ఆగమన వార్త చెప్పారు. ఆ మాత్రం చెపితే కాంట్రాక్టరు

సకలమైన ఏర్పాట్లు చేస్తాడని ఆయనకి తెలుసు. లేకపోతే గవర్నమెంట్ ఇచ్చే జీతాలతో వారికి రాజ లాంఛనాలు ఏర్పాటు చెయ్యాలంటే మాటలు గాదని తెలుసు.

ఆ కాంట్రాక్టర్‌కి ఇది కొత్తగాదు. ఏ ఫారెస్ట్ ఆఫీసర్ టూర్ వచ్చినా వారి వారి తాహతులనుబట్టి వారికి కావాల్సిన ఏర్పాటులు చెయ్యడం తన డ్యూటీలో ఒక భాగంగా చేసేస్తూంటాడు. అందులో ఈరోజు వస్తున్నది కన్సర్వేటర్‌గారు. అదీ కొత్త కన్సర్వేటర్- ఈ జిల్లాకి రావడం ప్రథమం. అందుచేత ఏర్పాటులు చాలా ఘనంగా చేశాడు. అరడజను కోళ్ళు, రెండు మేకలు తెచ్చి పెరట్లో కట్టేశాడు. ఫారెన్ విస్కీబుడ్లు ఏర్పాట్లు అయ్యాయి. ఆయనేకాక ఇద్దరు మిత్రులొస్తున్నారని మూడు మంచాలు వేయించి. డన్‌లప్ పరుపులు వేయించాడు కొత్త దుప్పట్లు, తువాళ్ళు, చాకింటి కర్టెన్లు, స్పెషల్ సబ్బులు, వేడినీళ్ళు పళ్ళెళ్ళ అన్నీ పకడ్బందీగా ఏర్పాటయ్యాయి. కన్సర్వేటర్‌గార్ని ప్రసన్నుడిగా చేసుకో వల్సిన అవసరం చాలా వుంది. ఆ ఏరియాలో అడవిలో పిచ్చిమొక్కలు, పనికిరాని వృక్షాలు కొట్టించి చదునుచేసి టేకు, దేవదారు, కలప మొద అయిన మేలుజాతి చెట్లు నాటాల్సిన పని సాలుకి మూడులక్షల రూపాయల కంట్రాక్టు వుంది. ఆ జిల్లా డి.ఎఫ్.ఓ. అతనికి కొరుకుడు పడడంలేదు. పెద్ద పిట్టనే పడితే ఇంక ఆ డి.ఎఫ్.ఓ. ని లెక్కచెయ్యనక్కరలేదు. ఆ మూడులక్షల ముందు ఈనాటి ఖర్చు కంట్రాక్టర్‌కి ఓ లెక్కకాదు.

ఆ కంట్రాక్టర్ పేరు యన్. పట్నాయక్. పూర్వాశ్రమంలో తెలుగువాడయినా తరతరాలుగా ఒరిస్సాలో స్థిరపడి ఒరియావాడిగా మారి పోయాడు. ముందు ఫారెస్ట్ గార్డుగా చేరినపుడు సుబ్బయ్యగా వుండి, రేంజరయ్యాక సుబ్బారాయుడిగా మారి రేంజర్‌గా వున్నప్పుడు అందిన మేరకు నాలుగు రాళ్ళు పోగుచేసుకుని ఉద్యోగం మాని చిన్న చిన్న ఫారెస్ట్ కంట్రాక్టులతో మొదలుపెట్టిన పదేళ్ళలో ఆ ప్రాంతాలు పెద్ద ఫారెస్ట్ కంట్రాక్టరై సుబ్బారావు పట్నాయక్ అల్లా ఎన్. పట్నాయక్‌గా మిగిలాడు.

తెలుగు ఆఫీసర్లతో తెలుగు వాడినని, ఒరియా వాళ్ళతో ఒరియావాడిననీ చెపుతూ ఎవరికి ఏది ముట్టచెప్పి ఏది రాబట్టాలా వగైరా కంట్రాక్టులోని మెలకువలు నేర్చుకుని తెలివిమీరిపోయారు-ఏ ఆఫీసరు టూరు మీద వచ్చినా అక్కడ ప్రత్యక్షమయి వారి అవసరాలు వెయ్యికళ్ళతో కనిపెట్టి అందరికీ ప్రీతిపాత్రుడయ్యాడు.

ఈ కొత్త కన్సర్వేటర్ రమాకాంత్ మిశ్రా షోకిల్లా పురుషుడు-స్ఫురద్రూపి. సరసుడు అంటే-మధిరతో పాటు మదవతిలేనిదే వుండ లేడని, ఎప్పుడూ ఫ్రెండ్సు క్లబ్బులు, పార్టీలు, షికారీలు-అంటూ జల్సాగా కాలక్షేపం చేసేరకం అని- బీదరికంతో పుట్టి, ఆ కారణంగా చదువుకోసం చిన్నతనంలోనే డబ్బుకోసం ఓ కోతిని పెండ్లాడి ఇల్లరికం వెళ్ళి, మామ గారి డబ్బులో చదువుకుని పైకివచ్చి, ఇంట్లో కోతి భార్యతో, అందంలేక పోయినా చదువు సంస్కారం లేని పల్లెటూరి గయ్యాళి భార్యని భరించ లేక, భరించక చేసేదేంలేక ఆయన యింట్లో దొరకని ఆందాన్ని, ఆనం దాన్ని బయట అనుభవిస్తాడని, ఏ డబ్బు కారణంగా అతను జీవితంలో నష్టపోయాడో ఆ డబ్బు మీద కసితో రెండు చేతులా అందిన చోటల్లా పుచ్చుకుని జీవితాన్ని అనుభవించి ఆనందించడమే ధ్యేయంగా పెట్టుకుని యింట్లో పెళ్ళాంనించి తప్పించుకుని ఎప్పుడూ టూర్లు, లేక ఫ్రెండ్సు, క్లబ్బులలో కాలక్షేపం చేస్తాడని చాలా వివరాలే సేకరించాడు పట్నాయక్. అంతేకాక తన రూపంతో, మాటలతో ఏ స్త్రీనైనా ఆకర్షిస్తాడని ఏం చేస్తాడో. ఎలాచేస్తాడో ఎలాంటి ఆడదాన్నైనా బుట్టలో పడేట్టు ఇంద్రజాలం చేస్తాడు. అతని వీక్ నెస్ ల గురించి కిందామీదా అధికారులకీ, మిత్రులకి అందరికే తెలుసు. అతనిలో ఈదుర్గుణాలన్నీ అతని మాట నేర్పరితనం, అతని పెర్సనాలిటీ, అతని స్నేహ ప్రియత్వం చాటున మరుగు పడిపో తాయి. అతనెక్కడ వుంటే అక్కడ ఉల్లాసం, ఉత్సాహం చిందులు వేస్తుందని-పది మందిని చుట్టూ వేసుకుని వుంటాడనీ తెలుసుకున్నాడు. అతనికి వేట హాబి. వేటమీదమనసుపోయినప్పుడల్లా తన జ్యూరిస్‌డిక్షన్‌తో

ఏ అడవిలోనో టూర్ ప్రోగ్రాం వేసుకుంటాడు. ఆతనిప్పటికి నాలుగు పులు లని చంపాడు. మిత్రులందరికీ పులి-చర్మాలు, గోళ్ళు, ఖుర్రలు, దుప్పి కొమ్ములు, జింక చర్మం వగైరాలు ప్రెజంట్ చేస్తూంటాడు. ఇతర డిపార్ మెంటు ఆఫీసర్లెవరికైనా వేట చూడాలని వుంటే చాలు రమాకాంత్‌ని అడి గితే చాలు మహదానందంగా వెంట పెట్టుకువెళ్ళి సకలమైన మర్యాదలు జరి పిస్తాడు.

ఈ సమాచారం సేకరించి దానికి తగ్గ విధంగానే అన్ని ఏర్పా టులు చేశాడు పట్నాయక్. దొరవారు టూర్ ప్రోగ్రాం ప్రకారం జయ పురంనించి సాయంత్రం బయలుదేరి ఏడు గంటలకి చేరాలి.

★ ★ ★ ★

బయట జీపు హారన్ వినగానే వాచ్‌మన్ పరుగెత్తి గేటు తీశాడు- గార్డులు ఎటెన్‌షన్‌లో నిలబడి సెల్యూట్ చేశారు. రేంజర్లు వినయంగా నమస్కారాలు చేశారు-డి. ఎఫ్. వో. లు మెట్లుదిగి ముందుకు వచ్చి నిల బడ్డారు-వంటలని పర్యవేక్షిస్తున్న కాంట్రాక్టరు పరుగున పీధి వరండా లోకి వచ్చాడు.

కన్సర్వేటర్‌గారు, మిత్రులిద్దరూజీపుదిగారు. మరోజీపునించి వారితో పాటుటూర్ చేస్తున్న మరిద్దరు డి.ఎఫ్.వో.లు దిగారు. అందరి నమస్కా రాలు అందుకుని హుందాగా తల పంకించి మిత్రులతో వరండాలోకి నడచి కుర్చీలో ఆసీనులయ్యారు. ఆఫీసర్లని పరిచయం చేసుకుని లాంఛనంగా పది నిమిషాలు ఆఫీసు విషయాలు డిస్కస్ చేసి "ఆల్ రైట్- వుయ్ విల్ మీట్ ఎగైన్. టుమారో మార్నింగ్ ఎట్ టెన్" అని లేచి లోపలికి వెళ్ళి పోయాడు. నాల్గుగంటలనించిపడిగాపులుపడివున్నడి. ఎఫ్.వో. లుమొహాలు చూసుకున్నారు. వచ్చినట్లు మళ్ళీ రావాలని మొహాలు చూసుకుని మెట్లు దిగారు. అక్కడ క్యాంప్ చెయ్యడానికి వున్నది ఒకటే డాక్ బంగళా, ఏ కోరాపుటో, జయపూర్ వెళ్లి రాత్రికి వుండి మళ్ళీ రావాలి- ఈ కన్స ర్వేటర్‌గారు టూర్ రెండు రోజుల్లో పని రెండు గంటలు, షికార్ రెండు

రోజులు చేస్తారని వినే వున్నారు. కనుక ఏం చెయ్యలేక మనసులో తిట్టు కుంటూ వెళ్ళారు.

"తమరు కాస్త 'టీ' తీసుకుంటారా?" కంట్రాక్టరు వినయంగా అడి గాడు. రమాకాంత్ వాచ్‌చూసి"టీవద్దు, ఏడున్నరయింది. ముందు స్నానం చేసి.......తరువాత...."

"ఆ....ఆ. ఆ ఏర్పాటులు చూశానండి. గదిలో వేడినీళ్ళు సిద్ధంగా వున్నాయి. డిన్నర్ ఎన్నింటికి సార్."

"పది గంటలకి. ఆ....మీరు?" ఎవరన్నట్టు చూశారు.

"చిత్తం. నా పేరు పట్నాయక్ అండి, కంట్రాక్టు పనులు చేస్తూం టాను" వినయంగా చేతులు నలుపుకుంటూ అన్నాడు.

"ఐసీ!" అన్నాడు రమాకాంత్. కంట్రాక్టరు అనగానే అతనికి అంతా అర్థం అయింది "అ....రాత్రి షికారీకి అన్ని ఏర్పాటులు జరి గాయా?"

"ఎస్ సార్."

"మాటు సిద్ధం చేశారా? మాతో రావాల్సినవాళ్ళ జీపు, ఫ్లడ్ లైట్స్, గన్నర్."

"చిత్తం అంతా రెడీ సార్."

"సరే డిన్నరయ్యాక పదిన్నర పదకొండుకి బయలుదేరుతాం" అంటూ రమాకాంత్ గదిలోకి వెళ్ళాడు.

మిత్రులు ముగ్గురూ స్నానాలుచేసి వచ్చేసరికి బయట వరండాలో పెట్రోమాక్స్ లైటుచుట్టూ కుర్చీలు గుండ్రబల్ల చుట్టూ వేయించి బాటిల్సు, ఐస్ ఫ్లాస్క్, గ్లాసులు, నంజుకోడానికి వేయించిన జీడిపప్పు, పొటేటో చిప్స్, వేరుశనగ పప్పులు, సిగరెట్ పెట్టెలు, పేక దస్తాలు ఏర్పాటు చేశాడు పట్నాయక్. ఏర్పాట్లు సంతసించి మెచ్చుకోలుగా తల ఊపి

'వెల్....కమాన్ ఫ్రెండ్స్ పది గంటల వరకు యీ అడవిలో మనకిదే కాలక్షేపం' అంటూ బాటిల్ అందుకున్నాడు రమాకాంత్.

"రమ్మీ వేద్దామా," అంటూ పేక తెరిచాడు అభిరామ్‌పండా. అభిరామ్ పండా ఐ.ఎ.ఎస్, సెక్రటరీగా ఫైనాన్స్‌లో వున్నాడు.

"మరొకరుంటే బ్రిడ్జి ఆడుకునేవాళ్ళం. ఏరి మీ డి. ఎఫ్. ఓ. ఇ. అంతా వెళ్ళిపోయారా?" అన్నాడు విభీషణ్‌మహంతి - అతను నేషనల్ హైవేస్‌లో చీఫ్ యింజనీరు, ముగ్గురూ క్లబ్ మిత్రులు.

"వాళ్ళెందుకు? నవ్వడానికికూడా భయపడి బిగపట్టుకుని ఒక్కచో చచ్చి కూర్చుంటారు. వాళ్ళకీ మనకి ఫ్రీగా వుండదు" అన్నాడు రమాకాంత్ గ్లాస్‌లో ఐస్‌ముక్కలు వేస్తూ.

రాత్రి పదివరకూ పేకాడుతూ, తాగుతూ రమాకాంత్ యిదివరలో తన వేట విశేషాలు చెప్తూ, కబుర్లతో, నవ్వులతో హోరెత్తించారు ఆ అడవి అంతా.

పదిగంటలకి డిన్నర్‌కి లేచారంతా. మటన్, చికెన్, పలావులతో పాటు సాంబార్, రసం, కొబ్బరి పచ్చడి, రకరకాలతో టేబిల్ నింపేడు పట్నాయక్!

"అరే తెలుగు వంటలు చేయించారే 'కంసమా' (ఇన్‌స్పెక్షన్ బంగాళాల్లో వంటవాడు) తెలుగువాడా?" రుచి చూస్తూ మెచ్చుకుంటూ అన్నాడు రమాకాంత్.

"కాదండి, మీకు తెలుగు వంటలు యిష్టం అని విని స్పెషల్‌గా మా ఆడవాళ్ళతో చేయించాను" కంట్రాక్టరు వినయంగా అన్నాడు.

"ఓ, ఐ సీ!" తాగిన మత్తులో తేలిపోతున్న అతనికి అంతకంటె వివరాలు అడిగి వినే ఓపికలేదు. అంతా సుష్టుగా భోం చేశారు. వాళ్ళు భోంచేసి వచ్చేసరికి, ఆరు బయట వెన్నెల్లో కుర్చీలు వేయించి పాన్, సిగరెట్లు అరేంజి చేశాడు పట్నాయక్.

"వాహ్—బలే ఎరేంజిమెంట్లోయ్, దమ్మిడి ఖర్చులేకుండా పెళ్ళివారి మర్యాదలు జరిపిస్తున్నావు మా వాడిచేత" అన్నాడు అభిరామ్. మరేమి టనుకున్నావ్ అన్నట్టు గర్వంగా చూశాడు రమాకాంత్.

వెన్నెల పుచ్చ పువ్వులా కురుస్తూంది. ఎక్కడివో అడివిపూల వాసన, డాక్ బంగళాలో మల్లెలు, నైట్‌క్వీన్ పరిమళాలు పిల్ల తెమ్మె రతోపాటు కదిలివస్తూంది. ఎక్కడో దూరంగా కొండమీదనించి దుమికే సెలయేర శబ్దం-వాతావరణం ఆహ్లాదకరంగా వుంది.

"వండర్‌ఫుల్-యిలాంటిచోట వలచి వలపించే ప్రియురాలితో విహ రిస్తే యింకెంత మజాగా వుంటుంది ఈ వెన్నెల. ఈ చల్లగాలి, ఈ పరిమళాలు, ఈ ఏకాంతం, ఓహ్ హనీమూన్‌కి సరిఅయిన చోటుకదూ-" రమాకాంత్ అసలే సరసుడు. దానికితోడు పిసరంత కవి హృదయం వుందేమో, పుచ్చుకున్న పానీయంతోపాటు పరిసరాలు మత్తునివ్వగా కలల్లో తేలిపోతున్నట్లున్నాడు.

"చంపావు ఈ అడవిలో ప్రేయసిలను కూడా ఎక్కడ సప్లయి చేస్తారు. పూర్ ఫెలోస్ ఇప్పుడు వాళ్ళనిబ్బంది పెట్టకు" రమాకాంత్ వీక్ నెస్‌లు తెల్సిన విభీషణ్ చమత్కారంగా అన్నాడు.

మన కాంత్ తల్చుకోవాలేగాని కారడివిలో కూడా కాంతల్ని సంపా దిస్తాడు, జోక్‌చేశాడు అభిరామ్.

ఆ మాట నిజం అన్నట్టు హఠాత్తుగా రమాకాంత్ నిటారుగా కుర్చీలో కూర్చుని 'అరే' అన్నారు ఆశ్చర్యంగా. అతను చూస్తున్నవైపు తక్కిన యిద్దరుకూడా ఆశ్చర్యంగా చూశారు.

డాక్ బంగళాకి ఎదురుగా కాస్త దూరంలో ఓ టెంట్ వుంది. టెంటుబయట పండువెన్నెలలో. మిల మిల మెరిసే తెల్లచీర, బారెడు నల్లటి జడ-జడలో నిచ్చిన తెల్లని పూలు-యిటు అటు పచార్లు చేస్తున్న స్త్రీమూర్తిని చూసి ముగ్గురూ ఒక్కక్షణం ఆశ్చర్యంగా అటే చూస్తుండి పోయారు.

"ఎవరీమె-కామినీమా, వనసుందరా, గంధర్వకన్యా - కలా, నిజమా, భ్రమా" రమాకాంత్ కళ్ళు చికిలించి మెలకువ తెచ్చుకుని మరో సారి చూశారు. తక్కిన యిద్దరికీ అదే అనుమానం వచ్చింది.

"ఈ అడవిలో....రాత్రి....ఎవరీమె? యిక్కడెందుకు వుంది? చాలా ఆశ్చర్యంగా వుందే. ఆ టెంటు యిందాకా మనం వచ్చినప్పుడు వుందా?" దెయ్యాల కథలు గుర్తువచ్చి అనుమానంగా అన్నాడు రమా కాంత్.

"ఏమో-మనం సరీగ్గా చూసివుండం, చీకట్లో వచ్చాంగదా" మహంతి అన్నాడు.

"అడిగేస్తే పోతుందిగా-" అన్నాడు పండా. వెనకాతల కిచెన్‌లో అంతా భోజనం చేస్తున్నారు. పళ్ళాలు గ్లాసుల చప్పుడు మాటలు విని పిస్తున్నాయి. గేటుదగ్గర ఓ గార్డు మాత్రం కనిపించాడు. రమాకాంత్ గార్డుని పిలిచాడు. టెంటువైపు చూపించి "అక్కడ....ఎవరు?....ఆమె ఎవరు?" అనడిగాడు. వాడు జవాబిచ్చేలోగా వెనకనించి పట్నాయక్ భోంచేసి గొంతు సవరించుకుంటూ వచ్చాడు రమాకాంత్ ప్రశ్నవిని ఆతను టెంట్‌వైపు ఒకసారి చూసి "హి....హి....మా ఫేమిలీలెండి" అన్నాడు నసిగి. రమాకాంత్ ఆశ్చర్యపోయాడు. "ఏమిటి ఈ అడవిలో టెంటులో ఫేమిలీతో వుంటున్నారా మీరు?" అడిగాడు. కంట్రాక్టరు వినయంగా చేతులు నలుపుకుంటూ. "అబ్బే లేదండి, యిటు ప్రాంతాలు ఎప్పుడూ చూడలేదంటే, ఈ అడవి అదీ చూడాలని సరదా పడుతూంటే నాతో తీసుకు వచ్చాను" ఏదో అపరాధం చేసినట్లు సంజాయిషీ యిస్తున్న ట్లున్నాడు.

"ఆహా....మరి టెంటులో వున్నారు భయంలేదా?"

"మరిక్కడ వసతి ఏముందండి. మీరు రాకపూర్వం గది ఖాళీ వుందని డాక్ బంగళాలో వున్నాం-మీరొస్తున్నారని ఖాళీచేసి టెంటు వేయించాను. రెండురోజుల్లో వెళ్ళిపోతాం" వినయంగా అన్నాడు. రమా

కాంత్ ఉత్సాహం ఎందుకో కరిగిపోయింది, ఏదో వింటాననుకున్నది యింత చప్పగా కంట్రాక్టరు భార్యగా తేలిపోగానే ఏదో పొంగు అణిగి పోయినట్టయింది కంట్రాక్టరు వెళ్ళగానే మరోసారి అటు చూశాడు. పంచి విగ్రహం, యింతదూరంనించే మెరిసేరంగు! చీర జాకెట్టుకి మధ్య కన్పిస్తున్నట్టున్న నడుం రంగు....యింత అందం, ఈ నల్లమొద్దు స్వంతమా ఏడికి....ఈ ఎద్దుకి....అంత అందమైన భార్యా........" మింగుడు పడని నిజంలా అన్పించింది.

"నో యూస్ మై బాయ్-ఫేమిలీ లేడీ-తన్నగలదు పిచ్చివేషాలు వేస్తే" మహంత రమాకాంత్ మొహంలో భావం చదివినట్టున్నాడు.

"ఛా....ఛా....అదేంకాదు. ఈ అడవిమధ్యలో హఠాత్తుగా స్త్రీ కనిపిస్తే కుతూహలం అన్పించింది. అంతే" అన్నాడు. రమాకాంత్ నవ్వు-తున్నంత తేలిగ్గా అతని మనసుని నమ్మించలేకపోయాడు.

★ ★ ★ ★

పదకొండు గంటలకి అంతా జీపు ఎక్కారు. జీపుకి అటు ఇటు రెండు ఫ్లడ్ లైట్స్ కట్టారు. మహంతి డ్రైవ్ చేస్తుంటే రమాకాంత్, పండా పక్కన కూర్చున్నారు, రమాకాంత్ గన్ పట్టుకుని గురిపెట్టుకుని సిద్ధంగా ఉన్నాడు. తోవలో ఏదన్నా కనిపించదా అన్న ఆశతో వెనకాతల ఒక గన్నర్, కంట్రాక్టర్, ఒక గార్డు కూచున్నారు, రెండు పెద్ద ఫ్లాస్కులనిండా టీ-బిస్కట్ల పేకట్టు, సిగరెట్ పెట్టెలు, వాటర్ బాటిల్, ఒక జంపుకానా, బ్యాటరీ లైట్లు వగైరా సరంజామా సిద్ధం చేసుకున్నారు.

"ఎంత దూరం వెళ్ళాలి మనం" రమాకాంత్ కంట్రాక్టర్ని అడిగాడు.

"ఇక్కడనించి ఆరుమైళ్ళు ఈ రోడ్డు. అ తరువాత అడవిలోకి కచ్చా రోడ్డులో నాలుగు మైళ్ళు వెళ్ళాక జీపింక వెళ్ళదు సార్, అక్కడ నించి మూడు ఫర్లాంగులు నడిచి లోపలికి వెడితే అక్కడ మాటువేయించి రెడీ చేశాను సార్...." పట్నాయక్ తోవ చూపిస్తుండగా జీపు కదిలింది.

కంకర రోడ్డు దిగగానే ఫ్లడ్‌లైట్ల వెలుగుకి జీపు చప్పుడికి భయపడి నాలు గైదు కుందేళ్ళు గాభరాగా పరిగెత్తి మాయమయ్యాయి. రెండు నక్కలు తలెత్తి చూశాయి. పోను పోను అడవి దట్టమవుతున్నకొద్దీ చెట్ల కొమ్మలు తలలకి తగులుతున్నట్లనిపించింది. నిద్రపోతున్న పక్షులు ఆ హడావిడికి లేచి ఒక్కుమ్మడిగా అరవసాగాయి. అడవి అంతా హఠాత్తుగా మేల్కొన్నట్లు అయింది. మనిషి వెళ్ళగలిగేపాటి ఆ బాటలో గతుకులలో జీపు ప్రయాణం చేస్తోంది. ఎత్తెత్తి కుదేస్తోంది. "ఓ డమ్మర గుండయినా తగలలేదు తోవలో ఈవాళ" అన్నాడు నిరుత్సాహంగా రమాకాంత్. ఓ కుందేల్ని కొట్టబోతుంటే "ప్చ....ప్చ....వద్దు వద్దు చిన్న పుటంత తెల్లగా ముద్దు వస్తోంది పాపం చంపకు- అన్నాడు అధిరామ్. మొదటిసారి ఈ షికారికి రావడమేమో ఆ యిద్దరికీ అంతా ఆశ్చర్యంగా అనందంగా వుంది. ఆ గతుకుల సన్నని బాటకూడా అంతం అయి నాలుగు పక్కల మహా వృక్షాలతో నడవడానికి కూడా తోవలేని చోటు వచ్చేసరికి జీపు ఆపేశారు. అంతా జీపు దిగారు. గన్నర్ బ్యాటరీలైటు, గన్‌తో ముందు నడుస్తూండగా గార్డు సామానులన్నీ మోస్తుండగా తలో కప్పు చలో బ్యాటరీలైట్ పట్టుకుని చెట్లకొమ్మలని తప్పించుకుంటూ కింద చూసుకుంటూ నడవసాగారు. పైన పండు వెన్నెల కురుస్తున్న ఆ దట్టమైన చెట్లని చీల్చుకుని వెన్నెల రాలేకపోవడంతో అంతా చీకటిగా వుంది. కీచురాళ్ళ రొద, నడుస్తుంటే కింద ఎండుటాకుల గలగలలు-ఆ వాతావరణం చూస్తుంటే పండాకి, మహంత్‌కి భయంకంటే ఏదో ఎడ్వెంచర్‌లా వుంది. వీళ్ళ అడుగుల చప్పుడికి నిద్రపోతున్న ఓ లేడి లేచి చెంగున తుమికి పొదలోకి పారిపోయింది. కుందేళ్ళు గాభరాపడి పరిగెత్తాయి. మూడు ఫర్లాంగులు దట్టమైన అడవి మధ్య నడిచాక పట్నాయక్ ముందే ఏర్పాటుచేసిన మంచె దగ్గిరకి చేరారు. పెద్ద పెద్ద కొమ్మలతో వున్న మహావృక్షం మధ్య కొమ్మలమీద వెదురు కర్రలతో మంచె తయారుచేశారు. పైన గడ్డి పరిచారు. ఆరుగురు శుభ్రంగా కూర్చోవచ్చు. ముందే పంపిన ఓ గార్డు మాటుకట్టడానికి తీసుకొచ్చిన మేకపోతుని పెట్టుకుని అక్కడ కూర్చుని వున్నాడు. కంట్రాక్టరు చకచక గడ్డిమీద జంబుకానా పరిచి

సామగ్రి పేరేశాడు. అంతా ఒకరి సాకరు చేయి అందించుకుని పైకి ఎక్కారు. కింద కాస్త దూరంలో ఓ చెట్టుకి మేకపోతుని కట్టారు. రమాకాంత్ ఒక గన్, గన్నర్ ఒక గన్, గార్డు మరో గన్ను పట్టుకుని ముగ్గురూ మూడు దిక్కులకి మొహం పెట్టుకుని రెడీగా పొజిషన్ చూసుకుని కూర్చున్నారు.

పులి వేటకి సరదాతోపాటు ధైర్యసాహసాలేకాక, ఓర్పు చాలా అవసరం. అలా చీకట్లో విసుగు- విరామం లేకుండా కళ్ళు విప్పుకుని రాత్రంతా పులికోసం ఎదురుచూడడానికి చాలా ప్రాక్టీసే వుండాలి. ఒకోసారి అంతలా కాచుకున్నా పులి కనపడకపోవచ్చు- పులి కన్పించినా గురి తగలకపోవచ్చు- గుండు తగిలినా సరియైనచోట తగలక పులి పారిపోవచ్చు. వరసగా రెండు మూడురోజులు ఓపిగ్గా ఎదురు చూడాల్సిరావచ్చు- అంచేత పులి వేటకి వెళ్ళినప్పుడల్లా పులి దొరుకుతుందని లేదు. అంత మాత్రంచేత నిస్పృహపడి లాభంలేదని రమాకాంత్ మిత్రులిద్దరికీ ముందే చెప్పాడు. రమాకాంత్ ఏభై సార్లయినా వేటకి వెళ్ళి వుంటాడు. అన్నిసార్లలో కేవలం ఆరు పులులని మాత్రం చంపగలిగాడు.

గంట రెండు గంటలు మూడు గంటలు అలా గడిచిపోతున్నాయి- రెండు గంటలయింది— అలా చీకట్లో సిగరెట్లు కాలుస్తూ- అప్పుడే రెండుసార్లు టీ తాగారు అందరూ. పండాకి, మహంతికి ఆవలింతలు వస్తున్నాయి. కళ్ళు కూరుకుపోసాగాయి. కూర్చుని కూర్చుని కాళ్ళు పట్టేస్తున్నాయి. ఆకుల సందునించి కొద్ది కొద్దిగా వెన్నెల వెండి బిళ్ళల్లా పడుతోంది. కింద మేకపోతు తనకేదో జరగబోతూందని పసిగట్టి భయం భయంగా 'మేమే' అని అరుస్తూంది మధ్య మధ్య. తాడు తెంచుకోడానికి గింజుకుంటుంది. మట్లాడుకోడానికన్నా లేదేమో ఆ నిశ్శబ్దంలో. అడవిలో ఆకుల గలగలలు- దూరంగా ఎక్కడో కొండలమీదనించి దుముకుతున్న నీటిధార శబ్దం. కీచురాళ్ళు నక్కల అరుపులు, వుండి వుండి వినిపించే ఏవో పిట్టకూతలు. ఆ వాతావరణం ముందు అంతా అద్భుతంగా వుందనిపించినా రానురాను విసుగు పుట్టసాగింది మిత్రులిద్దరికి. రమాకాంత్‌కి

అలవాటేమో నిశ్శబ్దంగా సిగరెట్ మీద సిగరెట్ కాలుస్తూ ఓపిగ్గా ఎదురు చూస్తూ కూర్చున్నాడు. యాంత్రికంగా కూర్చున్న ఆరోజు అతని మనస్సు వేటమీదలేదు. శరీరం ఇక్కడున్నా మనసు ఇందాక చూసిన స్త్రీ మూర్తిని వేటాడుతూంది. వెన్నెలలో కన్పించిన ఆ సౌందర్యం అతని ఏకాగ్రతని చెదగొడుతూంది. దబ్బిచ్చి కొనుక్కునే పరాయి స్త్రీల పొందు అతనికి కొత్తకాదు. కాని ఈ రోజు ఈ స్త్రీ అలా డబ్బిచ్చి కొనుక్కునేది కాదని కోగానే ఏదో నిరాశ, నిస్పృహ కల్గింది ఆ నిరాశే అతనిలో మరింత ఆకర్షణ పెంచినట్టయి వద్దనుకున్నా పదే పదే ఆమె రూపమే గుర్తు రాసాగింది.

మూడు గంటలయింది. ఇంక ఈరోజు ఏ పులీ రాదు కాబోలు అన్న నిరాశ చోటు చేసుకుంది అందరిలో— కూర్చునే కునికిపాట్లు పడు తున్నారు అందరూ. అంతలో హఠాత్తుగా దూరంగా ఎక్కడో పులిగర్జన వినబడింది.

అందరికీ నిద్రమత్తు ఒక్కసారిగా వదిలిపోయింది. ఎటెన్షన్‌లో కూర్చుండి ఆసక్తిగా చూడసాగారు— 'ఎక్కడో ఈ చుట్టుపక్కలకి వచ్చింది' రమాకాంత్ నెమ్మదిగా గుసగుసలాడాడు. పులి అరుపు విని మేక గింజుకుంటూ అరవసాగింది- గాలితోపాటు పులివాసన తగిలింది. తప్పకుండా మేక అరుపువిని పులి వస్తుందని ఆశగా ఎదురుచూడసాగారు. ఎక్కడ ఏ ఎండుటాకు కదిలినా, పొద కదిలినా చీకట్లో కళ్ళు చిట్లించుకుని చూడసాగారు. నాల్గు గంటలయింది. ఎండాకాలం ఏమో మరో అరగంట లోనే తొలి వెలుగు రావచ్చు. యింకేం వస్తుంది పులి అనుకుంటూ, అప్పుడే తిరిగిన చల్లగాలికి అందరికి చిన్న మత్తు రావడం ఆరంభించింది. హఠాత్తుగా ఒక్కసారి మేక అరుపుతోపాటు, దబ్బున చప్పుడవడం ఏమిటి అందరికంటే గన్నర్ ముందు తేరుకుని ఆ దిక్కుగా తుపాకి పేల్చాడు- వెంటనే అందరిచేతుల్లో బ్యాటరీలైట్లు వెలిగాయి. ఒక్క ఉదుటున పులి మేక మీదకి లంఘించి మేకను కరచుకుని పారిపోయింది. పొదలు కదలడం మాత్రం వెలుగులో అందరికీ కన్పించింది. రమాకాంత్, గార్డు

పొదల కదలికవైపు రూపాకులు కాల్చారు. కాని పులికి తగలలేదని అర్థం అయింది. "ప్చ్! పారిపోయింది. ఈ పొదలలో ఎక్కడో దాక్కుని సమయం కనిపెట్టి మీదపడింది ఒక్కసారి. ఈ పులులూ మనుష్యుల కంటే తెలివిమీరిపోతున్నాయి. బాడ్‌లక్– ఏం చేస్తాం వుయ్ విల్ ట్రై అవర్ లక్ టుమారో" అన్నాడు రమాకాంత్.

"దిగి లైటుతో చూద్దామా?" అన్నాడు అభిరామ్ కుతూహలంగా.

"వద్దు- ఏ పొదచాటునో వుంటే వుండచ్చు. వెలుగు వచ్చేవరకు దిగడం ప్రమాదం" అన్నాడు. అందరికి ఉత్సాహం పోయింది వెలుగు రావడంకోసం ఎదురుచూస్తూ ఆవలిస్తూ కూర్చున్నారు. మరో అరగంటలో తూరుపు తెల్లబడింది. ఇంక భయంలేదని అంతా చెట్టుదిగి పొదలవైపు ఓసారి లైట్లువేసి వెదికారు. బ్యాటరీలైటు వెలుగులో కొంతమేర మేక రక్తం గుర్తులు కన్పించాయి. అప్పుడు వెడితే లాభంలేదని అంతా వెను దిరిగి జీపు చేరారు. ఐదు గంటలకల్లా బంగళాచేరి వళ్ళెరగకుండా పది గంటలదాకా నిద్రపోయారు. నిద్రపోయేముందు ఒకసారి డేరావైపు చూశాడు రమాకాంత్.

★ ★ ★ ★

పదిగంటలకి మెలకువ రాగానే ఒక్కసారిగా తుళ్ళిపడి లేచి కిటికీ లోంచి టెంట్‌వైపు చూశాడు రమాకాంత్.... టెంట్ బయట ఆమె- తాడు మీద ఆమె బట్టలు ఆరవేస్తూంది. స్నానంచేసి వేసుకున్న జారుముడి- వంగపండు రంగుమీద ఏవో పెద్ద పూల డిజైను. అదేరంగు జాకెట్టు- రెంటికి మధ్య మెరిసే నడుం చూడగానే రమాకాంత్ గుండెలు ఒక్కక్షణం జోరుగా కొట్టుకున్నాయి- అమె యిటు తిరుగుతే బాగుండును అనుకుం టూండగానే ఆమె బట్టలు ఆరవేసి యిటువైపు తిరిగి ఓసారి బంగళావైపు చూసి లోపలికి వెళ్ళిపోయింది- ఆ చూసిన ఒక్కచూపే రమాకాంత్ మతి పోగొట్టడానికి సరిపోయింది.

ఆ రోజంతా రమాకాంత్ మనసు మనసులోలేదు. ఆఫీసర్లతో

యాంత్రికంగా డిస్కస్ చేశాడు- భోజనం చేసినా మధ్యాహ్నం పడుకున్న అంత మొద్దు నిద్రలోనూ ఆమె గురించే కలలు కన్నాడు. సాయంత్రం అయిందగ్గిరనించి రమాకాంత్ మూడుసార్లు బాత్‌రూమ్‌కి వెళ్ళి వచ్చాడు. రెండుసార్లు వాంతి చేసుకున్నాడు. తల తిరుగుతూందని, దిమ్ముగా వుందని తల పట్టుకు కూర్చున్నాడు. మాత్ర వేసుకున్నా తగ్గక బాధ పడ్డాడు. మిత్రులిద్దరూ గాభరా పడ్డారు. "మరేం ఫరవాలేదు, రాత్రి నిద్దుర చాలలేదు. నిన్న యివాళ డ్రింక్స్, భోజనం హెవీ అయి అరగ లేదు. అంతే" అన్నాడు రమాకాంత్. రాత్రి అయినకొద్దీ అతని తలనొప్పి ఎక్కువయింది. "ఫ్రెండ్స్- యివాళ షికారికి రాలేను. మీరు వెళ్ళండి. కంట్రాక్టర్ దగ్గిరుండి తీసికెడతాడు. అన్ని ఏర్పాట్లు చూశాను" నీరసంగా అన్నాడు.

"నీవు లేకుండా ఏం బాగుంటుంది- నిన్న చూశాంగా, ఇంక వెళ్ళకపోయినా ఫరవాలేదు" అభిరామ్ అన్నాడు.

"అబ్బెబ్బే అదేమిటి- షికారికోసంవచ్చి పులిని కొట్టకుండా వెళ్ళడం ఏమిటీ? ఇవాళ మరోచోట మాటు వేయించమని చెప్పాను. పులి తప్పక వస్తుంది. మీరివాళ మిస్ కాకూడదు. నేను లేకపోతేనేం పట్నాయక్ దగ్గ రుండి తీసికెడతాడు" స్నేహితులని వప్పించాడు రమాకాంత్- కంట్రా క్టర్‌ని పిలిచి అప్పగించాడు. 'మీదే పూచి, పులిని కొట్టాలి- అన్ని ఏర్పాట్లు చెయ్యండి" అన్నాడు.

"అలాగే సార్. మీకెందుకు మీరు రెస్ట్ తీసుకోండి. అన్నీ నేను చూసుకుంటాను. పులిని కొట్టి మరీ వస్తాం ఉదయం" అన్నాడు విన యంగా.

రాత్రి అంతా వెళ్ళాక చల్లగాలికి బయట కుర్చీలో కూర్చుని సిగరెట్ తాగుతున్నాడు రమాకాంత్. కిచెన్‌లో పని పూర్తయి అందరూ వెళ్ళినట్టున్నారు, అంతటా నిశ్శబ్దంగా వుంది.

వెన్నెల పిండారబోసి నట్లుంది. గోడమీదకి పాకించిన సన్నజాజి తీగనిండా నక్షత్రాలలా జాజిపూలు విచ్చుకుని తెల్లగా మెరుస్తున్నాయి వాటి పరిమళం అతనికి పులకింత నిస్తూంది. వెన్నెల అతని మతిపోగొడ్తూంది. వుండి వుండి అతని టెంట్‌వేపు చూస్తున్నాడు. నిన్నటిలాగే ఆమె తెల్ల చీరతో బయట ఇటు అటు తిరుగుతూంది. కాసేపు విసుగొచ్చినట్లు కుర్చీలో కూర్చుంటుంది. ట్రాన్సిష్టర్ వింటూ కాసేపు కాలక్షేపం చేస్తూంది, పాపం వంటరిగా వుండి విసుగుగా వున్నట్లుంది అనుకున్నాడు. ఆమె వంటరితనం అతనిలో ఏదో ఆలోచనలని రేపుతూంది- వాతావరణం ఏదో ప్రోత్సాహిస్తుంది. కాని అంతలో ఏదో సందేహం, బెరుకు, భయం, ఏదో వంకన షూటింగ్‌కి వెళ్ళకుండా తప్పించుకుని ఏకాంతం దొరికేట్టు చేసుకున్నాడు కాని- అంతకుమించి ముందుకు వెళ్ళడానికి జంకుగా వుంది. ప్రయత్నించి చూస్తే ఏం పోయింది అని అతని మనసు తొందరపెడ్తూంది, ఇదివరకు ఎంతోమంది స్త్రీలని చూశాడు కాని ఈ నాటి ఈ అనుభూతి అతనికి కొత్త!అందని దానికి అర్రులు చాచడంలో కావాలనుకున్నది పొందడానికి ఈ నిరీక్షణ, ఈ ఆరాటం అతనికి తెలియనివి! అందుకే అతనిలో ఏదో ఆవేశం, ఆరాటం- ఎక్సైట్‌మెంట్‌తో చెమట పడుతోంది. ఏం చెయ్యాలో, ఎలా ఆరంభించాలో- ఆడదానితో అన్ని అనుభవాలు రుచి చూసిన అతనికే తెలియడంలేదు. ఆమె ఏదన్నా అంటే గొడవచేస్తే తన పరువేంగాను??

ఆఖరికి ఏమయితే అయింది. కనీసం ఆమెతో మాట్లాడి ఆమెని దగ్గర నించన్నా చూడాలన్న కాంక్షని అదుపులో పెట్టుకోలేకపోయాడు. ఆమె ధోరణి చూసి ముందంజ వెయ్యొచ్చు. లేదంటే వూరికే పరిచయం చేసుకుని మాట్లాడినట్లు మాట్లాడి రావచ్చు- అందులో తప్పేం ఉంది? మనసు కూడదీసుకుని ధైర్యం చిక్కబట్టుకుని తడబడుతున్న అడుగులతో టెంట్‌వేపు వెళ్ళాడు.

★ ★ ★ ★

తెల్లవారుజామునే పులిని చంపిన విజయోత్సాహంతో వేటకి వెళ్ళిన

అంపరూ వచ్చారు— పులి నిన్నటిలాగే తెలివిగా మాటు వేసిన మేకపోతుని కరుచుకు పారిపోబోయింది. అయితే గన్నర్ చాలా త్వరగా తుపాకి పేల్చడంతో మొదటి గుండె సరి అయిన చోట తగిలి పులి మేకపోతుని వదిలి పారిపోబోయింది. రెండో గుండుకి మరి కదలలేక నేలకూలింది. మూడో గుండుకి ప్రాణం వదిలింది. ఏడడుగుల ఆ పులిని జీపుకి తాళ్ళు కట్టి ఈడ్చుకొచ్చారు. పులి చర్మం, గోళ్ళు, పులి తల అన్నీ మిత్రులిద్దరికీ పంపే ఏర్పాటు చేశాడు రమాకాంత్. అంతా పులిని కుతూహలంగా చూడడం అయ్యాక—

ఉదయం బ్రేక్‌ఫాస్ట్ కాంగానే ప్రయాణం పెట్టుకుని జీపు ఎక్కబోతున్నారు. అందరు "మిస్టర్ పట్నాయక్ మీ ఆతిథ్యాన్నికి మెనీ థాంక్స్— చాలా బాగా ఏర్పాటు చేశారు. అన్నీ" అంటూ థాంక్స్ చెప్పాడు రమాకాంత్, తన అలవాటుకి విరుద్ధంగా అంతే ఆ ఏర్పాటు చేయడం వారి విధిలా భావించి అతను ఈ సారి ప్రత్యేకం కంట్రాక్టరుకి కృతజ్ఞతలు చెప్పాడు. పట్నాయక్ ఓ నవ్వు నవ్వి "హి....హి.... తమ దయ సార్ నాదో చిన్న మనవి" అన్నాడు నమ్రతగా.

"ఏమిటి చెప్పండి?"

"అదే సార్. ఈ ఏరియా అడవి కొట్టి కలప, టేకు చెట్లు నాటాల్సిన మూడు లక్షల కాంట్రాక్టు...."

"ఐసీ!.... టెండర్ కాల్ చేశావా. డి ఎఫ్ వో?" సాలోచనగా అడిగాడు.

"ఆ చేసారండి— టెండరు పెట్టానండి— తమరు కాస్త దయ చూసి డి ఎఫ్ వో గార్కి...." పట్నాయక్ చేతులు నలుపుకుని అన్నాడు.

"ఆ.... సరే— చూస్తాను. డోంట్‌వర్రీ డి ఎఫ్ వో కి చెప్తానెండి" అంటూ జీపు ఎక్కాడు రమాకాంత్.

   

అంతా వెళ్ళాక తీరుబాటుగా మిగిలిన సీసాలు ముందు పెట్టుకుని మిగిలిన చికెన్‌తో చికెన్ ఫ్రై చేయించుకుని పట్నాయక్, ఇద్దరు రేంజర్లు ఖాళీ చేసుకుంటున్నారు. కాస్త దూరంగా ఆమె కూర్చుని ప్లేటులో వేరు శనగ పలుకులు ఒకోటి తీసి నోట్లోవేసుకుంటూంది పట్నాయక్‌కి అప్పటికే కైపు తలకెక్కింది చాలా కులాసాగా ఖుషీగా నవ్వుతూ తుళ్ళిపోతు న్నాడు— "ఏదీ దొర ఏమన్నాడు మళ్ళీ చెప్పు— నిన్న రాత్రి జరిగింది అంతా చెప్పు...." నవ్వుతూ అడిగాడు పట్నాయక్- ఆమె ముసి ముసి నవ్వులు నవ్వింది 'చెప్పాగా' అంది.

"అహా అలాకాదు సరిగా చెప్పు."

"చెప్పడానికి ఏముంది. పాపం వంటరిగా వున్నాడు భయం లేదా అంటూ వంక కల్పించుకుని పలకరించాడు, ఆ అవకాశం కోసం చూస్తున్న నేను కూర్చోపెట్టి కాఫీ యిచ్చాను. అక్కడ నించి ప్రశ్నలు మొదలు పెట్టాడు. ఊరికే పదే పదే నీలాంటి అందగత్తె చదువుకున్నది. ఆ ఏష్టకి పెళ్ళాం ఎలా అయావు అంటూ బోలెడు సానుభూతి, జాలి కురిపించాడు. నా బీదరికం. నా కిష్టం లేకుండా రెండో పెళ్ళికి నన్ను కట్టపెట్టడం కన్నీళ్ళతో జాలిగా చెప్పి, నా బాధలు చెప్పుకున్నాను- పాపం కరిగి పోయాడు. ఇద్దరిదీ ఒకటే కథ అని ఓదార్చాడు. తరువాత మరో అడుగు ముందుకువేసి నీ అందాన్ని అడవిగాచిన వెన్నెల చెయ్యొద్దని, ఇదేం పాపం గాదు. ఈ ఒక్కరోజు అనుభవం యిచ్చిన జ్ఞాపకాలతో మిగిలిన చేదు జీవితం మింగవచ్చని, నీ అందం నన్ను పిచ్చివాడిని చేసింది అనుగ్రహించు అంటూ మీద పడ్డాడు. అతను నన్ను వలలో వేసుకోవానికి ఎంత ఆరాటపడుతున్నాడో అతన్ని నేను వలలో వేయడానికి అంత ఆరాటపడుతూనే వున్నా గనక కాస్త బెట్టుచేస్తూ పాపం పుణ్యం అంటూ పతివ్రతలా నటిస్తూ లొంగిపోవడం ఇష్టం లేనట్టు నటిస్తూ కౌగిలిలోకి చేరాను." ఆమె విలాసంగా, గర్వంగా నవ్వుతూ అంది.

"ఇంత బాగా నటించాను మరి నా బహుమతి ఏది?" వయ్యారంగా చెయ్యి చాపింది.

"తొందరెందుకు పిల్లా ఇదిగో వెయ్యి" అన్నాడు నోట్లకట్టలు లెక్కపెట్టి-

"ఇంత కష్టపడ్డా రేటు మించి ఇయ్యడం లేదు కదూ" అంది గునుస్తూ.

"బాగుంది. వంద రూపాయలు పడేసే పదిమంది దొరుకుతారు. ఏదో హైక్లాస్ దానివని, కాస్త ఎర్రగా బుర్రగా వున్నావని ఇంగ్లీషు మాట్లాడుతావని ఇంతిచ్చా, ఇంకానా" అన్నాడు పట్నాయక్.

"గురూ మా బలే టోకరా తినిపించావు దొరకి" అన్నాడు ఓ రేంజరు.

"అద్సరే- నీ పెళ్ళాం అని చెప్పకపోతే వచ్చే నష్టం ఏమిటి గురూ!" మరో రేంజరు సందేహం.

"నా పెళ్ళాం కాకపోతే ఆడికి నేనిచ్చిందిదేటుంది. ఆడికి తప్పుపని చేసిన పాపభీతి ఏటుంటుంది-ఆడు నాకు ఋణపడినట్టు ఫీలవుతాడా? బజారుదంటే అందరికీ హక్కే కదా-మరోడి పెళ్ళాంమీద వున్న మోజుంటుందా" నవ్వాడు గలగల పట్నాయక్.

"బలే బుర్ర గురూ నీది. ఐడియా అంటే నీదే-వెయ్యి రూపాయలు ఖర్చెట్టి మూడు లక్షల కాంట్రాకు కొట్టేశావు. ఎరచూపి పులిని కొట్టేశావు. దొర ఆ పులిని కొట్టేస్తే నీవు ఈ పులినే కొట్టేశావు. రేంజరు భుజం చరిచి గలగలా నవ్వాడు. పట్నాయక్ గర్వంగా మీసం మెలేశాడు.

(ఆంధ్రజ్యోతి వార పత్రిక)

—0—

# వానచినుకులు

"షన్‌లార్జ్ బి. కె" చీటి మీత రాస్తూ మెల్లిగా అన్నాడు రామారావు.

"సార్ యిప్పటికే చాలా అయింది....పన్నెండు దాటుతోంది.... నసిగాడు ముక్తార్.

"షటప్! నేను చెప్పింది చెయ్యి" దెయ్యందించాడు రావు. కౌంటర్లో ముక్తార్ విషాదంగా, సానుభూతిగా నవ్వాడు.

గోడమీద స్కర్టింగ్ పైన గ్లాసు కేసులో ఉమర్ ఖయ్యాం రంగుల పెయింటింగ్ గ్లాసుమీద రుబాయి ఒకటి చెక్కబడి వుంది.

"నన్నడగ కుండానే, నా యిష్టం తెల్సుకోకుండానే ఎక్కడినించో ఇక్కడికి నన్ను తోసేసారు. నన్నడగ నైనా అడగకుండా ఈ వారం నించి ఎక్కడికిగెంటుతారో గెంటేస్తారు! సఖిగిన్నెనింపు ఈ ధూర్తత్వాన్ని మరిపించేందుకు ఇంకోగిన్నె మధువు—"

ఇంగ్లీషు పద్యాన్ని గట్టిగా చదివాడు రావు. అంతా ఖాళీగా వుంది.

ఎక్కడా ఎవరూలేరు. బార్ ముందు ఎత్తయిన గుండ్రని స్టూలు మీద కూర్చుని మరోగ్లా ఖాళీ చేశాడు.

"ముక్తార్! నీకో పాఠంచెపుతాను. శ్రద్ధగా ఒళ్ళు దగ్గిర పెట్టుకుని విను!"

"సార్!" ముక్తార్ యిలాంటి పాఠాలు చాలామంది దగ్గిర విన్నాడు. కాబట్టి తనపని తను చేసుకుపోసాగాడు.

"మన హృదయాలు ఎండిపోయిన నేల లాంటివి; బీటలు తీసే శాయి. యిక్కడ ఏ మొక్కా మొలవదు!"........

"అవును సార్!" ముక్త్యార్ అరలకి తాళాలు బిగిస్తూ పరధ్యానంగా అన్నాడు.

"ఎప్పుడో రెండో మూడో వానచినుకులు పడుతాయి....రెయిన్ డ్రాప్స్!....చల్లబడుతుంది....హాయ్ ....హాయ్....ఎంతహాయి!"

"కరెక్ట్ సార్!"

"కాని ఏ లాభం? మళ్ళా....వాన వెలుస్తుంది....ఎండ కాస్తుంది ....నీరింకి పోతుంది....క్రితం సాయంకాలం పడ్డ చినుకులు ఎక్కడ అణ గారి పోయాయో ఎవరికి పత్తా?"

"ఏం మిగలదు సార్!"

"అదే, జీవిత రహస్యం! అర్థమైందా?....నౌ, యీ సారి మార్పు కోసం, వన్ ఓల్డ్ స్మగ్లర్!"

"ఓల్డు స్మగ్లర్ అయిపోయింది సార్!"

"పోనీ బి. కె"

"అంతా పాత స్టాకు సార్. వాసన బాగులేదు!"

"ఇడియట్! ఎందు కంటున్నానో నాకు తెలుసు. కాని, నేనింకా గీత దాటలేదు. సర్లే! నువ్వుపో!" రావు దిగాడు స్టూల్‌ని రెండు మూడు రౌండ్లు తిప్పి.

"ఇప్పుడే వెళ్ళకండి సార్, కాసేపు ఆ సోఫాలో కూర్చోండి!"

"ఇక్కడ గాదు: వరండాలో:"

వరండాలోకి ఒక సోఫా లాగించాడు ముక్త్యార్.

"లైటు వెయ్యమంటారా సార్!"

"వద్దు, మిగతా లైట్లు కూడా ఆర్పేయ్యి! చీకటి బాగుంటుంది!"

బయట వెన్నెల కురుస్తూంది- గుండ్రంగాతిరిగే ఫౌంటెన్లు యింకా నీరు చిమ్ముతున్నాయి. సన్నగా పొడుగ్గా నీటి కొలనో తెల్లగా మబ్బుల సీడలు కదుల్తున్నాయి. ఎక్కడో దూరంగా ఎలక్ట్రిక్ దీపాలు తెల్లని వెన్నెల్లో మచ్చల్లా వేలాడుతుంటే, ఎలెక్ట్రి సిటీ వాళ్ళమీద రావుకి చాల కోపం వచ్చింది. పాల వెన్నెల్లో యీ దీపాలవసరం ఏమిటి? అవి ఆర్ప వచ్చని వాళ్ళ కెందుకు తట్టదో! అనుకున్నాడు.

ఏమిటో అంతా చికాగ్గా వుంది. దేనిమీదో, ఎందుకో కోపం. మెద డంతా ఓ చిన్న సంచిలో పడేసి కుట్టేసినట్టుంది. ఆలోచన ఎటూ సాగడం లేదు. బండగా. మొద్దుగా తయారయింది. ఓ సారి మొగం చిట్లించి పిడికి టితో నుదుటి మీద గట్టిగా రుద్దాడు.

దట్టంగా కమ్మిన పొగమంచు కొద్దిగా విడినట్లయింది. ఆ పొగ మంచు మధ్య మసక మసగ్గా రత్నమాల కనిపించింది.

రత్నమాల తల దించుకొని కళ్ళు పైకెత్తితనవంక బిడియంగా చూస్తూంది. పెదాలమీద, మనసులో ఆనందాన్నం తనీ కురిపించే చిరు నవ్వు. అలాగే పరిచయమైందిమొదట క్లబ్‌లో.

"చెప్పాను కదూ? ఈయనే రావుగారు!" మిసెస్ మూర్తి పరిచయం చేసింది ఒక రాత్రి ఎనిమిది గంటలకి.

"ఏం చెప్పింది!"

"ఏమిటి చెప్పారు? ఆ రహస్యం తెలుసుకోకపోతే యింక నాకు నిద్రపట్టదు!"

"అది మాలో రహస్యం! మీరడగకూడదు!" కొంటెగా నవ్వింది.

మ్యూజిక్ మొదలవగానే మూర్తి భార్య వంక చూశాడు. రాణి మూర్తి వంక చూసింది.

చివరకి మూర్తి అన్నాడు,

"రావ్! రత్నమాలకి కంపెనీ ఇవ్వు. నేనూ, రాణి ఒకసారి ఫ్లోర్ మీదికి పోయొస్తాం."

"రత్నా! రావుగారితో మాటల్లో పడ్డావంటే నిన్ను నీవు మరచి పోతావు. జాగ్రత్త!" నవ్వి లేచింది రాణి.

రత్నమాల తల దించుకు కూర్చుంది. మాట్లాడాల్సిన భారమంతా రావు మీదనే వేసి.

"మీరేం తీసుకుంటారు?"

"నాకేం వద్దండి."

"మీకు కావాలా వద్దా అని నేనడగలేదు!" రావ్ ఆమె కళ్ళల్లోకి చూశాడు.

ఆ కళ్ళు తడబడ్తున్నాయి. ఆమె పెదాలు నవ్వుతున్నా, ఆ కళ్ళల్లో ఏదో అంతులేని విచారం నీడలా తొంగి చూస్తోంది. కొందరి కళ్ళు ఎప్పుడూ అలాగే వుంటాయి. ఆ కళ్ళంటే రావు కెంతో యిష్టం. ఆమె సంభ్రమాన్ని, మొహమాటాన్ని చూసి జాలిగా నవ్వుకున్నాడు. రావు.

ఆ తర్వాత, తను స్కాచ్ తీసుకుని ఆమెకి కోకాకోలా అందించాడు. ఇష్టం లేదన్నట్టు పుచ్చుకుని పూర్తిచేసింది. రత్నమాల. ఆమె క్రొత్తచోట క్రొత్త మనుష్యుల మధ్య యిమడ లేక పోతూంది. చుట్టూ అంతా రకరకాల ప్రాంతాల వాళ్ళు. ఉన్నతోద్యోగులు: ఆధునికత ఉట్టి పడే వేషభాషల్తో అంతమంది ఆడవాళ్ళు, మగవాళ్ళ మధ్య ఆ వాతావరణంలో భయంకరమైన వంటరితనం ఆమెని బాధిస్తోంది.

"చూడండి, నేను కొద్దిగా కవిత్వం చెపుతాను. మీకు అదోలా బాధగా వుంటుంది. కాని అది బయటపెట్టక నా కోసం చిన్నగా నవ్వండి" ఆమెని కుదుటబర్చడానికి తేలిగ్గా మాట్లాడసాగాడు రావు.

"మీరు కవిత బాగా రాస్తారని చెప్పింది రాణి. నాకు పోయిట్రీ అంటే యిష్టం: చెప్పండి నాకే బాధాలేదు?"

"నేను కవిత చెప్తానంటే పారిపోకుండా నిలబడ్డవాళ్ళు మీరొక్కరు కనిపించారు, సంతోషం. చూడండి, యీ మనుష్యులంతా ఎవరో గొప్ప వాళ్ళని, మీకన్న పై మెట్టని అనుకోకండి. అంతా ఒకటే ఖాళీ మనుష్యులు! బుట్ట బొమ్మలు! గడ్డికుక్కిన సంచులు! తడారిన మన గొంతుకలు చేసే శబ్దాలు, గాజు గొట్టాల్లో గాలి కూతల్లా, పగిలిన పెంకులమీద ఎలక కాళ్ళ చప్పుళ్లా, అర్థరహితమైన ధ్వనులు! ఆకారాల్లేని రూపాలు! కదల్లేని శక్తులు!...."

"మీరు ఇలియటుని అప్పజెప్తున్నారు!" దొంగని పట్టినట్టు సంతోష పడింది రత్నమాల.

"మీకు కవిత్వ అభిరుచే కాకుండా ప్రవేశం కూడా ఉందన్నమాట ఏంత వరకు చదివారు?"

"బి.ఏ. అండి" మళ్ళీ సిగ్గుపడసాగింది.

"మీ మొహమాటం. బిడియం తగ్గించాలని నేను యిదవుతూంటే మీరు అలా ముడుచుకు పోతారేం? ఇక్కడికి వచ్చే మనుష్యులు ఆనందించాలని, కొన్ని గంటలు తమని తాము మర్చిపోవాలని వస్తారు. ఇక్కడ కూడా మన అంతరాలు, హోదాలు, తేడాలు అన్ని గుర్తుంచుకుని బిగుసుకు పోతే యింకెలా? రండి. డాన్స్ చేద్దాం"

"నాకు అసలు బొత్తిగా రాదండి, ఎన్నడూ చూడలేదు కూడా" తడబడింది.

"పరేం పర్వాలేదు. ఎడం చెయ్యి నా భుజంమీద వెయ్యండి. కుడి

చేతితో నా ఎడం చేయి పట్టుకోండి. నాతోపాటు అడుగులు వెయ్యండి. అంతే, కమాన్!"

ఆమె తడబడ్తూ, తల వంచుకుని మెల్లగా లేచింది.

ఫాక్స్ ట్రాట్ వాయిద్యం వినిపిస్తూంది. రావు, ఆమె నడుం చుట్టూ చెయ్యివేసి పట్టుకుని ఫ్లోరంతా ఒకసారి తిప్పాడు. రత్నమాల జీవితంలో అదొక క్రొత్త అనుభవం.

"నాతో డాన్స్ రాదని చెప్పారు. మోసమన్నమాట!" మూర్తి, రాణీ దగ్గరకి వచ్చినపుడు మూర్తి, రత్నమాలమీద నెపం వేశాడు.

"నేను చెప్పలా, ఆయన మాటల్లో పడితే ప్రమాదమని" రాణీ నవ్వింది.

"మైండ్ యువర్ బిజినెస్! మీరు వాళ్ళ మాటలు వినకండి" రావు నవ్వుతూ రత్నమాలని మరో మూలకి చేర్చాడు.

బాండ్ ఆగింది. మళ్ళీ మొదలయింది. ఈసారి మరో బీట్ రత్నమాల ఏం చెయ్యాలో తోచని దిగ్భ్రమలో ఉన్నట్టు నిలబడి పోయింది.

"ఊఁ కానివ్వండి" రావు అన్నాడు.

"దయచేసి నా ప్రార్థన వింటారా? కాసేపు బయట వేరే కూర్చుని కబుర్లు చెప్పుకుంటే యింతకంటే హాయిగా వుంటుంది కదూ!" బెరుకుగా అంది రత్నమాల.

రావు ఆమె కళ్ళలోకి చూశాడు. ఏదో వేదన, ఆరాటం, నిండి దిమ్మెరపోతగా కురియబోయే మబ్బుల్లాంటి నీడలు కమ్మినట్టున్నాయి. ఆ కళ్ళలో జాలి పుట్టించే దైన్యం అతన్ని కదిలించింది.

"ఫర్వాలేదు, రండి" బయటికి లాన్‌లోకి నడిచారు ఇద్దరూ. చెట్టు మొదట నీడలో ప్రేంకుర్చీలో వాలారు.

"క్షమించండి, మీరు మామూలుగా అందరిలాగ క్రొత్తదనం ఫీలవు తున్నారేమోనని బలవంతం చేశాను. మిమ్మల్ని ఇబ్బంది పెట్టడం నా ఉద్దే ‌శం గాదు!" రావు సంజాయిషీ చెప్పుకున్నాడు.

"మీరు నన్నేం బాధపెట్టలేదు.... నిజానికి"

"నిజానికి?"

"నిజానికి యీ వూరు వచ్చాక చాలా సహజంగా, శాంతిగా ఫీల యింది మీ ఎదుటనే!"

"ఏదన్నా పనిమీద వచ్చారా?"

"లేదండి.... ఊరికేనే" ఆమె తల ఎత్తలేదు. ఆమె దాస్తోందని తనకి చెప్పడం యిష్టంలేదని రావుకి తెలుసు. బలవంతం చేయలేదు.

రెండురోజులు పోయాక—

పొద్దునే రావు ఆఫీసులో అడుగు పెట్టిన అర్థగంటకి ఫోన్ మ్రోగింది.

"రావ్"

"రావ్! మూర్తిని మాట్లాడుతున్నాను ఒక చిన్న విషయం."

"పెద్ద విషయమైనా వినడానికి, చేయడానికి సిద్ధం"

"రత్నమాలని చూశావుగా, ఆమెకీ ఉద్యోగం కావాలి. నీ దగ్గిర ఖాళీలున్నాయి గదూ!"

"రత్నమాలకి ఉద్యోగమా? ఆమె వూరికే చూడ్డానికి వచ్చిందను కున్నాను"

"దానికో పెద్ద కథ ఉందటలే. నేను రాణి నడిగినాగాని తర్వా తెప్పుడో చెప్తానని దాటేసింది. ఆ గొడవ మన కెందుగ్గాని, నీ దగ్గిర ఖాళీ లుంటే కాస్త సహాయం చేద్దూ!"

"ఖాళీ ఉందిగాని, దానికి ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్ఛేంజి నడగడం, వాళ్ళ లిస్టు పంపడం అయింది. ఇంటర్వ్యూ తారీఖు కూడా ఫిక్స యింది.

"రావ్! బొత్తిగా అమాయకుడిలా మాట్లాడకు. నువ్వు చెప్పే కారణాలు నిన్ను ఆడ్డుకోవని నీకూ తెలుసు!" నవ్వాడు మూర్తి.

"ఇంతకీ ఆమెకీ గుమాస్తా ఉద్యోగమెందుకో? ఒకసారి నే నామెతో మాట్లాడవచ్చా?"

"ఎలాగూ ఇంటర్వ్యూ అంటూ ఒకటుందిగా?"

"అ ఇంటర్వ్యూ కాదోయి! నేనామెతో రెండు మూడు గంటలు! హోటలుకో, సినిమాకో వస్తుందేమో అడుగు?"

"రాకపోవటానికి ఏముంది? నీకెప్పుడు వీలవుతుందో చెప్పు"

"రేపు ఆదివారం లంచ్, క్వాలిటీలో తీసుకుని, ఆ తరువాత సెకెండులో మ్యాట్నీ! ఆమె నడిగి రింగ్ చెయ్యి మళ్ళీ"

ఆ ఆదివారం మధ్యాహ్నం రెండు గంటలవేళ క్వాలిటీలో కూర్చు న్నారు ఇద్దరూ. బయట ఎండకి విరుగుడన్నట్లు చల్లటి కాంతినిచ్చే దీపాలు. సన్నగా వాద్య సంగీతం, మెల్లగా గుసగుసలు తప్పించి పెద్ద శబ్దంలేని ప్రశాంతత.

"మీరు ఉద్యోగం చెయ్యాలనుకోడం నా కాశ్చర్యం కలిగించింది"

"అంత ఆశ్చర్యపోవడానికేముందండి?"

"చూడండి, యీ ఉద్యోగాలు, కాగితాలు, ఫైళ్ళు, పాడ్‌లు, టేపులు, గుండు సూదులు, జేకీవ్వులు, ఇకానమీ ప్లాన్‌లు, యస్సార్లు— యివన్నీ మనుష్యుల్ని మరలు చేస్తాయి. ఆ మోటు పనికి మగాడే తగును! పూలు, వెన్నెల, మబ్బులు, లేచిగుళ్ళు, ఆడవాళ్ళు- యివన్ని సౌందర్యం, సౌకుమార్యం, సున్నితం, లాలిత్యంలాంటి లక్షణాలకి ప్రతిరూపాలను

ఘంటాను! వీటన్నిటిని ఉద్యోగాల విషజ్వాలలకు మొనాటనికి ఆహుతి చెయ్యడం...."

"మీరు కవిత్వం చెప్తున్నారు!" రత్నమాల నవ్వింది.

"కావచ్చు కాని నా అభిప్రాయాలు కొన్ని మీకు చెప్పాలనే మిమ్మ ల్నక్కడికి పిల్చాను కాబట్టి మీరు భరించాలి."

"ఏదో కాలక్షేపం క్రింద వినడానికి నా కభ్యంతరం లేదు"

"అంతేనా?"

"నా పరిస్థితి మీకు తెలియదు. నేను కేవలం ఉద్యోగం చేయాలనే ఆరాటంతో ఇంత దూరం రాలేదు. నన్ను పరిస్థితులు తరిమాయి"

"అవి నేను తెల్సుకోవచ్చా?"

"క్షమించండి"

"దట్సాల్ రైట్, ఇంక నేను అడగను ఆ విషయం గురించి"

"మిమ్మల్ని కాదన్నందుకు నన్ను మన్నిస్తారు గదూ?" ఆమె ఇబ్బందిగా, నిస్సహాయంగా చూసింది.

"మీకెందుకంత గాభరా? నేనేం అనుకుంటాను చెప్పండి!" "ఆమాత్రం అర్థం చేసుకోలే ననుకున్నారా? ఇంకా గొడవ మర్చిపొండి!" రావు నవ్వాడు.

"నిజంగా మీ సహృదయత చూస్తుంటే.... మనసు విప్పి చెప్పుకో వాలని ఆరాటం కలుగుతోంది. కాని...."

"ఇంక ఆ గొడవ మరచిపొమ్మన్నాను గదా! మీకు నా దగ్గిర పని చెయ్యడం అభ్యంతరం కాదనుకుంటాను!"

"అది మహాగౌరవంగా భావిస్తాను"

"అలా మాట్లాడకండి. పొగడ్తలు నన్ను ఇబ్బంది పెడ్తాయి. ఆఫీసు బయట నన్నొక మామూలు స్నేహితునిగా చూడండి!" రత్నమాల కళ్ళు కృతజ్ఞతతో నిండాయి.

ఆ తర్వాత, ఎక్ఛ్సేంజి పంపిన వాళ్ళెవరూ పనికిరారని రాసి. మరొక లిస్టు పిల్చాడు రావు. ఈసారి లిస్టులో రత్నమాల పేరు వచ్చింది. రత్నమాలకి ఆ ఉద్యోగం వచ్చింది.

రత్నమాల ఉద్యోగంలో చేరాక, రావుకి తను కూర్చునే గది మరీ పెద్దదనిపించింది. ఆమె సీటు అక్కడ వేశారు.

ఉదయాన్నే ఆఫీసులోకి అడుగు పెట్టగానే రత్నమాల లేచి "గుడ్ మార్నింగ్ సార్!" అంటుంది. ఆ తర్వాత ఆరోజు టపా టేబులుమీద వుంచి, సిగ్నల్స్, అప్ ఇమీడియట్, ఇమీడియట్, ప్రయారిటీ వగైరా తరగతుల ఉత్తరాల్ని వరుసగా అందిస్తుంది, వీటికి రావు యిచ్చే జవాబుల స్థూలంగా అర్థంచేసుకొని డ్రాఫ్టు తయారుచేసి, అతని అంగీకారం తీసుకొని టైపు కివ్వడం ఆమె పని.

మొదట్లో రత్నమాలకి పని చాతగాలేదు. ఆఫీసు ఉత్తరాలని తనకి వచ్చిన భాష నంతనీ ఉపయోగించి రాయసాగింది. అందమైన భాష వాడితే రావు సంతోషిస్తాడనుకునేది.

"ఆఫీసు ఉత్తరాల్లో కావల్సింది అందమయిన మాటలుగావు. స్పష్టముగా, తేలిగ్గా అర్థమయ్యే మాటలు; అది దృష్టిలో వుంచుకోండి, మన స్టయిలు వేరేచోట వాడుకుందాం." ఒకసారి రావు చెప్పాక ఆమె మారింది. అతని శక్తి సామర్థ్యాల మీద ఆమెకి గొప్ప గౌరవం కలిగింది.

మొదట ఆమె అక్కడ కూర్చోవడం రావు ఆలోచనల్లో విడవకుండా వెంటాడింది. క్రమేపి ఆమె ఉనికికి అలవాటు పడ్డాడు అతను. ఆఫీసు నాలుగ్గోడల మధ్య ఆమె అతని దగ్గిఱ అందర్లాగే పనిచేసే ఒక మనిషి.

రెండు నెలలు గడిచాయి.

ఒక మధ్యాహ్నం అతను లంచ్ కానిచ్చిన మరో పది నిమిషాలకి ఆమె టేబిలు ముందు నిలబడింది. మొదట ఏదో మామూలు గొడవ అనుకుని కాసేపు తను చూస్తున్న కాగితం మీ నుంచి దృష్టిమరల్చలేదు. అది చదవడం పూర్తి అయ్యాక!

"యస్"—తలెత్తి చూశాడు.

"నాకు సెలవు కావాలండి" అంది తలవంచుకునే.

"సెలవా? ఎప్పుడు? గ్రాంటెడ్!"

ఆమె కాగితం అందించింది. అది చదవకుండానే దానిమీద 'గ్రాంటెడ్' అని రాసేసి, "ఎందుకో తెల్సుకోవచ్చా?" అని అడిగాడు.

"ఒక ఫ్రెండ్ పార్టీకి వచ్చాడు. మధ్యాహ్నం వెళ్ళాలి. కొంచెం ఆఫీసునుంచి తొందరగా వెళితేగాని కష్టం"

"ఎవరా ఫ్రెండ్? పార్టీ ఎన్నింటికి? ఏం పార్టీ? ఎక్కడ-క్షమించండి మరీ వ్యక్తిగతమైన ప్రశ్నలడుగుతున్నట్టున్నాను"

"అతనొక కాలేజీ స్టూడెంటు. కొన్నేళ్ళక్రితం పరిచయం అయింది- పేరు శ్యామ్‌సుందర్. అతను కాలేజీలో దేనికో ఎన్నికయ్యాడు! అందుకు వాళ్ళ స్నేహితులందర్నీ పిలుస్తూ, నన్నూ పిల్చాడు. నాలుగున్నరకి ఫోటో, అయిదింటినుంచి ఆరింటిదాకా పూనమ్ రెస్టారెంట్‌లో రిఫ్రెష్‌మెంట్స్, ఆ తర్వాత ఎంపైర్‌లో సినిమా.....! మీకావల్సిన వివరాలన్నీ ఇచ్చాననుకుంటాను" నవ్వింది రత్నమాల వేళాకోళంగా.

"కావల్సిన దానికన్నా ఎక్కువే ఇచ్చారు" కాగితం ట్రేలోకి విసిరి ప్రక్కకి చూశాడు రావు.

అతను నవ్వకపోవడం ఆమెని బాధపెట్టింది. అక్కడే నిల బడింది.

"మీరు వెళ్ళచ్చు. నిలబడ్డారేం?" అతను మిగతా కాగితాలకేసి చూస్తూ అన్నాడు. ఆ ముభావానికి కారణం తన ప్రవర్తనవలన కలిగిన అయిష్టతో, లేక అతని పనీ బరువో తేల్చుకోలేక మరి రెండు నిమిషాలుండి—

"థాంక్యూ సార్!" అని వెళ్ళిపోయింది రత్నమాల.

ఆమె వెళ్ళగానే కాగితాలన్నీ దూరంగా నెట్టి, వెనక్కి త్రోసి, నిర్లిప్తంగా గోడకేసి చూశాడు.

ఆమె ఎదుట తన అయిష్టతని అంత స్పష్టంగా ఎలా వెలిబుచ్చాడు ఆమె తన గురించి ఏమనుకుందో? తన మనసులో భావం ఆమెకి అర్థం అయిపోయిందేమో? మనసంతా చిరాగ్గా తయారయింది.

ఎవరీ కాలేజీ స్టూడెంట్? శ్యాంసుందర్ అతని పేరు. పార్టీ, ఫోటో రిఫ్రెష్‌మెంట్స్, సినిమా. ఇంతేనా! దీనివెనక ఏదో వుంది, ఆ 'ఏదో' తనకి తెల్సినట్లనిపించింది రావుకి. తన కాలేజీ రోజులు గుర్తుకు వచ్చాయి. బాధ్యతా రహితమైన రోజులు. ఆలోచనలన్నీ ఆచరణలో పెట్టాలని వుంటుంది. పరిణామాలని గుర్తులో పెట్టుకోవడం జరగదు.

శ్యాంసుందర్! పేరు బాగుంది. మనిషీ అంతేనా! ఏమిటో ఆ స్నేహం?

ఆ సాయంకాలం ఆమెని క్లబ్‌లో చూశాక మళ్ళా బయట ఎన్నడూ కలుసుకోలేదు. ఎన్నిసార్లో అడగాలనుకున్నాడు. ఏ సినిమాకో పిలవాలనుకున్నాడు. కాని అడగలేదు.

తనలో ఏదో అడ్డుపడింది. తను అధికారి. తన దగ్గర ఆమె పని చేస్తోంది. తమ ఇద్దర్నీ బయట చూసిన వాళ్ళేమనుకుంటారు! పైగా ఆమె యిష్టా యిష్టాలెలా వున్నాయో? తన ఆధిక్యాన్ని అధికారాన్ని దుర్వినియోగ పరుస్తున్నట్టనుకుంటుందేమో! ఒకవేళ బలవంతాన వస్తే అందువల్ల తనకి జరిగే దేముండదు. ఏదో నేరంచేసినట్టు బాధపడటమొక్కటే మిగులుతుంది.

ఈరకం ఆలోచనల్తో శతమతమై ఏం చెయ్యలేకపోయాడు. పైగా రెండునెలలు చాలా తక్కువ వ్యవధి అనిపించింది తనకి.

రావుకి ఏమిటోలాగుంది ఆ సాయంకాలమంతా. చివరికి అయిదు న్నర ప్రాంతంలో కాగితాలేవి చూడకుండానే లేచి వెళ్ళిపోయాడు.

ఆఫీస్లో టీ త్రాగి బయటికి రాగానే రావుకో ఆలోచన వచ్చింది. వెంటనే ఎంపైర్కి పోయి టికెట్ తీసుకున్నాడు. ఇంకా ముప్పావుగంట టైముంది. దూరంగా స్టేషన్ వేపు వెళ్ళిపోయాడు రావు.

ఆరున్నర కావస్తోంది. మరో రెండు మూడు నిమిషాలలో పిక్చరు మొదలవుతుందనగా గుమ్మం దగ్గర క్రీనీడలో నిలబడి హాలు కలయ చూశాడు. క్రింది తరగతిలో ఒక మూలగా రత్నమాల. మరో అతను కూర్చున్నారు. ఇద్దరే! మిగతా అందరూ వెళ్ళిపోయారన్న మాట! లేక పోక్టే అంతా ఇద్దరేనా! వాళ్ళిద్దరూ మాటల్లోపడి అతనివంక చూడలేదు.

శ్యాంసుందర్ చామనఛాయగా, బాగా పొడుగ్గా వున్నాడు. జాకెట్ లాంటి చొక్కా టీ షర్టు. అతడు మాట్లాడుతుంటే ఆమె శ్రద్ధగా వింటూంది. అదే నవ్వు నిర్మలంగా, ప్రశాంతంగా.

లైట్లార్పగానే-వాళ్ళకి సాధ్యమైనంత దగ్గరగా వున్న సీట్లో కూర్చు న్నాడు. వాళ్ళిద్దరూ సినిమాలో లీనమయ్యారు. రావు మనసు సినిమాలో లగ్నమవడంలేదు. ఏదో ఆందోళనగా వున్నాడు. ఆమె అతనివంక చూసి నప్పుడల్లా రావు గుండెల్లో సూదులు గుచ్చినట్లుంది.

ఓ అర్ధగంట ఆ నరకం అనుభవించాక, తనమీద తనకే చెప్పలేని అసహ్యం కలిగింది తను చేస్తున్న పనేమిటి? ఈ గూఢచర్యకు ఏమిటర్థం బలిసి"

"ఎన్నోసార్లు తను లిఫ్టు ఇచ్చి తీసికెళ్ళిన అమ్మాయిలు తనని వదలి ఋతరులడగ్గానే డాన్స్కి వెళ్ళినప్పుడు తనేం బాధపడలేదు, పైగా అలాంటి బాధలూ, ఆ భావాలూ అనాగరికంగా, సభ్యతా సంస్కారాలు

లేనివాళ్ళ మనో ప్రవృత్తిలాగ అనుకొనేవాడు. ఇప్పుడీ పసితనం ఏమిటి?

ఒకమూల తనలో రేగుతున్న బాధ వాళ్ళనింకా కనిపెట్టి చూడ మని ప్రోత్సాహిస్తున్నా, బలవంతాన లేచి వచ్చేశాడు. ఆ రాత్రి బార్‌లో రెండు బాటిల్స్ గోల్డెన్ ఈగిల్ త్రాగి గదిలోకి వెళ్ళి పడుకుంటే తెల్లారి పోయింది, తెల్లారాక తనలా వచ్చేయడం చాలా మంచిపని అన్పించింది. క్రితంరోజు బాధ చాలవరకు తగ్గిపోయింది.

ఆఫీసులో రత్నమాల క్రితంనాటి అతని ముఖావాన్ని గుర్తుంచుకో నట్టే నడుచుకుంది. రావు చాలా సహజంగా క్రితం సాయంకాలం లేనట్టే మాట్లాడాడు.

"మిస్! ఈ సాయంకాలం మీ ప్రోగ్రాం ఏమిటి?" ఏదో కాగితం చూస్తూ మామూలుగా అడిగినట్టు అడిగాడు.

"ఏం లేదండి!"

"నాతో సాయంత్రం ఎక్కడికయినా రావడానికి అభ్యంతరం ఏమన్నా వుందా?"

"ఏమిటలా క్రొత్తగా మాట్లాడుతున్నారు?"

"కొత్తగాదు రత్నా! నీతో ఎన్నో రోజులనించి ఒకటి చెప్పాలను కుంటాను. చెప్పలేక పోతున్నాను. నేను చెప్పింది ఒక అధికారి చెప్పినట్టు తీసుకుని, నీకిష్టం లేకపోయినా సరే ననేస్తావేమోనని భయం! ఎవరో స్నేహితుడు. చాల మామూలు స్నేహితుడు అడిగినట్టనుకో. నీ మనసులో ఏది వుంటే అది చెప్పు. నువ్వు కాదన్నా సరే, నేనేం అనుకోను"

"మీతో రావడం, కులాసాగా కబుర్లు చెప్పుకోవడం అన్నది నేను కలలుకనే తీయని అనుభూతి అనీ, దానికి విలువ లేదని, ఏం చెప్పి, ఏం చేసి మిమ్మల్ని నమ్మించగలనా అని ఆలోచిస్తున్నాను"

"ఏమిటో, నా భావాన్ని సరిగ్గా చెప్పలేకపోతున్నాను. నువ్వు మరోలా తీసుకుంటున్నావు!....మరీ అనుమానాల మనిషిగా కనపడుతున్నానా?" నవ్వాడు రావు.

"మీరలా మాట్లాడితే నాకు చాల కష్టంగా వుంటుంది! నన్నెందుకు అర్థం చేసుకోరు మీరు?" నిస్సహాయంగా, బాధగా చూసింది రత్నమాల.

"ఫర్‌గెట్ యిట్! ఇప్పుడు నాలుగున్నర అయింది. నువ్వు వెళ్ళిపో. ఆరింటికి తయారుగా వుండు. నేను వచ్చి పిక్ చేస్తాను"

"ఆరుగంటలకయితే యింకా చాలా టైముంది. ఇప్పటినుంచీ వెళ్ళక్కర లేదులెండి. అందరితోపాటే నేనూ వెడతాను"

ఆ రాత్రి ఎనిమిది గంటలవేళ హోటల్లో కూర్చుని ఏదో ఆర్డరిచ్చాక మెల్లిగా అడిగాడు రావు.

"నీకప్పుడే స్నేహితులు దొరికినట్టున్నారే, ఊహల్లో"

"స్నేహితులు అంటూ ఎందరో లేరు! మీకు తెలుసుననుకుంటాను. సుమతి అని 'జి' బ్రాంచిలో పనిచేస్తోంది. ఆమె యింట్లోకి మకాం మార్చాను. ఆమె చాల మంచిది. ముసలి తల్లి, ఇద్దరు తమ్ముళ్ళు, ముగ్గురు చెల్లెళ్ళు, ఆ కుటుంబంలో నన్నూ ఒకరుగా కలిపేసుకున్నారు వాళ్ళు. శ్యాంసుందర్ ఆమె పెద్ద తమ్ముడు. ఇంటి దగ్గర పరిచయమే. నిన్నేదో కాలేజి ఎలక్షన్‌లో నెగ్గాడట. వాళ్ళ క్లాస్‌మేట్‌లు, అబ్బాయిలు, అమ్మాయిలు ఒక డజనుమందితో పాటు నన్నూ పిల్చాడు. కాదనలేకపోయాను. తీరా హోటలు నుంచి బయటకు రాగానే, సినిమాకి రామని కొందరు, యింతకు ముందే చూశామని కొందరు, ఇంటిదగ్గర పెద్దవాళ్ళు కేకలు వేస్తారని కొందరు తప్పించుకున్నారు. నాకు తప్పిందిగాదు, పది గంటలకి గూటికి తిరిగి వచ్చాను!"

రత్నమాల చాల పెద్ద సంజాయిషీ యిచ్చింది. తన భావాలన్నీ ఆమెకి తెలిశాయా? తెలిసి, తనని నమ్మించాలని ఆమె ప్రయత్నిస్తోందా?

రావు ఆలోచించాడు. ఆ చిక్కులు ప్రశ్నలు వేసుకొన్న కొద్దీ చిక్కు పడ్డం తప్పించి విడ్డంలేదు.

"నేనప్పుడప్పుడిలా పిలిస్తే ఏమనుకోవుగదూ!"

"నిజం చెప్పమంటారా?"

"ఊఁ!"

"ఈ రెండు మూడు నెలల్లో ఒక్కసారయినా మీరు పిలవలేదని నాకు చాల బాధ అనిపించింది తెలుసా! మనమిద్దరం ఒకేరకం అభిరుచులు గలవాళ్ళం. ఎంతో మాట్లాడాలనుంటుంది. మీతో ఏవో చెప్పాలని, చర్చించాలని, రోజూ కనీసం ఓ గంట ఆఫీసు విషయాలు కాకుండా, ఏవేవో కబుర్లుచెప్పుకుంటే ఎంతో బాగుంటుందని ఆశపడ్డాను చాలాసార్లు! కాని మీతో ఏమని చెప్పను? ఎలా చెప్పను? మీరు బాస్ కాకపోతే బహుశా స్పష్టంగా చెప్పేదాన్నేమో!"

"మిస్...." ఏదో చెప్పబోయాడు.

"దయచేసి అలా ఆఫీసు ధోరణిలో పిలవకండి. ఇందాక పిలిచారే. అలా రత్నా అంటే సంతోషిస్తాను."

"సారీ....రెండు నెలలు అనవసరంగా వృధాచేశాంగదూ? నా మీద యింత మంచి అభిప్రాయం వున్నందుకు నా కృతజ్ఞతలు ఎలా తెలుపు కోను చెప్పు."

"అలా అనకండి. యిప్పటికే మీకు నేనెంతో ఋణపడి వున్నాను."

"ఆ ఋణం అలా యెప్పటికీ పెరుగుతూండాలనే నా కోరిక. లేకపోతే...."

"లేకపోతే?"

"లేకపోతే నువ్వు దూరమైపోతావని భయం!"

రత్నమాల తల దించుకుంది. చాలసేపు మాట్లాడలేదు. రావుకి కాం తృప్తిగా వుంది. అతను చెప్పదల్చుకున్నది చెప్పేగాడు. ఆమె అర్థంచేసుకున్నట్లే మాట్లాడింది. ఆమె మాటల్లో అతనూహించని సౌమ్యం, అభిమానం కనపడ్డాయి. అంతకన్నా ఆమెనుంచి అతను కోరేదేం లేదన్నట్టనిపించింది.

ఆ తర్వాత సుమారు రెండు నెలలు చాలా సన్నిహితులయ్యారు యిద్దరూ యించుమించు రోజూ బయట ఓ గంట గడిపేవారు.

ఒకరోజు ప్రొద్దునే ఆఫీసుకి రాగానే సీటులో రత్నమాల నిలబడి వుంది. టేబిల్ అంతా ఖాళీ. కాగితాలన్నీ నీటుగా పేర్చి వున్నాయి. ఏనేం ముట్టుకోనట్టు తెలుస్తోంది.

"మోర్నింగ్, రతన్!" అతనే ముందు చెప్పాడు.

"గుడ్‌మోర్నింగ్ సర్!" బొంగురు గొంతుతో, తలెత్తకుండానే అంది.

"ఏమిటా ఆలోచన?" టేబుల్ దగ్గరే నిలబడి అడిగాడు.

చేతి కింద దాచి పెట్టిన గులాబిరంగు కాగితం ముందుకి తోసింది.

టెలిగ్రాం! విప్పి చూశాడు రావు.

"జరిగింది మర్చిపో, నీ యిష్టమే జరుగుతుంది. అమ్మ చావు మంచంమీద వుంది. వెంటనే రా!- నాన్న."

"ఏమిటిది?" మొగం చిట్లించాడు రావు. ఆమె ఇంట్లోంచి ఎందుకు వచ్చేసిందో, ఉద్యోగంలో ఎందుకు చేరిందో అతను మళ్ళీ ఎప్పుడూ అడగలేదు. ఆమె చెప్పలేదు.

రత్నమాల తలనింకా వంచుకొని మాట్లాడలేదు.

"ఇంటి దగ్గర తగువుపెట్టుకు వచ్చేశావా? నాతో ఎన్నడూ చెప్ప లేదే? అసలు గొడవ ఏమిటి?"

"నన్నిప్పుడేం అడక్కండి. చెప్పగలిగే స్థితిలో లేను. మరో రెండు గంటల్లో బండివుంది. నేను వెళ్ళాలి. నాకు శెలవుకావాలి. కాదు— నేను రాజీనామా చేస్తున్నాను" రత్నమాల కళ్ళల్లో నీరు తిరుగుతుంటే తల ప్రక్కకి తిప్పుకుంది.

"మూర్తికి వాళ్ళకి చెప్పావా?"

"అసలు గొడవ రాణికి తెలుసు. ఈ సంగతి వాళ్ళకింకా చెప్ప లేదు."

"నువ్విక్కడ వున్నట్టు యింటి దగ్గర తెలుసా?"

"మొదట్లో తెలియదు. తర్వాత రాణి రాసి వుంటుంది."

కాసేపు ఏదో కలలో వున్నట్టు నిలబడ్డాడు రావు. ఏం చెయ్యాలో తోచలేదు. గజిబిజిగా వుంది.

"సెలవు తీసుకో, రాజీనామా యెందుకు?" రావు సందిగ్ధంగా అన్నాడు. "కాదు, నే వెళ్ళాలి, ఇంక యీ ఉద్యోగం చెయ్యను."

"రండి, మొదట మూర్తివాళ్ళ యింటికి వెళ్ళి, ఆ తర్వాత మీ గదికి వెళ్దాం." రావు సెలవురాసి హెడ్ క్లర్కుకిచ్చాడు. ఇద్దరూ రాణి యింటికి వెళ్ళారు. మూర్తి ఇంట్లో లేడు.

టెలిగ్రాం చూసి రాణి నవ్వింది.

"నీ యిష్టం నెరవేరుతోందిగా! సంతోషించాలి. అంత బాధగా చూస్తావేం! అమ్మ చావు మంచం ఎక్కడం నిజం అనుకున్నావా? వెర్రి పిల్లా! నువ్వు వెంటనే వస్తావని అలా చిన్న అబద్ధం ఆడివుంటారు అంతే!"

"అంతేనంటావా?" అనుమానంగా అడిగింది రత్నమాల.

"అవును, నాకూ అలాగే అనిపిస్తూంది. ఇంతవరకూ నాకా ఐడియా రానేలేదు" రావు కూడా చెప్పాడు.

"ఏమైనా, నేను వెళ్ళాలి"

"జస్టలక్! స్టేషన్‌కి వెళ్ళేటప్పుడు యిలారండి, నేనూ వస్తాను. ఈ లోపల నేను తయారవుతాను. అట్టే టైం ఉన్నట్టు లేదు" తొందరగా అంది రాణి.

కొద్ది సేపటికి....

గార్డు యీలవేశాడు. రైలు కూసింది. రత్నమాల నీళ్ళు చిందిన కళ్ళతో రావుకి బాగా పరిచయమైన చూపుతో చేతులు జోడించి అతనికేసి చూసింది.

"మీ ఋణం ఎప్పటికీ తీర్చుకోలేను!" గొంతు జీరపోగా కృతజ్ఞతా భావంతో అంది.

"డోంట్ బీ సిల్లీ" రావు అన్నాడు మెల్లిగా రత్నమాల చెయ్యి నొక్కి పడిచి పెడుతూ.

రైలు కదిలింది. రత్నమాల వెళ్ళిపోయింది. ఇంటికి తిరిగి వచ్చే దాకా రావు ఏం మాట్లాడలేదు.

"కాసేపు మా యింట్లో కూర్చోగూడదూ? ఎలాగూ శలవు పెట్టి నట్లున్నారు, ఇప్పుడింక ఇంటికి వెళ్ళి ఏం చేస్తారు? ఇవాళ యిక్కడే భోంచేసి వెడుదురుగాని!" కారు దిగేముందు నవ్వుతూ అడిగింది రాణి.

"అంతకన్న యింకేం కావాలి?" ఓగాడు రావు. ఇద్దరూ లోపలికి నడిచారు.

"ఇంతకీ రత్నమాల యింట్లోనించి ఎందుకు వచ్చేసింది? ఏమా కథ?"

"ఆమెనే అడగలేక పోయారా?"

"అడిగాను ఒకసారి! చెప్పలేదు. ఆఖర్న ఇవాళ మళ్ళీ అడిగాను. మిమ్మల్ని అడగమంది."

"కథేం లేదు. చాలా మామూలు సమస్య" రాణి కళ్ళు, పెదాలు కొంటెగా నవ్వుతున్నాయి.

"ఏమిటది?"

"ముందు కాఫీ తాగండి, తర్వాత విందురుగాని తాపీగా!" రాణి కాఫీ కలిపి యిచ్చింది. రావులో ఉత్కంఠ ఎక్కువైంది.

"కథేం లేదు. అనగనగా ఒక అమ్మాయి, ఆ అమ్మాయి వాళ్ళ బావ చిన్నప్పటినించి ఒక కంచంలో తిని, ఒక మంచంలో పడుకుని పెరిగారు. ఇద్దరూ కలిసి చదివారు. ఇద్దరూ ఒకర్నొకరూ ఎంతో అభిమానించుకుని, ప్రేమించుకున్నారు. ఇద్దరూ రంగురంగుల కలలు కన్నారు వాళ్ళ భావిజీవితాన్ని గురించి. ఆ అబ్బాయి. ఈమెతోపాటే చదువు మానేసి ఉద్యోగం చూసుకున్నాడు. గారాల ఏకైక ముద్దుల కుమార్తెకి, చదువుకున్న అమ్మాయికి, యింకా పెద్ద చదువులు, పెద్ద ఉద్యోగాలు వున్న అబ్బాయిని చూశాడు అమ్మాయి నాన్న. అమ్మాయి వాదించి ఏడ్చి రాగాలెట్టినా వాళ్ళనాన్న వినక పోవడంతో, అది భరించలేక స్నేహితురాలి దగ్గరికి వచ్చి ఆశ్రయం కోరింది. అక్కడొక డాక్టరుగారు ఆమెకి ఉద్యోగమిచ్చారు. ఈ లోగా స్నేహితురాలు యింటికి నీతి బోధ చేస్తూ ఉత్తరం రాసింది. వాళ్ళ నాన్న మనస్సు కరిగింది. టెలిగ్రాం ఇచ్చి కూతుర్ని యింటికి పిలిపించుకున్నాడు. అమ్మాయి కలలు పండాయి. ఇవాళోరేపో వాళ్ళ బావని పెళ్ళి చేసుకుని మురిసిపోతుంది. కథ కంచికి మంచి బహుమతి ఏదన్నా కొని తయారుగా వుంచుకోండి. పంపించడానికి"- తను చెప్పిన మాటల అందానికి, ఆ నేర్పుకి మురిసిపోతున్నట్లు నవ్వింది రాణి.

మరో పదినిమిషాలెలాగో కూర్చుని-

"క్షమించండి, ఇంకోసారి ఎప్పుడైనా వస్తాను!" అని లేచాడు రావు. రాణి ఏమేమేమిటో చెప్పి అతన్నాపాలని శత విధాల ప్రయత్నించింది. కాని రావు వినిపించుకునే స్థితిలో లేడు.

ఎలాగో, ఎక్కణ్ణుంచో తనకి తెలియకుండా అకస్మాత్తుగా వచ్చి కొద్ది రోజులు తనని మురిపించి, వచ్చినట్టే, అంత తేలిగ్గానూ వెళ్ళిపోయింది. ఆమెకోసం తనకింత ఆరాటం, ఆందోళన ఎందుకు? తనని తాను మరచిపోయాడు.

మొదట్లో జాలీ, సానుభూతి, తర్వాత దయ, అభిమానం, మధ్యలో అసూయ. చివరికి మమత అనురాగం ఎన్నో రకాల అనుభూతులు తనని వశం చేసికొన్నాయి! ఈ లక్షణాల నేమనాలి? ఇంత తేలిగ్గా ఈ ఇంద్రజాలంలో యెలా పడ్డాడు?

వానచినుకులు భూమిని శూలాల్లా గుచ్చుతాయి. మచ్చపడుతుంది. మరుక్షణంలో యింకిపోతుంది. మహా ఐతే గుంట పడవచ్చు, కాని ఈ గుర్తు లెంతకాలం వుంటాయి? ఈ సంఘటనలూ, వాటి జ్ఞాపకాలు అంతే, ఎప్పటికో అప్పటికి అన్నీ మట్టిగొట్టుకు పోతాయి, తనెందు కింత వ్యథ పడటం?

వాచ్‌మేన్ కర్ర నేలమీద చేస్తున్న చప్పుడికి పూర్తిగా మెలకువ వచ్చింది రావుకి. ఒక్కసారి కళ్ళు గట్టిగా చికిలించి చూశాడు.

బయట పండు వెన్నెల కురుస్తోంది. దూరంగా హెడ్జింగ్ దగ్గర తెల్లటి పూలు విచ్చి మెరుస్తున్నాయి. వలయాలు చుట్టుతున్న పొంచెన్లు ఆగిపోయాయి. పిట్టేదో అరిచింది.

"ఐ యామ్ ఏ బ్లడీ ఫూల్!" గట్టిగా అనుకుని లేచాడు రావు. వాచ్‌మేన్ సెల్యూట్ చేశాడు.

—0—

# ఈ దేశమేగతి బాగుపడునోయ్!

"అరే, అమ్మగారీ యాళ సినిమా చూపిస్తారన్నారు. జేగి బువ్వ తిని రమ్మన్నారు" పదేళ్ళ యాదగిరి తూనీగలా పరిగెత్తి "సంజయ్‌నగర్" వాడవాడంతా అందరికీ ఆ వార్త చెప్పేశాడు.

ఆ 'అమ్మగారు'....అంటే రాణి విమలాదేవి. ఆ వాడలో అంటే నూరు నూటపాతిక ఇళ్ళకి మకుటంలేని మహారాణి! జమీందారీలు పోయి ఏనాడో అయినా అడవిలో అందం. ఠీవి, దర్పం, రాజరికం అన్నీ కలిసి ఇంకా రాణిగానే కన్పిస్తుంది ఎవరికైనా. జమీనులు, జమీందారీలు పోయాక పల్లెలో భూములు, తోటలు అన్నీ అమ్ముకుని సిటీలో పెద్ద బంగళా కొనుక్కుని స్థిరపడిపోయారు జమీందారు గారుండగానే. ఒక్క గానొక్క కొడుకు అమెరికాలో ఇంజనీరు. కూతురు, భర్త ఇద్దరూ లండన్‌లో డాక్టర్లుగా వున్నారు. నాలుగేళ్ళ క్రితం హార్టు అటాక్‌తో జమీందారుగారు పోయాక విమలాదేవి ఆవిడ దృష్టిని "సోషల్ వర్క్" మీదకు మళ్ళించింది. ఆధ్యాత్మిక చింతన అలవర్చుకుంది. కొడుకు అమెరికా వచ్చేయమన్నా తోచదని చెప్పి, వున్నడబ్బుని కాస్తా సద్వినియోగపరిచి మరు జన్మకి కాస్త పుణ్యం కట్టుకోవాలన్నట్లుగా చేతనయినంతలో బీదా బిక్కాకి సహాయపడడం మొదలుపెట్టింది. అగస్టు పదిహేనుకి, రిపబ్లిక్ డేకి ఆ వాడలో జండా ఎగరేసి మిఠాయిలు పంచుతుంది. పండుగ దినాల్లో అనాథాశ్రమాల్లో అన్నదానాలు చేస్తుంది. గాంధీ జయంతికి అస్పత్రులలో పళ్ళుఫలాలు పంచుతుంది. పాతబట్టలు పోగుచేసి అనాథాశ్రమానికి యిస్తుంది. ఏ శరణాలయాల వారు వచ్చినా లేదనకుండా తోచిన సహాయం చేస్తుంది. కుష్టురోగుల ఆశ్రమాలు, ఓల్డ్ ఏజ్ హోమ్‌లని దర్శించి తోచిన సహాయాలు అందిస్తుంది.

ఆ వాడలో చిన్నా పెద్దా అందరికీ ఆవిడ తలలో నాలిక అయి పోయింది. కొద్ది రోజులలోనే మొగుడు పెళ్ళాల తగువుల దగ్గర్నుంచి, కరెంటు పోయినా, పంపుల్లో నీళ్ళు రాకపోయినా, మున్సిపాలిటీ చెత్త బళ్ళు తీయకపోయినా, రోగాలు వస్తే ఏ డాక్టరు దగ్గిరకు వెళ్ళాలో చెప్పడం మొదలు అన్నీ ఆవిడే చూస్తుంది. కావల్సినప్పుడు అప్పులు ఇచ్చి ఆదుకుంటుంది. ఉద్యోగం సిఫార్సులు చేస్తుంది. పదో పరకో చిన్న అప్పులు మళ్ళీ అడగదు. పెళ్ళాలని చితకబాదే మొగుళ్ళని పిలిచి చివాట్లు పెడ్తుంది. రిక్షాల వాళ్ళకి హామీవుండి బ్యాంకు లోన్లు ఇప్పి స్తుంది. ఆ వాడలో ఇద్దరు తెలివైన పిల్లలకి జీతాలు కట్టి చదివిస్తోంది. ఆ వాడలో ఆడపిల్లల పెళ్ళిళ్ళకి పుస్తె, పట్టుచీర ఆవిడే ఇస్తుంది. ఈ కారణాలన్నింటితో ఆ వాడలో ఆమె మాటకి తిరుగులేదు. ఎదురుచెప్పే సాహసం ఎవరికి లేదు. బంగళా కట్టుకున్నాక దాని ఎదుట వెలిసిన ఖాళీ స్థలంలో సంజయ్‌నగర్ బస్తీని మొదట "ఏమిటీ గోల, పాడుసంత" అని జమీందారుగారుండగా విసుక్కుని కంప్లెయింట్ చేస్తే ఆవిడ ఈనాడు పూర్తిగా ఆ బస్తీలో భాగం అయిపోయింది. ఆ వాడలోని పనిమనిషి, ఇంకొకామె వంటచేస్తుంది—ఇంకోడు తోటపనీ చేస్తారు. వాళ్ళ తిండి బట్ట అంతా ఆవిడదే. విదేశాల్లో వున్న పిల్లలకి తన డబ్బు అక్కరలేదు. భర్త గారు మిగిల్చిపోయిన ఈ డబ్బు సద్వినియోగం చేస్తున్నందుకు ఆవిడకి సంతోషంగానే వుంది.

ఆవిడ దగ్గిర ఓ మూవీ కెమేరా, 16 ఎమ్ ఎమ్ ప్రొజెక్టరు వుంది. నెలకో, పదిహేను రోజులకో ఆవిడ ఓసారి సినిమా చూపిస్తూంటుంది. బంగళా ముందరి ఖాళీ స్థలంలో అందరినీ కూర్చోపెట్టి-పిల్లలకి పనికొచ్చే డాక్యుమెంటరీలు, పెద్దలకి పనికొచ్చే భక్తి సినిమాలు చూపిస్తూం టుంది.

ఆవిడ నాలుగు నెలల క్రితం యూరప్, అమెరికా అంతా తిరిగి వచ్చింది. కొడుకు దగ్గరో నెల, కూతురు దగ్గరో నెల వుండి పదిహేను రోజుల క్రిందటే వచ్చింది. విదేశాల్లో తను షూట్ చేసిన చిత్రం ఆరోజు ఆ వాడలో చూపడానికి అందర్నీ పిలిచింది.

ఏడుగంటలయింది. అంతా, బంగళాలోనుంచి వచ్చారు. సినిమా మొదలైంది. "అరే, ఇంగ్లీషు సినిమారా-" ఎవరో అన్నారు. హిందీ, తెలుగు కానందుకు కాస్త నిరాశ పడ్డారు. ఈలోగా విమలాదేవి లోపల్నుంచి వచ్చింది. ఆపరేటర్ వంక ఆపమన్నట్లు చూసింది సినిమా ఆగి, లైటు వెలిగింది. చూడండి, ఇవాళ నేను చూపిస్తున్నది మామూలు సినిమాకాదు. మీకోసం అని ప్రత్యేకంగా తెప్పాను. ఇది ముందు మీరు చూడండి. దీనిగురించి సినిమా అయ్యాక నేను చెప్తాను. ఓ గంట కంటే వుండదు-చూసిం తర్వాత అంతా మీకు వివరిస్తాను."

తెల్లటి బారెడు జరీ అంచు వెంకటగిరి చీరతో హుందాగా వచ్చి కూర్చున్న ఆవిడ ఎదుట అంతా నిశ్శబ్దం అయిపోయారు.

సినిమా మొదలైంది. కెమెరా యూరప్‌లో అన్ని కంట్రీలలో రోడ్లు చూపిస్తూంది—ప్రతి రోడ్డు విశాలంగా, శుభ్రంగా, ఎక్కడా ఓ కాగితం ముక్కకూడా కనబడకుండా పరిశుభ్రంగా వుంది. కాస్త చీమల్లా కారులు తీరి ఇటు నాలుగు వరుసల్లో అటు నాలుగు వరుసల్లో వెళు తున్నాయి. రోడ్లమధ్య ఫ్లయి ఓవర్లు....ఇటు అటు దారులు చెప్పే బోర్డులు....అంతా ఎంతో సిస్టమేటిక్‌గా వుంది. ప్రతివారు ఎక్కడపడితే అక్కడ ఉచ్చలు, ఉమ్ములు పోయకుండా యూరినల్స్ ఉపయోగిస్తున్నారు- ఆ బాత్‌రూములన్నీ కొత్త వాటిల్లా నీట్‌గా కళ కళ లాడుతున్నాయి. రైలు స్టేషన్లు అయినా, ఏరోడ్రోమ్‌ల్లో అయినా, బజార్లలో అయినా ప్రతి చోటా యూరినల్స్ బాత్‌రూములున్నాయి. ఆఖరికి ఉమ్ములకి డస్ట్‌బిన్స్ ఉప యోగిస్తున్నారు జనం- చక్కని రోడ్లు, లైనుగా చూడముచ్చటయిన ఇళ్ళు, కన్నుల పండువుగా కనిపిస్తూంది. ఎక్కడ చూసినా శుభ్రంగా, దుమ్ము దూళి, చెత్త అన్నదే లేకుండా పరిశుభ్రంగా వుంది. ప్రతిచోట చెత్త డబ్బా లున్నాయి. సిగరెట్టు కాల్చినా, ఐస్‌క్రీమ్ తిన్నా, కూల్‌డ్రింక్ తాగినా అవి ఎక్కడ పడితే అక్కడ పడేయకుండా అందరూ జాగ్రత్తగా చెత్త డబ్బాలో వేస్తున్నారు. ఓ రెండేళ్ళ పాప చాక్‌లెట్ కాగితం విప్పి నోట్లో పెట్టుకుని కాగితం చిట్టి చేతులతో డబ్బాలో వేసింది— ఇంకోరు అరటి

పండు తిని పట్టూ చూసి పది పది హేను గజాలు నడిచి డబ్బా దగ్గరికి వెళ్ళివడేసారు.... ఆ తరువాత కెమేరా ఓ ఇంట్లో వంటిల్లు చూపింది. అందులో గృహిణి వంటచేస్తూ తరిగిన కూరల తుక్కు అంతా వంటింట్లో ఓ మూల డబ్బాలో వున్న ప్లాస్టిక్ సంచిలోవేసి మూతపెట్టింది. మరో సీనులో ఇంకో గృహిణి ప్లాస్టిక్ డబ్బాలో కవర్ నిండడముతో ఓ మూట కట్టి కారు గ్యారేజిలో పెట్టిన ఓ పెద్ద ప్లాస్టిక్ డ్రమ్‌లో పెట్టింది.... తరువాత సీను ఇంటి యజమాని ఉదయం ఆ ప్లాస్టిక్ డ్రమ్ తీసికెళ్ళి ఇంటి ముందు రోడ్డుమీద పెట్టాడు. అందరిళ్ళ ముందు అలాంటి డబ్బాలు ప్లాస్టిక్ సంచుల మూటలు అందంగా పెడ్తున్నారు.... దూరం నుంచి గార్‌బేజ్ వ్యాను వస్తూ అందరింటి ముందు సంచుల మూటలు వేన్‌లో తీసి కెళ్ళారు.... గార్‌బేజ్ వ్యాన్ ఊరి చివర చేర్చిన సంచులన్నీ పెద్ద పెద్ద మిషన్లు క్రష్‌చేసి పడేస్తున్నాయి పెద్ద గోతిలో- తరువాత మళ్ళీ కెమేరా ఒకసారి రోడ్లు, ఇళ్ళు, శుభ్రంగా నీట్‌గా వున్నట్లు చూపించింది- సినిమా అయిపోయింది. లైటు వెలిగింది.

"అయిపోయిందా, ఇంతేనా సినిమా-" అనుకున్నారంతా, కుర్రాళ్ళలే పైకే అన్నారు.

"చూశారుగా ఈ సినిమా- ఇది మామూలు సినిమా కాదు. నేను విదేశాలు వెళ్ళినప్పుడు మీకు చూపించడం కోసం ప్రత్యేకంగా తీసితెచ్చాను ఈ సినిమా మీకెందుకు చూపానో అర్థమైందా" రాణి విమలాదేవి అందర్నీ ఉద్దేశిస్తూ అంది.

"చూశారుగా ఆ దేశాలలోని ఊర్లన్నీ ఎంత శుభ్రంగా- ఒక్క కాగితం ముక్కయినా రోడ్లమీద కనపడదు. చూస్తే ఎంత ఆశ్చర్యం వేసిందీ- ఆ వూర్లు అన్నీ చూస్తూంటే మనదేశం గుర్తు వచ్చి ఎంత బాధ కలిగిందో- మన దేశంలో రోడ్లు, కుళ్ళుకాల్వలు, ఎక్కడ పడితే అక్కడ చెత్తకుప్పలు, మన దేశంలో ట్రాఫిక్.... రోడ్లమీదే ఉచ్చలు, దొడ్లు అన్నీ గుర్తువచ్చి సిగ్గుతో తలవంచుకున్నాను.... ఆ క్షణంలోనే అన్పించింది- మనం ఇంత అధ్వాన్న స్థితిలో ఎందుకున్నాం?.... స్వతంత్రం వచ్చి

నలభై ఏళ్ళయినా ఇలాగే మురికి గుంటల్లో పందుల్లా ఎందుకు బతుకు తున్నాం.... ఇది ప్రభుత్వ లోపమా, ప్రజల్లో లోపమా.... మన దేశం బీద దేశమైనా.... బీదరికానికి, పరిశుభ్రతకి సంబంధం ఏముంది? బీదవాళ్ళైనంత మాత్రాన ఇల్లు- వీధి- వూరు శుభ్రంగా వుంచుకోడానికి ఏం సంబంధం వుంది? అన్నిటికీ ప్రభుత్వాన్ని దుయ్యబట్టే ముందు మనల్ని మనం బాగుచేసుకోడానికి ప్రయత్నించాలి. మన ఇల్లు శుభ్రం చేసుకున్నట్టే- మన వీధి వుంచుకోవాలి- ఒక్కో వీధి వారు ఎవరి వాడ వారు శుభ్రముగా వుంచుకుంటే వూరు మొత్తం అదే శుభ్రం అవుతుంది....మనం చెత్త ఎక్కడ పడితే అక్కడ పారేయకుండా అలాగే సంచులలో కట్టి మున్సిపాలిటీ వ్యాన్ వచ్చినప్పుడు వడేస్తే మన వీధులు ఎంత శుభ్రముగా వుంటాయి. ఇంత చిన్న విషయం మనం ఎందుకు చేయం. ప్రతివారూ వీధులు శుభ్రం చేయడం మున్సిపాలిటి పని అనుకునే బదులు, మనం వారితో ఎంతవరకు సహకరిస్తున్నాం అని ఆలోచించుకుని మనవంతు సహాయపడ్డాక అప్పుడు ప్రభుత్వం చేయలేదంటే ప్రజలు తిరగబడాలి. మీరు ఈ సినిమా చూశాక మన రోడ్లు, మన వీధులు, మన ఊర్లు అలా వుండాలని మీకు అనిపించడం లేదా?" విమలాదేవి అందర్నీ ఉద్దేశిస్తూ అడిగింది. అందరూ అంగీకారంగా తలలూపారు.

"కానీ అమ్మగోరూ.... మనం అట్టా ఎట్లాగుండగలం అమ్మా...."

"ఏం ఎందుకుండలేం....మన చెత్తరోడ్ల ముందు కుప్పల్లా పారేసే బదులు సంచుల్లో కట్టిపెట్టే మాత్రం కూడా మనం చెయ్యలేమా....ఆ మాత్రం మనచుట్టూ శుభ్రంగా వుంచుకోగలంగదా-ఎవరికివారు ఆ మాత్రం చేస్తే ఊరు బాగుపడదా?

"ఆ సంచులు ఎంత ఖరీదుంటాయి....?" ఒకరి సందేహం.

"ఎంతుంటుంది- మహా అయితే రూపాయో, రెండో అనుకోండి- వారానికి ఓ రెండు చొప్పున నెలకి ఎనిమిది అయినా....ఓ పదో పదిహేనో అవుతుంది నెలకి. నెలకి పదిరూపాయలు ఖర్చు పెట్టలేని స్థితిలో ఎంత బీద

వారు కూడా లేరని నా ఉద్దేశం. మీరు వారానికి ఓ సినిమా కోసం ఖర్చు పెట్టేకంటే తక్కువే. మీ ఇల్లు, వూరు శుభ్రంగా వుంచుకోడానికి ఆ మాత్రం త్యాగం చెయ్యలేరా....?"

విమలాదేవి అందరివంక చూసింది.

"అమ్మగోరూ.... పదిహేను రోజులకోసారయినా చెత్త లారీ రాదమ్మగోరూ....ఈ మూటలు ఇంట్లో ఎన్నాళ్ళెట్టుకుంటాం-" మరొకరి సందేహం.

విమలాదేవి అంగీకారంగా తల పంకించింది.

"అవును నిజమే....విదేశాల్లో పట్టణాలలో అయితే వారానికి రెండు రోజులు, గ్రామాలలో వారానికి ఒకసారి ఖచ్చితంగా అన్నరోజుకి వచ్చి చెత్తసంచుల్ని తీస్తారు. మనదేశంలా అలా లేనిమాట నిజమే....కాని మనం ఏదీ ఒకరోజులో సాధించలేం. క్షణాలలో ఏ మార్పూ రాదు....ముందు మనం ఏం చెయ్యగలమో చేసి చూపించితే, ప్రభుత్వాన్ని మీరూ మీ పన్ను సక్రమంగా చెయ్యటంలేదని వేలెత్తి చూపించగలిగే అర్హత, అధికారం మనకొస్తుంది అని నా నమ్మకం-చెత్త లారీ వచ్చేవరకు ఈ మూటలు మీ వీధిలో ఇంటి ముందు నాలుగయిదు ఇళ్ళకి ఓ పాత అయిల్ డ్రమ్ముకాని పనికిరాని ఏ సిమెంటు నీళ్ళ కుండీల్లాంటి వాటిల్లోనో పెట్టి మూతపెట్టి వుంచండి. మీ వీధిలో పిల్లల్ని మలమూత్రాలకి రోడ్డుమీద కూర్చోపెట్టడం మానండి. అదెంత అసహ్యకరమైన విషయమో ఆలోచించండి. ఆ విదేశీ చిత్రం చూశాక మనం ఎంత అసహ్యకరమైన వాతావరణంలో వున్నామో అర్థం చేసుకోండి" తీవ్రంగా అంది ఆవిడ.

"అమ్మగోరూ....ఈ వాడంతటికీ రెండే మరుగుదొడ్లున్నాయి. పెద్దలకే అవి చాలడంలేదు. పిల్లలని అందుకే రోట్ల మీదకి పంపుతున్నాం...."

విమలాదేవి అందరివంకా చూసింది. "నే చెప్పినట్లు మీరంతా చేస్తానంటే మీ కోసం ఈ వున్న బోరింగు పైపుతోపాటు మరోటి తవ్వించి

బాత్‌రూమ్ ఒకటి కట్టించి అందులో నీళ్ళపంపు పెట్టిస్తాను. కాని ఆ తరు వాత ఈ వాడలో కాగితం ముక్క కూడా కనపడదని మీరంతా హామీ ఇవ్వాలి. నాకు మీ పిల్లలూ రోడ్లు పాయిఖానా చెయ్యరని నాకు మాటి వ్వాలి"

"అమ్మగోరూ....మీ మాటకి ఎప్పుడన్నా ఎదురు చెప్పామా...." అంతా ముక్తకంఠంతో అన్నారు.

"సరే బోరింగు తవ్వించి, పాయిఖానా కట్టించి....మీ అందరికీ ఒకనెల ప్లాస్టిక్ సంచులు తెప్పించి ఇస్తాను. ఈనెల ఒకటో తారీకునుండి అంటే ఇంకో పదమూడు రోజులనుంచి మనం మన పథకం ఆరంభించాలి మనల్ని చూసి మిగతా వీధులు అన్నీ మిగతా వూరంతా మనల్ని ఆదర్శ వంతంగా చేసుకునేటట్లు మనం నడుచుకోవాలి. వారానికి ఓసారయినా వచ్చి మన చెత్త సంచులు తీయించడానికి మున్సిపాలిటీ వారితో మాట్లాడ తాను. మీరంతా నా వెనుక నిలబడి చేయూతనిస్తే చాలు...." అందరూ అంగీకారంగా తలలూపి సంతోషంగా చప్పట్లు కొట్టారు....అందరిలో ఏదో కొత్త ఉత్సాహం....ఏదో సాధించబోతున్నట్లు ఉత్తేజం!

★ ★ ★ ★

విమలాదేవి అన్నట్టుగానే సరిగ్గా ఫస్టు తారీఖు లోపల బోర్‌వెల్ తవ్వించి, ఓ బాత్‌రూము కట్టించి మూడింటికి పైపు కనెక్షన్‌లు పెట్టి, అందరికీ ఓ నెలకి సరిపడ ఇంటికి 8 వంతున ప్లాస్టిక్ కవర్లు పంచి పెట్టింది. ఇచ్చేముందు తను ప్రతిరోజూ వచ్చి చూస్తానని చెప్పి మరీ ఇచ్చింది. మొత్తం ఓ ఇరవై వేలు ఖర్చుపెట్టింది ఆవిడ. కార్పొరేషన్ ఆఫీసుకి వెళ్ళి కమీషనర్‌తో మాట్లాడింది. ఆయన ఆవిడ అభ్యర్థనని ఆశ్చర్యంగా విన్నాడు. ఆవిడ చెప్పినదంతా విని మెచ్చుకోలుగా చూశాను.

"మీలా నూటికొకరయినా వుంటే ఈ దేశం బాగుపడుతుందేమో నన్న ఆశ కలుగుతోంది. డబ్బున్నవాళ్ళు చాలామంది వుండొచ్చు. ఆ

డబ్బుని సద్వినియోగపర్చి నలుగురికీ ఉపయోగించే విధంగా ఖర్చుపెట్టా లనుకున్న మిమ్మల్ని అభినందించకుండా వుండలేకపోతున్నాను....మీరు చేపట్టిన ఈ పథకం విజయవంతం అయితే ప్రతి వాడలో మీలాంటి డబ్బు గలవారు ముందుకు వచ్చి తమ పరిసరాలు శుభ్రంగా వుంచుకోవడానికి ఇది స్ఫూర్తినిస్తుందని ఆశిస్తాను....ఈ పథకం ఆరంభించిన మీరే ఈ పథకం నాలుగు మూలలా విస్తరించడానికి పాటుపడ్తారని ఆశిస్తాను. మీ ప్రయత్నానికి నా సహాయ సహకారాలు ఎప్పుడూ లభిస్తాయి తప్పకుండా మీరు కోరినట్టు చెత్త తీయించే ఏర్పాటు చేస్తాను....కాని మీకు తెలియంది ఏముంది? ఈ మున్సిపాలిటీ పనితీరు, పనివారు, లారీలు తగినన్ని లేని లోటు, వున్నవారయినా సరిగా డ్యూటీ చేయకపోవడం, ఏదన్నా అంటే స్ట్రయికులు.... ఏదన్నా యాక్షన్ తీసుకుందామన్నా పొలిటీషియన్స్ జోక్యం....గవర్నమెంటులో పని తీరుతెన్నులు మీకు తెల్సుగదా....ఈ దేశం ఏమాత్రం బాగుపడాలన్నా మీలాంటి ప్రజలే జోక్యం కల్పించుకో వాలి....దేశం మనకేమిచ్చింది అనుకోకుండా మనం దేశానికి ఏమిస్తున్నాం అన్న మంచిమాట గుర్తుంచుకోవాలి అందరూ మీలాగా ..." అంటూ చిన్న లెక్చరిచ్చి ఆమెకి సహాయ సహకారాలు అందిస్తానని మాట ఇచ్చాడు.

వారం పదిరోజుల్లో నిజంగానే ఆ వాడ రూపు మారిపోయింది.... ఇచ్చిన మాటప్రకారం ప్రతివారూ ఇంటిముందు, సందు ముందు చెత్త పోయకుండా సంచుల్లోపెట్టి డ్రమ్ములలో పెట్టారు. వీధిలో వున్న ఆడవాళ్ళు వంతులవారీగా యిద్దరు ముగ్గురు కలిసి వీధులు తుడిచారు. పిల్లలు రోడ్లు పాయిఖానాలు చేయకుండా బుద్ధిగా లావెట్రీ ఉపయోగిస్తు న్నారు, విమలాదేవి ప్రత్యేకంగా పనికట్టుకుని రోజూ ఒకసారి ఆ వీధుల వెంట రెండు-మూడుసార్లు తిరిగివచ్చేది.

ఆరోజు చెత్త లారీ వచ్చింది. ఆ వీధిలో చెత్త డబ్బా చుట్టూ ఎప్పుడూ పొంగిపొర్లుతూ వుండే చెత్త లేదు! వారిని చూసి అందరూ కట్టి పెట్టిన సంచులు తీసుకొచ్చి వీధిచివర పెట్టారు! అదిచూసి మున్సిపాలిటీ వర్కర్లకి ఆశ్చర్యంతోపాటూ ఆనందం కలిగింది. ఆఫీసుకి వెళ్ళాక

వర్కర్సందరితో ఈ విషయం చెప్పారు....అంతా కలిసి చర్చించారు. మాటబలుక్కున్నారు. "మనం ఇంక యిట్టా చెత్తకుప్పలు తేయద్దు-అట్టా సంచులలో కట్టిపెడితేనే తీద్దాం....ఆ వీధివాళ్ళంతా చక్కా ఎత్తిపెట్టారు సంచుల్లో....అందరూ కలిసి ఆళ్ళని చూసి అట్టాగే చెయ్యాలని చెప్పుదాం. మనం చెత్త కుప్పలు ఎత్తం అంటే అంతా అట్టాగే పెడతారు....కాదంటే స్ట్రయిక్ చేద్దాం" అంటూ కలిసి నిర్ణయించారు. ఆఫీసరకి కబురు చేరింది. వాళ్ళు ఆశ్చర్యంగా విన్నారు. కమీషనర్‌గారి దగ్గరకు కబురు చేపింది. ముందే తెలిసిన వాడవడం వలన ఆయన ఆశ్చర్యపడలేదు...."అవును-నిజంగా మన నగరం ఆ వీధిలా మారితే మన దేశానికి మంచిరోజులు వచ్చాయని ఆనందపడొచ్చు. కానీ ఒకరోజులో జరిగే పనా...."

"ఎందుకు కాదు సార్....మీరు పేపర్లో నోటీసులు వేయించండి. చెత్త కుండీలలో వేస్తే చెత్త తీయరని- సంచుల్లో కట్టిపెట్టాలని రూలుపెట్టామని మున్సిపాలిటీ నోటిఫికేషన్ వేయండి. ప్రతిచోట పోస్టర్లు అంటింపచేయండి. జనంలో వెంటనే కాకపోయినా కొద్దిరోజులలో మార్పు వస్తుంది సార్" కమీషనర్ పర్సనల్ సెక్రటరీ అన్నాడు.

"నోటీసులతో ప్రజలలో మార్పు వస్తుందంటావా....ప్రతివాళ్ళల్లో సివిక్‌సెన్స్ వుండాలిగాని....మనం ఏవో చేద్దాం అనుకున్నా ఈ పొలిటీషియన్స్ సాగనిస్తారా? ప్రజలు మనకు కోపరేషన్ ఇస్తారా?" సందేహాలు వెలిబుచ్చాడు కమీషనర్.

"సార్, ఏ మంచిపని మొదలుపెట్టినా ముందు తీవ్ర విమర్శలు ఎదుర్కోవాలి అన్నది మీకు తెలియదా సార్. రైలు ఇంజన్ కనిపెట్టిన నాటినుంచి ఈ విమర్శలు ఎదుర్కొంటూనే వున్నారు. ప్రజలు వారంతట వారు శుభ్రత అలవర్చుకోకపోతే గవర్నమెంటు కఠినమైన రూల్సు పెట్టి అలవాటు చెయ్యాలంటాను. విదేశాల్లో అలా కాగితంముక్క పారేసినా కఠినంగా ఫైనులు అవి వేయబట్టి గదా వారంతా శుభ్రత అలవరచుకున్నారు. ఏ మంచైనా అలవాటు పడడానికి టైము పడ్తుంది సార్. మనం చెత్త అలా విడిగా పోస్తే తీయం, సంచుల్లో ఎత్తిపెట్టాలని రూలు

పెడితే జనం కొన్నాళ్ళకయినా మారతారు సార్," సెక్రటరీ వినయంగా అన్నాడు.

"సరే, చూద్దాం. ముందు పేపర్లలో ఓ నోటిఫికేషన్ ఇవ్వండి- ఇటు ప్రజలు అటు పొలిటీషియన్స్ రియాక్షన్ ఎలా వుంటుందో చూద్దాం" కమీషనర్ ధైర్యంగా ఆర్డరు పాస్ చేసాడు.

ఇలాంటి నోటిఫికేషన్స్‌కి ఏం చలించం అన్నట్లు ఓ మూలబడిన వార్త ప్రజలు పట్టించుకోలేదు. ప్రభుత్వం దృష్టికి రాలేదు. యథాప్రకారం చెత్త డబ్బాలు నిండాయి - నెలకొక సారన్నా వచ్చే చెత్తలారీలు రాకపోవ డంతో చెత్తకుండీలు పొంగి పొర్లి రోడ్లన్నీ నిండాయి. ప్రజలలో కాస్త చలనం కల్గిన వాళ్ళు మున్సిపాలిటి పని తీరును గురించి పత్రికల్లో ఉత్తరాల రీతికలో దుమ్మెత్తిపోశారు. పేపర్లు తీవ్రంగా విమర్శించాయి - క్రమంగా కొన్నాళ్ళకి ఈ వార్త ప్రభుత్వం దృష్టికి వచ్చింది - మున్సిపల్ అడ్మిని స్ట్రేషన్ మంత్రిగారు కోపంతో మండిపడ్డారు జరిగింది విని, కమీషనర్‌కి కబురు వెళ్ళింది. ఎవరి అనుమతితో ఇలాంటి నోటిఫికేషన్ ఇచ్చావని మంత్రిగారు ఎగిరిపడ్డారు. కమీషనర్ వినయంగానే తను మనుష్యులలో మార్పుతెచ్చి, ఊరిని శుభ్రపరచాలన్న సదుద్దేశంతో చేసానని చెప్పినమాట మరింత కోపం కల్గించింది ఆయనకి.

"రూల్సు, రెగ్యులేషన్స్ మార్చేయడం, కొత్త ప్రణాళికలు పెట్టే యడం, దేశాన్ని ఉద్ధరించేయడం అంతా మీ ఆఫీసర్లు చేసేస్తే ఇంక మేం ఎందుకు" అంటూ ఎగిరాడు.

"ఇచ్చేముందు నాకు చెప్పక్కరలేదా. నీకెవరిచ్చారు పవరు" ఆఫీసరు తను ఏ ఉద్దేశంతో చేసాడో చెప్పినా వినకుండా ఎగురుతున్న మంత్రిగారి ఆవేశం తగ్గేవరకు ఆగి - రాణి విమలాదేవి ఆరంభించిన ఈ ఉద్యమానికి చేయూతనిచ్చి ప్రోత్సహించితే ఊరు బాగుపడ్తుందన్న ఆశతో చేసానని చెప్పాడు. మంత్రిగారి భ్రుకుటి ముడిపడింది. "ఎవరా విమాలా దేవి?" కమీషనర్ జరిగింది వివరించాడు.

మంత్రిగారు కుతూహలంగానే విన్నారు. కాస్త శాంతించాడు. "బాగానే వుంది. ఇలా ఒక్కరోజులో రూల్సు మార్చేసి ప్రజలని ఇబ్బంది పెడితే జవాబుదారి మాది....ముందు చెత్త తీయించండి....రోడ్లన్నీ నిండి పోయాయి. నేను ఈ విషయం ముఖ్యమంత్రిగారితో మాట్లాడాక ఆలో చిద్దాం." తమ పవరు, ప్రాముఖ్యత తగ్గకూడదని, ఆఖరి నిర్ణయం తమకే అని తేల్చారు మంత్రిగారు. ఆ మాత్రం దారికి వచ్చినందుకు సంతో షించాడు కమీషనర్.

★ ★ ★ ★

"ఎవరావిడ?....ఎవరా విమలాదేవి? ఇదంతా ఎందుకు చేస్తోంది?" మంత్రిగారు చెప్పిన వార్త విని ఆశ్చర్యంగా, కుతూహలంగా అడిగారు ముఖ్యమంత్రి - జనంలో, ఓ వీధిలోనయినా ఈ మాత్రం మార్పు తీసుకు రాగలిగిందంటే....ఆవిడను చూడాల్సిందే. "ఐ లైక్ టు మీట్ హర్" అన్నారాయన మంత్రితో,

విమలాదేవిని కలుసుకున్నాక ఆవిడ అందం, తెలివి, రాజకీయపు హోదాలతోపాటు ఏదో చెయ్యాలన్న తాపత్రయం. దీక్ష, కృషి పట్టుదల అన్నీ నచ్చాయి ఆయనకి.

"విమలాదేవిగారూ, బాగానే వుంది మీరు చెప్పింది. ఊఁ. దేశం బాగుపడాలని మాకూ వుంది. బాగుపడితే మాకు సంతోషమే. కాని మీరు ఒకటి మర్చిపోతున్నారు. ఆ దేశాలతో పోల్చుకోడానికి మనది బీదదేశం అన్న సంగతి మరవకండి. తిండికి గతిలేని వారెందరోవున్న ఈ దేశంలో నెలకి పదిహేనో, ఇరవయ్యో పెట్టి సంచులు కొనే స్థితిలో అంతమంది వున్నారా. అంతేకాక వున్న యూరినల్స్ శుభ్రత లేకుండా కంపు కొడ్తు న్నాయి. వారిలామనకి నీటివసరులు లేవు. ఎక్కడపడితేఅక్కడ బోరింగులు తవ్వించి, యూరినల్స్ కట్టించి మెంటైన్ చెయ్యడానికి మనకు గ్రాంటులు ఏవి, తాగడానికే నీరు లేని బీద దేశం మనది...."

"క్షమించండి సార్....మీరు చెప్పినట్లు మనది బీద దేశమే. కాని

ఇంటికి నెలకి పది పదిహేను ఖర్చు పెట్టలేని స్థితిలో వున్నారంటే మాత్రం నమ్మలేను. ఔపదికానికి అసలు శుభ్రతకి సంబంధం ఏమిటి సార్. మను ష్యుల్లో సివిక్ సెన్స్ లోపించడంవల్ల, ఇదంతా ప్రభుత్వం పని, బాధ్యత అనుకోడంవల్ల వచ్చిన అలసత్వం అంటాను ప్రజలలో చైతన్యం తీసుకు రావాలి ప్రభుత్వం - వారానికి రెండు సినిమాలు చూసే జనం ఒకి సినిమా త్యాగంచేసి పరిసరాలు శుభ్రంగా వుంచుకోడానికి జనాన్ని అలవాటు చెయ్యడం ప్రభుత్వం పని అంటాను. ముందుగా కఠినంగా రూల్సు పెడితే కానీ ప్రజలు అలవాటుపడరు. ఏ పనికైనా ఆదిలో ప్రతిఘటన తప్పదు. ఓ మంచి పని చెయ్యడానికి ప్రభుత్వం కొన్నాళ్ళు కఠినంగా వ్యవహరించక తప్పదు సార్, మనది బీద దేశమే! ఈ ఎనభై కోట్లమంది ప్రజలు తలొక రూపాయిచ్చినా ఎనభై కోట్ల రూపాయలతో వూరిలో బస్‌స్టాండుల్లో, రైల్వే స్టేషన్సులో, బజార్లలో, నాలుగు రోడ్ల కూడలిలో యూరినల్స్, లావెట్రీలు కట్టించి విదేశాల్లో మాదిరి, ఏ వికలాంగులకో బాధ్యత అప్పగించి మనిషి దగ్గిర పావలా వసూలుచేసి అవి మెయిన్‌టైన్ చేసే పని అప్పగించవచ్చు" విమలాదేవి ఆవేశంగా మాట్లాడుతుంటే ముఖ్యమంత్రిగారు మధ్యలోనే నవ్వారు.

"మీరు విదేశాలు తిరిగివచ్చి చాలా ఇంప్రెస్ అయిపోయారు. విన డానికి అంటే చాలా బాగుంది. అమలుపరచడం ఎంత కష్టమో మీకు అర్థంగాదు...."

"అర్థం అవుతుంది సార్, ప్రభుత్వం తల్చుకుంటే చెయ్యలేనిది ఏది వుండదు. ఎటొచ్చి ఆ ప్రభుత్వంలో నిజాయితీ కొరవడకూడదు. మీరు అడిగితే ఓ మంచి పనికోసం డబ్బు ఇచ్చే ఉదారులు, పెద్దలు, ఇండస్ట్రియలిస్టులు, స్వచ్ఛంద సంస్థలు ఎన్నో వున్నాయి. పెద్ద పెద్ద వారు మీ పార్టీ ఫండులకి ఇచ్చే దానిలో పదోవంతు ఇచ్చినా ఈ పనులకి సరిపోతుంది సార్" ఆవిడ మాటలకి ముఖ్యమంత్రిగారు మొహం మాడ్చు కున్నారు.

"చూడండి. అప్పుడే నెల రోజులుగా మా వీధిలోవున్న అందరూ తు.చ. తప్పకుండా నా మాట పాటిస్తున్నారు. వాళ్ళ బంధువులు, స్నేహితులు వచ్చి చూసి మెచ్చుకుని తామూ అలా చెయ్యాలని నిర్ణయించుకున్నారు. ఆ చుట్టుపక్కల కాలనీలకి, వీధులకి, వాడలకి, ఊర్లో మహిళా మండలి సభ్యులందరినీ పిలిచి బోధపరిచి అందరిచేత చెప్పిస్తున్నాను. అందరం ఇళ్ళకి వెళ్ళి చెపుతూంటే సంతోషంగా ఒప్పుకుంటున్నారు. నాకు తెల్సిన బిజినెస్ పీపుల్ని, డబ్బున్నవారిని వారి వారి వీధుల్లో కొన్నాళ్ళు జనం అలవాటుపడేవరకు ఫ్రీగా సంచులు పంపే ఏర్పాటు చేస్తున్నాను మీరు తల్చుకుంటే ఏం చెయ్యలేరు. ప్రతివాళ్ళ జీతంలో నూటికి ఒక రూపాయి చొప్పున ఒకటి రెండునెలలు చందాగా ఇమ్మని ఆఫీసులని ఆదేశించండి - చందాలకి ప్రజలని, ధనవంతులని ముందుకు రమ్మని పేపర్లలో అభ్యర్థించండి. డబ్బు వచ్చి పడ్తుంది, ఎటొచ్చి ఈ పథకాలన్నీ ఇంప్లిమెంటు సజావుగాచేసే నిజాయితీ ప్రభుత్వంలో పెద్ద అధికారినుండి చిన్న అధికారి వరకు కొరవడకుండా చూడాల్సిన పూచీ మీది...." మరో సారి ముఖం చూడ్చుకున్నా, అనుభవజ్ఞుడైన రాజకీయ నాయకుడు కనుక మొహంమీద నవ్వు పులుముకుని, వెల్........మీ మాటలు వింటూంటే....మీలాంటివారు మా ప్రభుత్వంలో వుండాలనిపిస్తుంది. ఎన్నికలలో నెగ్గి, మున్సిపల్ అడ్మినిస్ట్రేషన్ మంత్రి అయ్యాక ఇదంతా మీ చేతులమీదే జరిపిద్దురుగాని లెండి...." హాస్యంగా నవ్వుతూనే ఎత్తి పొడిచారు.

"ఒక మంచి పని చెయ్యడానికి మంత్రులే అవనక్కరలేదు. స్వచ్ఛందంగా దేశానికి సేవచెయ్యచ్చు. పదవుల మీద వ్యామోహంతోనో పేరు కోసమో నేనీ పని చెయ్యడం లేదు. మనదేశం ఓ కుళ్ళు గుంటలా వుంతకూడదని, మిగతా దేశాల ముందు తల దించుకునే స్థితిలో వుండ రాదన్నది నా తాపత్రయం" ఆవిడ ఆయన వ్యంగ్యం అర్థం చేసుకునే జవాబిచ్చింది.

"అధికారం చేతిలో వుంటే తప్ప పనులు జరగవంటే, మీరు అవ

ముందే మంత్రి అవడానికి నాకేం అభ్యంతరం లేదు." ఓ చురక అంటిం చింది.

★ ★ ★ ★

ముఖ్యమంత్రిగారు హాస్యంగా అన్నమాట నిజమైంది. మరో ఐదు నెలలకే ప్రభుత్వం పడిపోయి మధ్యంతర ఎన్నికలొచ్చాయి.

ఈ ఆరు నెలలలో విమలాదేవి చాలా పాపులర్ అయిపోయింది. ఆవిడ పేరు పేపర్లలో ప్రముఖంగా రాసాగింది తరచు. ఆవిడ పూర్లో పెద్ద పెద్ద బిజినెస్ మాగ్నెట్స్‌ని పట్టుకుని చందాలు వసూలు చేస్తూ, మహిళా మండలి స్త్రీలని పట్టుకుని ప్రతి వాడ, ప్రతి వీధికి వెళ్ళి, ప్రజలకి చెప్తే, ఒప్పిస్తూ, సంచులు పంచిపెడ్తూ ఊరి స్వరూపం కాస్తయినా మార డానికి కృషి చేయసాగింది. నాలుగైదు నెలల్లో ఆవిడ చేస్తున్న కృషి ఇటు ప్రజలలో, అటు పేపర్లలో ప్రభుత్వంలో గుర్తింపు పొందింది. ఆవిడ పాపులారిటి ఢిల్లీ వరకు పాకింది. ముఖ్యమంత్రి హైకమాండ్ మీటింగ్‌లో ఆ నియోజక వర్గం ప్రతిసారి మాదిరి మరో పార్టీకి దక్కకుండా చెయ్యా లంటే విమలాదేవిని ఆ నియోజక వర్గంలో నిలబెడితే గెలుపు తప్పదని చేసిన ప్రతిపాదన పార్టీ అధ్యక్షుడు ఆమోదించారు. విమలాదేవికి రాజ కీయాల్లో దిగాలని లేకపోయినా ఆ నియోజక వర్గంలో ప్రజలు, నాయకులు అందరి బలవంతం ఒక కారణం కాగా, తనేదన్నా సాధించాలంటే చేతిలో అధికారం వుండాలని ఆవిడా గుర్తించి పోటీకి నిలబడడానికి ఒప్పుకుంది.

అనుకున్నట్టే ఆవిడ, ఎప్పుడూ వచ్చే ఆ సీటు ప్రతిపక్ష పార్టీ సభ్యుడిని అధిక మెజారిటీతో ఓడించి గెలిచింది. ఎన్నో ఏళ్ళుగా పార్టీని అంటిపెట్టుకున్న తనకు కాక అఖరి నిమిషంలో విమలాదేవికి పార్టీ టిక్కెట్ ఇవ్వడంతో ఓ సభ్యుడు విమలాదేవికి టిక్కెట్టిప్పించిన ముఖ్య మంత్రి మీద, పార్టీ అధ్యక్షుడి మీదా కోపంతో మిగతా అసమ్మతి వర్గంలో చేరిపోయి అవకాశం దొరికితే తన తడాఖా చూపాలని కాచుకుకూర్చు న్నాడు. ఓ పక్కన చిత్తుగా విమలాదేవి చేతిలో ఓడిపోయిన ప్రతిపక్ష

సమ్మాడు ఆమె మీద కక్ష సాధించే అవకాశం కోసం కాచుకుని కూర్చు న్నాడు.

విమలాదేవికి అందరూ అనుకున్నట్టే మున్సిపల్ ఎడ్మినిస్ట్రేషన్ మంత్రి పదవి లభించింది. ఆమెకంటె ఎంతో సీనియర్ ఎమ్మెల్యేలకి చాలా కాలంగా వున్న లభించని మంత్రి పదవి కాస్తా ఆమెకి ఇవ్వటం చాలా మందిలో అసంతృప్తిని రేకెత్తించింది. కన్నెర్ర అయింది.

విమలాదేవి మంత్రిగా ప్రమాణం స్వీకరించిన రోజు నుంచి ఒక్క రోజు కూడా వృథా చెయ్యకుండా ఊరిని సంస్కరించే రంగంలోకి దిగి పోయింది. అధికారులతో అనేక చర్చలు జరిపి, అనేక ప్రణాళికలు సిద్ధం చేసింది. ఉన్న సిబ్బందితో, వున్న లారీలతో, క్రషర్స్‌తో ఏఏ వార్డులో ఏఏ రోజు చెత్త తీయాలో, వారానికి ఒకసారి ప్రకటించిన రోజుల్లో తప్పక లారీ ఏ వీధికి వెళ్ళాలో అన్న నోటీసులు తయారుచేసి ఊరంతా అంటింప జేసి, పేపర్లో, టి. వి లో ప్రకటనలు ఇప్పించింది. మున్సిపాలిటీసిబ్బందికి సమావేశపరచి డ్యూటీ సక్రమంగా నిర్వహించని పనివారిమీద కఠిన చర్య తీసుకోబడుతుందని, పని చక్కగా చేస్తే బోనస్‌లని ప్రకటించింది. తను ప్రతిరోజూ ఒక్కో వార్డులో తనిష్టం వచ్చిన వీధిలో స్వయంగా తిరిగి పని తీరు పర్యవేక్షిస్తానని, ఎక్కడన్నా సంచులు తీయలేదని కబురు అందితే క్షమించనని చెప్పింది. మరోపక్క ప్రతి మురికివాడలో మరుగు దొడ్లు, జనం తిరిగేచోట యూరినల్స్ కట్టించడానికి ప్లాన్లు, ఫండ్స్ కలెక్ట్ చేయడం ఆరంభించింది.

రోజుకి పదహారు గంటలు పనిచేస్తూ ఒక్కో ప్రణాళిక అమలు పరచడానికి కృషి చేస్తూనే మరోపక్క అమెరికాలో వున్న కొడుకును ఇండియా వచ్చి ప్లాస్టిక్ సంచులు తయారుచేసే ఫ్యాక్టరీపెట్టి ప్రజలకు సంచులు కాస్త చవకగా అందించాలని, కెమికల్ ఇంజనీరింగ్, ఎం.బి.ఏ. చేసిన కొడుకు రావాలని ఫోన్‌ల మీద ఫోన్లు కురిపించింది. మంచి ఉద్యో గము, అమెరికా సుఖాలు వదులుకుని రానన్న కొడుకుని "నీ దేశం కోసం ఈమాత్రం చెయ్యవా, అందరూ నీలా స్వసుఖమే చూసుకుంటే దేశం గతి

ఏం కావాలి?" అని చెప్పి వాదించి ఊదరగొట్టి ఆఖరికి కొడుకుచేత ఊ ఒప్పించింది– కొడుకు వచ్చేలోగా ఫ్యాక్టరీకి కావాల్సిన స్థలం, యంత్రాం గాలు అంటే తన పరపతి, పలుకుబడి వినియోగించి, సమకూర్చి ఫ్యాక్టరీ ప్రారంభింపచేసింది.

అదే విమలాదేవి చేసిన పెద్ద పొరపాటని ఆవిడ ఆరోజు గ్రహించ లేకపోయింది!! ప్రజలకి సేవ చెయ్యాలన్న ఆరాటంతో, ప్లాస్టిక్ సంచులు చవకగా అందించి, ప్రజలని ఆకర్షించాలన్న తాపత్రయంతో ఆవిడ చేసిన పని ఆవిడ అంటే గిట్టనివారికి, ఆవిడ పాపులారిటీని సహించలేని వారికి ఆవిడని దెబ్బతీయడానికి అదే స్టార్టింగ్ పాయింట్ అవుతుందన్నది ఊహించలేకపోయింది.

విమలాదేవి ఈ చేస్తున్నదంతా ప్రజలమీద ప్రేమతో, దేశంమీద భక్తితో చెయ్యడంలేదని కొడుకుచేత ఫ్యాక్టరీ పెట్టించి ప్లాస్టిక్ సంచులు ప్రజలచేత కొనిపించడానికి చేసిందనీ, లక్షలు ఆర్జించే ఉద్దేశంతో ఇదంతా చేస్తోందని టిక్కెట్ దొరకని మాజీ ఎమ్మెల్యే ఓ పక్క, ఆమె చేతిలో ఓడిపోయిన ప్రత్యర్థి మరోపక్క చిన్న చిచ్చు అంటించారు. ఆ నిప్పురవ్వ రాజుకుని దావానంలా మారడానికి ఎక్కువరోజులు పట్టలేదు. అటు అపో జిషన్ పార్టీకి ఈ వార్త మంచి ఆహారం అయింది.

దానికితోడు అటు ఆఫీసులో విమలాదేవి స్ట్రిక్ట్‌నెస్ వర్కర్స్‌కి చాలా ప్రాబ్లమ్ అయింది. ఇన్నాళ్ళు యిష్టంవచ్చిన రీతిలో పనిచేసినవారు ఆవిడ ధాటికి తట్టుకోలేకపోయారు. ఏరోజు ఏ వార్డుకి, ఏ వీధికి వస్తుందో తెలియకుండా వచ్చి తనిఖీచేసి సరిగా లేకపోతే తీసుకునే కఠినచర్య ప్రాణాంతంగా తయారయింది. ఓ ఆరునెలలు ఆవిడ తయారుచేసిన ప్రణాళికను ఉత్సాహంగా "న్యూబ్రూమ్‌స్వీప్స్‌క్లీన్" అన్నట్టు అమలుపరిచినా రోజులు గడుస్తున్నకొద్దీ బద్ధకానికి, లంచాలకి అలవాటుపడ్డ స్టాఫ్‌కి ఆవిడ ఓనికి నచ్చలేదు. ఏ రోజు ఎవరు సస్పెండ్ అవుతారో తెలియని స్థితిలో పనిచేయడంతో ఆవిడపట్ల విముఖత పెరగసాగింది.

ఇటు ప్రజలు? ఊరికే సంచులు ఇచ్చినన్నాళ్ళు చెత్తసంచులలో ఎత్తిపెట్టిన ప్రజలు పదో ఇరవయ్యో ఖర్చుపెట్టి కొనడానికి గింజుకున్నారు ఎవరూ చూడకుండా చెత్త డబ్బాల్లో పోసేయటం ఆరంభించారు. ఏ బజారులోనన్నా ఎవరన్నా యూరినల్స్ ఉపయోగించకుండా రోడ్డుమీదవేస్తే పదిరూపాయల ఫైన్ కలక్ట్ చేయడంతో ఈ ఆంక్షలు ప్రజలకు నచ్చలేదు దానికితోడు ఇదంతా విమలాదేవి కొడుకుచేత ఫ్యాక్టరీ పెట్టటానికి చేస్తూందన్న వార్త జనానికి చేరటంతో ఆవిడపట్ల గౌరవం తగ్గిపోసాగింది.... జనం చెవులు కొరుక్కున్నారు.

ఈ వార్త పేపర్‌లో రావడానికి ఎక్కువ రోజులు పట్టలేదు-అటు వర్కర్స్ ఆవిడ ధాటికి తట్టుకోలేక 'వర్క్ టు రూల్'తో మొదలుపెట్టి స్ట్రయిక్ నోటీసులు ఇచ్చారు.

పేపర్లలో తన గురించిన వార్తలు చదివి విమలాదేవి దిగ్భ్రాంతి చెందింది. తనింత శ్రమపడుతూంటే, తన నిస్వార్థ సేవకి జనం యిచ్చిన నిర్వచనం విని చేష్టలుడిగిన దానిలా అయింది. వార్తలు చదివిన కొడుకు తల్లిమీద ఎగిరిపడ్డాడు.

"చూశావా నీవు చేసిన సేవకి జనం వేసిన పూలమాలలు" అంటూ హేళనచేసి "ఇప్పటికయినా చాలించు నీ దేశసేవ. అనవసరంగా నన్ను పిలిచావు" అంటూ దుయ్యబట్టి, ఇలాంటి దేశంలో ఒక్క క్షణం వుండనని, ఇదివరకు తను పనిచేసిన కంపెనీకి ఫోన్‌చేసి వాళ్ళు తిరిగి ఉద్యోగం ఇస్తాననటంతో నెల రోజులలో ఫ్యాక్టరీ మూసేసి అమెరికా వెళ్ళిపోయాడు.

స్వంత లాభంకోసం, మంత్రిగా పలుకుబడి, అధికారం దుర్వినియోగంచేసి స్వప్రయోజనం కోసం లాండ్ అక్వైర్‌చేసి ఫ్యాక్టరీ పెట్టించిందని ఆరోపణలు చేశాయి అపోజిషన్ పార్టీలు. అటు అసమ్మతి వర్గం, ఇటు అపోజిషన్ ధాటికి తట్టుకోలేక ముఖ్యమంత్రి ఆవిడని సంజాయిషీ కోరాల్సి వచ్చింది. ఇటు ప్రజలు, వర్కర్సు అవసరాన్ని మించిన అధికా

రం వెలాయిస్తూ జులుము సాగిస్తుందన్న ఆరోపణలు ఓ ప్రక్క, పేపర్లలో ప్రముఖంగా వస్తున్న వార్తలు అన్నీ చదివిన విమలాదేవికి అవమానం కంటే బాధ ఎక్కువ అన్పించి ఈ కుళ్ళు రాజకీయ వ్యవస్థ నుంచి తప్పు కోడం మినహా దారి లేదని ఆవిడ రాజీనామా చేసింది.

మరోనాలుగైదు నెలల్లో ఫాక్టరీ, ఇళ్ళు, ఆస్తులు అన్నీ తెగనమ్మి ఆవిడా కొడుకు దగ్గరకు వెళ్ళిపోయింది.

స్వేచ్ఛ దొరికిందన్నట్టు చక్కగా వీధులు అన్నీ చెత్తతో పొంగి పొర్లాయి. చెత్త కుప్పలన్నీ కన్నుల పండుగగా నిండిపోయాయి. యధా ప్రకారం పొంగి పొరలే డస్ట్‌బిన్నులతో ఊరు కళకళ్ళాడిపోయింది.

వనిత దీపావళి సంచిక—93

—0—

# కొడుకు కొడుకని మురవకే...!

"వర్సమ్మగారూ, గుమ్మడికాయ కొన్నాను. మీకు రేపు తీరికేనా, మినపప్పు నానబోయమన్నారా?" నర్సమ్మగారిని అడిగాను.

"ఆ పొయ్యి తల్లీ! పెదికాయ, అబ్బా పెద్దదేనే. శేజీన్నర పప్పు పడుతుంది. కత్తిపీట యిలా పడెయ్యి తల్లీ తరుక్కుంటాను" అందావిడ. కత్తిపీట ఆవిడకి యిచ్చి, మర్నాటి కూరకి గోరుచిక్కుడు కాయలు వలుచు కుంటూ ఆవిడ దగ్గిర కూర్చున్నాను.

నర్సమ్మగారితో మాట్లాడుతూ కూర్చుంటే గంటలే వెళ్ళిపోతాయి. ఏభయ్ ఏళ్ళ క్రితం పాత కబుర్లు ఆవిడ చెపుతుంటే ఆసక్తిగా వినే దాన్ని.

నర్సమ్మగారు నాలుగేళ్ళ క్రితం వంటపని వెతుక్కుంటూ మా వూరు వచ్చి మా యింటికి వచ్చింది. నిజంగా నర్సమ్మగారి చేతివంట ఎంత అద్భుతంగా రుచిగా వుంటుందో ఆవిడ అంత అనాకారిగా వుంటుంది. స్ఫోటకం మచ్చలతో గుంటలు పడిన మొహం, అమ్మవారు వచ్చి పువ్వేసిన కన్ను, ఎత్తుపళ్ళు, నలుపురంగు, వికృతంగా అడ్డదిడ్డంగా పెరిగిన మాసిన తల, దానిమీద నిలవకుండా జారిపోయే నీరుకావి పంచె-ఆవిడని చూసి సదభిప్రాయం కలగలేదు, వంట్లో బాగులేకపోవడం, అమ్మాయి పురిటికి వచ్చి వుండటంతో వంటమనిషి వుంటే బాగుండుననిపించినా ఆవిడని చూసి పెట్టుకో బుద్ధివేయలేదు. కొత్తవూరని అతి దీనస్థితిలో వున్నాను. వంటపని చూడండి యింత తిండి పెట్టండి, జీతం తోచినంత యివ్వండి అని బతిమిలాడిందావిడ పోనే చూద్దాం. నచ్చకపోతే అప్పుడే పంపేయ వచ్చని సరే అన్నాను.

అప్పటి వరకూ వంట అంటే బ్రహ్మవిద్య కాదనుకునేదాన్ని. నిజంగా నర్సమ్మగారి వంట తిన్నాక- నిజంగా వంటకూడా ఒక కళే అందరికి రాదు అన్పించింది అవిడచేతిలో ఏముందో? ఆవిడ గుమ్మడి కాయ ముక్కలు పడవేసి పులుసు పెట్టిందంటే యిల్లంతా ఘుమఘుమ లాడి పోయేది. వంకాయ ముద్ద యింత అల్లం పచ్చిమిర్చి నూరి ముద్దకూర చేసిందంటే ఆ రుచి ఏ పెళ్ళి వంటకీ రాదు. పులిహోర కల్పిందంటే ఆ పోపు వాసన నాలుగు వీధులు గుబాళించేది. పెరుగు గారెలు చేస్తే మెంతి వాసనతో మూడుల్లా వుండేవి-బొబ్బట్లు వత్తిందంటే పూత రేకుల్లా నోట్లో కరిగిపోయేవి. వంకాయ కాయ కాయ కారం పెట్టి వండితే చూస్తేనే నోట్లో వూరేది- పనసకూర వండితే ఆ రుచి తినాల్సిందే. యిది అని ఏమిటి ఆవిడ చేయిపడితే వుట్టి చింతపండు వేసి నాలుగు ఆవగింజలు పోపు పెట్టిన చారుకి కూడా బ్రహ్మాండమైన రుచి వచ్చేది. ఆఖరికి కటిక పెసర పప్పులో నాలుగు మిరపకాయలు, యింత యింగువ, జీలకర్ర వేసి రుబ్బినా ఆ రుచి మనం ఎంత చేసినా రాదు. "మామ్మగారూ! మీలాగే నేనూ అన్నీ చేసినా మీరు చేసినట్లుండదేమిటండీ. మీరు పోపు వేస్తుంటే యిల్లంతా ఘుమఘుమలాడుతుంది-ఏం మంత్రం వుంది మీ చేతిలో" అన్నాను.

"మంత్రాలు తంత్రాలు లేవు తల్లీ! యీ కాలం మీకు కుక్కర్లువచ్చి వంట అంత సుళువయింది గాని-చక్కగా సన్నపు సెగని పప్పు ఉడికిన రుచి-మీరా కుక్కర్లో వేరే గిన్నె పెట్టి వుడక పెడితే అన్ని వాసనలు కలిసి పోతాయమ్మా—- పులుసు ముక్కలు వేరే ఉడక పెట్టి పులుసు పొందిన రుచి ఆ కుక్కర్లో పడేసి వుడకేస్తే వస్తుందా అమ్మడూ! పులుసుపోపు పెట్టాలంటే నూనె కాగాక ముందస్తుగా పిసరంత యింగువ పడవేసి వేగనివ్వాలి. ఆ తరువాత యిన్ని మెంతి గింజలు వేయాలి- ఆ తరువాత ఆవాలువేసి రెండు మిరపముక్కలు తుంపిపడేసి చిటపట లాడాక పోపు పెట్టాలి. అంతేగానీ అన్నీ ఒకసారి వేస్తే మెంతులు ఆల స్యంగా వేగుతాయి. మిరపకాయలు తొరగా మాడిపోతాయి. అవునా-పులుసుకి బియ్యపుపిండి ముందస్తుగానే కలిపి పొయ్యాలి. లేకపోతే పచ్చివాసన

వేస్తుంది. ఏ కూరన్నా దింపేటప్పుడు ఓ చెంచాడు ఓయ్యంపిండి జల్లితే కూర అత్తుకుని బాగుంటుంది. పెరుగు గారెలకి కాసింత ఆవ నూరిపెట్టి ఆవ ఘాటుతో మరింత బాగుంటుంది పెరుగు. బూరెల తోప్, బొబ్బట్ల తోప్పులో చిటికెడు ఉప్పేసి కలుపుతే తీపి బాగా తెలుస్తుంది. పప్పు ఉడికి ఎనిపేటప్పుడు చెంచాడు నెయ్యివేసి ఎనిపితే 'పప్పు కమ్మగా వుంటుంది. ఇలా వంటలో మెలకువలు, చిట్కాలు, ఎన్నో ఆవిడ దగ్గర నేర్చు కున్నాను." పన్నెండో ఏట నించి వండి వండిన ఈ చేతులకి కళ్ళు మూసు కున్నా పడాల్సిన ఉప్పు కారం పడిపోతుంది." అందావిడ నవ్వి.

ఆవిడ అవతారం చూచి "ఛీ మేం ఆవిడ వండితే తినంబాబూ" అన్న పిల్లలు, ఆయన ఆవిడ వంటరుచి మరిగి "మామ్మగారిని పంపే యద్దు మనమే వుంచుకుందాం" అని గోల ఆరంభించారు. నెల తరువాత పంపించేద్దాం అనుకునే వేళకి, నేనేదో పొద్దునే అన్నీ కలిపి కుక్కర్లో పడేసి అయిందనిపించే వంటకి- చక్కగా మామ్మగారు వేడివేడిగా రుచిగా వంటలు పొగలు వస్తున్న అన్నం పెట్టేసరికి అందరూ తలో పట్టు పట్టే వారు-చక్కగా రకరకాల పిండి వంటలు, దిబ్బరొట్టి - అటుకుల అట్లు- అరిసెలు-చక్కిడాలు, చేసుకోడానికి బద్ధకించే పిండివంటలు, ఆ నెలలో అందరి కోరికలు చేయించుకుని తీర్చుకున్నాం - ఎవరికీ శ్రమ లేకుండా రుచిగా వండి పెడితే తినడం బాగానే వుంది కాని-కరువు రోజుల్లో ఒక మనిషిని భరించడం అంటే మాటలు గాదు అందులో ఆయనొకచోట' పిల్లలు ఇద్దరూ, నేను ఒకచోట అయి రెండు కాపురాలు అయి అసలే ఖర్చు జాస్తి-పిల్లలకి నాకు వంట ఎంత-అందులో ఈ రోజుల్లో గ్యాస్ స్టవ్‌లు, కుక్కర్లు, గ్రైండర్ల కాలంలో అరగంట పట్టే వంటకి వంట మనిషి శుద్దదండుగ- అందులో మామ్మగారు కుక్కరు కాకుండా సావ కాశంగా ఒక్కొక్కమాటు వండి నెలరోజుల గ్యాసు పదిహేను రోజులలో సరిపుచ్చి, రక రకాల పిండివంటలు చేసి నెల సరుకంతా పదిహేను రోజు లలో సరిపెట్టడంతో బడ్జెట్ అంతా తలక్రిందులయింది. ఆవిడని భరించ డం అంటే మాటలు గాదు. ఏదో అవసరానికి పెట్టుకున్నాను గాని నాక

వంట మనిషి అవసరమూలేదు- భరించే శక్తి లేదు అనిపించింది రెండు నెలలకే. కాని పాపం ఆవిడ కష్టాలువిన్నాక ఎవరూ దిక్కూ మొక్కూ లేని ఆమెని పంపించలేక పోయాను.

నిజంగా నర్సమ్మగారు పడిన కష్టాలు ఒక్కొక్కటీ వింటుంటే- ఏభై ఏళ్ళక్రితం జరిగినవన్నీ కథల మాదిరి అన్పించేవి. ఆవిడ పదకొండో ఏట ముప్పై ఏళ్ళ వాడితో పెళ్ళి జరగడం, ఆ పదకొండేళ్ళ లోగా పుట్టింట్లో సవతి తల్లి నానా బాధలు పెట్టి, ముప్పై ఏళ్ళవాడికి అంటగట్టి పెళ్ళి చేయడం—పన్నెండో ఏట పెద్దమనిషి అయిన ఆ ముక్కుపచ్చ లారని ఆ పిల్లకి స్నానం అయిన రోజునే గర్భాదానం చెయ్యడం, ఆ రాత్రి ఆ ముప్పైఏళ్ళ ఆ పశువు-అప్పటికే ఎందరినో మరిగిన ఆ మృగం అంత పసి పిల్లని ఆంబోతులా మీదపడి రాత్రంతా అతి నిర్దయగా అమానుషంగా అనుభవించడం, ఆమె భయంతో వణికిపోయి ఏడవబోతే నోరు నొక్కి, రెండు తగలనిచ్చి తన పని కానిచ్చుకుని గుర్రుపెట్టి నిద్రపోతే, రాత్రికి రాత్రే ఆమెకి వళ్ళు తెలియని జ్వరం ముంచుకు రావడం, రెండో రాత్రి జ్వరం తగిలిన పిల్లని గదిలోకి పంపకపోతే అల్లుడుగారు అలిగి ప్రయాణమై వెళ్ళిపోతుంటే అందరూ బతిమిలాడి ఆ జ్వరం వచ్చిన పిల్లనే గదిలోకి పంపడం, ఆ రాక్షసుడి పైశాచిక నృత్యానికి ఆ పిల్ల స్మృతి కోల్పోవడం, మూడోరోజు అల్లుడుగారు కోపగించి ఛీ....ఛీ బొడ్లూడని ముండని అంటగట్టారు. నా కొద్దిది అంటూ ఎగిరి వెళ్ళిపోతే, నెల్లాళ్ళు మంచం పట్టిన కూతురిని మూడునెలల తరువాత అల్లుడు కాళ్ళు పట్టుకుని కాపురానికి పంపడం, అత్తింటి కెళ్ళాక అత్త ఆరడి-నాలుగంటలకి లేచి రాత్రి పదివరకు తలెత్తకుండా ఆ పన్నెండేళ్ళ పిల్ల చాకిరి చేసినా ఏ మాత్రం లోసుగు కన్పించినా కేకలుపెట్టే అత్తగారు-పగలు చాకిరి రాత్రి మొగుడికి శరీరం అప్పగించడం- ఆయనగారు వదిలాక గొడ్డులా పడి నిద్ర పోవటం....

"అబ్బ ఎంత ఘోరం-ఎలా భరించేవారు మీరు" మొదటిసారి విని వళ్ళు జలదరించి అడిగాను.

"ఆడజన్మ - భరించక ఏం చెయ్యనమ్మాయి- నోరు మూసుకు పడివుంటేనే తన్నులు తప్పేవికావు. నోరిప్పితే తల్లీ కొడుకులు బతకనిస్తారా- "దేభ్యం మొహం నీవూ — కాస్త శుభ్రంగా వుండలేవూ— ఆ తెల్లచీర కట్టుకుని తల్లో పూలు పెట్టుకు రాలేవూ?" శృంగార పురుషుడు కర్తగారి కోరిక తీరిస్తే- "సానిముండలా అ ముస్తాబేమిటే" అనే అత్తగారి సాధింపు మధ్య ఎలా చచ్చేదాన్నో- రాత్రి పది దాటినా ఏవో పని చెప్పేది ఆవిడ. "ఇంతసేపూ ఏ రంకు మొగుడి దగ్గరున్నావే" అంటూ ఆయన తిట్లు. అడ్డకత్తెరలో పోకచెక్కలా చచ్చేదాన్ని తల్లీ- చాకిరిచేసినా తృప్తిలేదు ఆవిడకి....నోరు మెదపక వళ్ళప్పగించినా తృప్తి లేదాయనకి— ఇదీ నా పరిస్థితి- పట్టుమని పన్నెండేళ్ళు లేని నాకు శృంగారం చట్టుబండలు ఏం తెలుస్తుందమ్మా- చాకిరిచేసి పులిసిపోయిన వళ్ళుతో ఎప్పుడు పడక చేరుదామా అని వుండేది- ఆయన్ని చూస్తే- దగ్గిరకి వస్తుంటేనే భయంతో చచ్చేదాన్ని- యింక ప్రేమ, శృంగారం ఏం తెలుస్తుందమ్మా-

'ఘోరం-' అన్నాను- ఘోరం— యింతకే ఘోరం అంటున్నావా- ఇంక చెప్తతా వినమ్మా! ఓసారి తోటకూర పులుసు పోపులో ఆవాలు వేయడం మరిచిపోయానని ఆ పోపుల గరిటె కాల్చి మా అత్తగారు వాత పెట్టింది చేతిమీద. మరోసారి బైటుండి నాలుగోరోజు స్నానం చేస్తూ పసుపు రాసుకోడం మరిచిపోయానని 'నీ షోకు మండా— వుండు శుద్ధిచేస్తా' అంటూ చెంబెడు పేడనీళ్ళు నా నెత్తిన గుమ్మరించింది ఆవిడకి రాత్రి కాళ్ళు పడుతూ చిన్న కునుకు కునికానని ఆ కాలెత్తి ఛడేల్మని పొట్టలో తన్నింది. ప్రతీ నెలా బైట చేరేసరికి 'తగలడ్డావూ- అమ్మో కొత్త కాపురానికొచ్చి ఏడాదయింది ఏ నెల కానెల నేను మనుమడ్ని ఎత్తుకోవాలని ఎంతారాటపడుతున్నానో ఎంత ఆశగా చూస్తున్నానో.... నీ తోటివాళ్ళంతా పురుటికి వెళ్ళారు. మా ఖర్మ, గొడ్రాలుని చేసుకున్నాను' అంటూ మెటికలు విరిచేది.

'పదమూడేళ్ళ పిల్ల....గొడ్రాలయి పోవాలా ఏడాదికే—' నవ్వాలో ఏడవాలో తెలియక అన్నాను.

'కొడుకు అడ్డమైన తిరుగుళ్ళు తిరిగి వంటినిండా రోగాలంటించు కుంటే కడుపు అవకపోవడం కోడలి తప్పమ్మా— ఆ సంగతులన్నీ తరువాత పెద్దదాన్నయ్యాక తెలిశాయిగాని పదమూడేళ్ళ దానికి నాకేం తెలుస్తాయి? యీ కాలం కనక బొడ్డూడని పిల్లల దగ్గిరనుంచి ఈ విష యాలు తెల్సు.... ఆ రోజుల్లో మేం ఎంత అజ్ఞానంలో వుండేవాళ్ళం. కాబోసు, నాదే తప్పనుకుని ఆవిడ తిడ్తూంటే గుడ్లనీరుకక్కుకునేదాన్ని. తల్లి అలా కాల్చుకుతింటే కొడుకుగారికి మూణ్ణాళ్ళకే నా ముచ్చట తీరి పోయి.... నాలాంటి గుంటముండలో ఆయనకి కావాల్సింది దొరక్క మళ్ళీ వీధినపడ్డాడు. పెద్దలిచ్చిన ఆస్తి కూర్చుని తింటూ తాగుడూ, ముండ లకి పెడుతూంటే ఎన్నాళ్ళు వస్తుందీ.... ఆయన తిరుగుళ్ళకి నాదే తప్పంట.... మొగుడ్ని ఆకట్టుకోవడం అన్నారాదు మొద్దుమొహం....' అని శాపనార్థాలు పెట్టేది.

'హూ....యివన్నీ వింటూంటే....యీనాడు ఆడదాని బతుకు ఎంత బాగుపడిందో అనిపిస్తూంది....' అన్నాను. వంటచేస్తూ....పప్పు రుబ్బుతూ, కూర తరుగుతూ ఆవిడ అలా ఆనాటి కబుర్లు చెపుతూంటే కుతూహలంగా వినేదాన్ని.

పాపం ఆవిడ బతుకు ఆ మాత్రంగానయినా లేకుండా పెళ్ళయి ఆరేళ్ళయినా కడుపు పండలేదు. అత్తగారి తిట్లనించి తప్పించుకోవడాని కన్నా ఓ బిడ్డనియ్యి తండ్రీ అని దేముడికి పెట్టుకున్న మొర ఫలితం అన్నట్టు గర్భం దాల్చింది. ఆ భ్రష్టుడికున్న రోగాలనించి ఆ కడుపు నిలవకపోవడం, ఒకసారి కాదు నాలుగుసార్లు అలా జరిగి- ప్రతీ ఏటా కడుపులు పోవడంతో పీనుగులా తయారయి ఆఖరికి ఇరవై ఏళ్ళకి ఓ కొడుక్కి తల్లి కాగలిగింది....కాస్త అత్త ధోరణి మారిందని సంతోషించే వేళకి మశూచి వచ్చి చావుతప్పి కన్ను లొట్టయినట్టు వికృతంగా తయారైన ఆమెని అసలే శృంగార పురుషుడయిన ఆ మొగుడు మరి కన్నెత్తి చూడ లేదు.

ఏకంగా ముండని యింటికి తీసుకొచ్చి కాపురం పెట్టాడు. పిల్లా జీని చూసుకుంటూ—వంటలక్కగా, దానిగా తిట్ల దీవెనల మధ్య జీవ చ్ఛవంలా బతికే ఆమెకి ఆ మాత్రం అదృష్టం కూడా లేకుండా యిరవై రెండో ఏట పుట్టెడు రోగాలతో తీసుకుని తీసుకుని తనువు చాలించాడు ఆ కర్త—భర్తగారి వ్యసనాలకిపోగా మిగిలిన కాస్త భూమినీ మూటాంతులు ముండకి రాసిచ్చి మరీపోయాడు ఆ మొగుడు.

పట్టుమని ఇరవై రెండేళ్ళులేని ఆమెని అత్తగారు బలవంతంగా ఎంత ఏడ్చినా కరగకుండా పదకొండో రోజుని ఎలా గుండు చేయించిందో వింటూంటే ఆడదానికి ఆడదే శత్రువు అన్నది ఎంత నిజం అన్పించింది.

మొగుడు పోయాక దానికి కారణం కోడలే అన్నట్టు ఆవిడ ఆరడి మరింత కాల్చుకుతిని కన్న కొడుక్కి కడుపునిండా తిండన్నా పెట్టకుండా కాల్చుకుని తిని-చేసిన పాపాలకి శిక్ష అన్నట్టుగా తరువాత ఏడాదికి పక్ష వాతంతో ఏడాది పక్కమీద నరకయాతనపడి తనువు చాలించింది. అప్ప టికి నరసమ్మగారి కష్టాలు ఒక విధంగా అంతమయ్యాయి. ఆరడి పెట్టే వాళ్ళు లేరు. స్వేచ్ఛ లభించింది. రెండెకరాల పొలం, నాలుగేళ్ళ కొడు కులో పాతికేళ్ళు రాని ఆమె వంటరిగా మిగిలింది. ఆనాటి నించి ఆశలు కోరికలు ప్రాణాలు అన్నీ ఆ పసివాడిమీదే పెట్టుకుని అష్టకష్టాలు పడి-సోళ్ళ బిందెలుమోసి, అప్పడాలు వడియాలు పెట్టి-వంటలుచేసి ఆ కొడుకుని పెంచి పెద్దచేసి చదివించుకుంది....ఆ కొడుకు రూపానికి తండ్రి పోలికలే ఆజానుబాహువు" అందగాడు.

అయినా బుద్ధికి మాత్రం తండ్రిపోలిక రాకపోవడంతో బుద్ధిగా తెలివిగా చదువుకున్నాడు. చదువుకోక ముందు కాకరకాయ, చదువు కున్నాక కీకరకాయన్నట్టు-ఆ చదువుకున్న మూర్ఖుడు చదువు వుండీ సంస్కారం మరిచిపోయిన ఆ హీనుడు, తల్లి చెమటతో కలక్టరయిన ఆ కొడుకు-కలక్టరవగానే ఆ కలక్టరుగిరీ చూసి మురిసిపోయి ఏకైక కుమార్తె నిచ్చి పెళ్ళిచేసిన లక్షాధికారి- మామగారి అంతస్థుకి, అందాలరాశి భార్య

పోవాక, తన కలక్టరుగిరీకి వంటలక్క కొడుకు, నీళ్ళబిందెలు మోసే ఆవిడ కొడుకు అన్పించుకోడానికి నామోన్పి అన్పించి తన కెవరూలేరని తల్లి మొన్నే చచ్చిపోయిందని అబద్ధాలు ఆడి పెళ్ళి చేసుకున్నాడు. ఆ ఖబురు ఎవరి ద్వారానో ఎప్పటికో-ఎన్నాళ్ళకో....విన్న ఆ తల్లి మనస్థితి ఎవరూ ఊహించలేనిది!

ఎవరి కోసం అంత కష్టపడిందో—ఎవరి కోసం అన్ని శ్రమలు ఓర్చిందో ఆ కొడుకు-నవమాసాలు మోసి కన్నకొడుకు, తాగిన రొమ్ముని గుద్దినట్టు ఆవిడ ఆశలని కలలని సమూలంగా నాశనం చేసిపారేస్తే అన్నాళ్ళకయినా కష్టాలు గట్టెక్కి ఆఫీసరయిన కొడుకు నీడలో విశ్రాంతి తీసుకోవాలని ఆశించిన ఆ తల్లి ఏడవడానికి కన్నీళ్ళు కూడా లేనట్టు మంచం పట్టింది. ఇంకెవరి కోసం బతకాలి! అర్థంకాకపోయినా, చావు రాక చావలేక జీవచ్ఛవంలా బతకసాగింది. అతి ఉదారంగా కొడుకు వంటపని మానెయ్యమని నెలకి నూరు రూపాయలు పంపిస్తానని మని ఆర్డరు పంపిస్తే-ఆవిడ తన ఒక్క పొట్టకోసం-అన్నాళ్ళు చేసుకున్న ఆ వంటనే నమ్ముకుని కొడుకు మనియార్డరు తిరగగొట్టింది- ఊర్లోవాళ్ళ సానుభూతి భరించలేక, కబురెట్టిన కొడుక్కి ఆచూకి దొరకకూడదని ఆ వూరు వదలి పొట్టకోసం ఈ వూరు వచ్చింది....'నలుగురిలో పెట్టి మొకం ఊశాల్సింది. పిల్లనిచ్చిన ఆ పెద్దమనిషింటి కెళ్ళి దులపాల్సింది. అంత సులువుగా ఎందుకు వదిలారు. అంత కృతఘ్నుతని ఎలా సహించారు....' కోపంగా అన్నాను విన్నాక.

"హు-అలా చేస్తే నామీద వాడికి మరింత ఏహ్యం పెరగడం తప్ప అభిమానం వస్తుందా తల్లీ-అయినా ఆ కృతఘ్నుడు, ఆ హీనుడు ఏడుస్తూ పడేసే పిండాకూడు నాకెందుకు తల్లీ- తల్లి అన్న ప్రేమ, గౌరవం లేక పోయాక పట్టెడు అన్నం నేను సంపాదించుకోలేననా వాడి పంచనచేరటం' అందావిడ-

పాపం ఆవిడ జీవితం తల్చుకుంటే కొందరు కష్టాలు పడడానికే పుట్టారనిపిస్తుంది, ఆవిడ కథకి జాలి, సానుభూతి కలిగినా ఆవిడని నా

దగ్గిరే వుంచుకో గల స్తోమత లేక మూడు నెలల తరువాత మాకు తెల్సిన వాళ్ళు కావాలంటే వాళ్ళింట్లో కుదిర్చాను. అక్కడ ఆరునెలలు చేశాక వాళ్ళకి ట్రాన్స్ఫర్ అయి పరిస్థితి మొదటికివచ్చింది. అప్పటినుంచీ ఆవిడ ఎవరింట్లో ప్రత్యేక వంటకి కుదరకపోయినా-ఎవరు పిలిస్తే వాళ్ళింటికి వెళ్ళి తద్దినం వంటలు, బారసాల అన్నప్రాసన మొదలైన చిన్న చిన్న వంటలకి వెళ్ళేది-ఎవరింట్లోనో ఒకపూట వడియాలు పెట్టేది-మరో యింట్లో అప్పడాలు వత్తేది. ఊరగాయలు పెట్టేది. కావాలని పిలిస్తే మిఠాయి చేసి, కందిపొడుం విసరి ఆపూట వాళ్ళింట్లో భోజనం చేసి, వాళ్ళిచ్చే రూపాయో రెండో పుచ్చుకునేది ఒకరింట్లో నాలుగు వంకాయలు యిస్తే మరొక యింట్లో యింత మజ్జిగ తెచ్చుకుని యింత ఊరగాయ అడిగి తెచ్చుకుని వండుకునేది. ఒక గది పదిరూపాయలు అద్దెకి పుచ్చుకుని ఏపని కావల్సినా మామ్మగారూ అంటే ఓ అని పలికి వూళ్లో తెలుగు వాళ్ళందరికి పెద్దదిక్కు అయిందావిడ, ప్రత్యేకం మేం అంటే ఆవిడకి ఎంతో గౌరవం, అభిమానం.

"మామ్మగారూ-ఎల్లుండి కాస్త వంటకిరావాలి మీరు-స్నేహితులు భోజనానికి వస్తున్నారు? బొబ్బట్లు. పెరుగు గారెలు అవీ చెయ్యాలి-ఉద యం వచ్చేయండి" అన్నాను. ఆవిడ గుమ్మడికాయ తరగడం అయి వెడుతూండగా—అలాగే తల్లీ! అందావిడ-

★ ★ ★ ★

అతిథులు భోజనానికి వచ్చారు. వంకాయ కారం కూరిన కూర, పప్పు—పులుసు, కొబ్బరి పచ్చడి, పెరుగు గారెలు, బొబ్బట్లు-మామ్మ గారి వంటతో యిల్లంతా ఘుమఘుమ లాడిపోయింది. "అబ్బ అబ్బ వదిన గారూ మీరింత బాగా వంట చేస్తారని యిదివరకు ఎప్పుడూ తెలియలేదే నాకు ఇదివరకు అన్నిసార్లు తిన్నానుగానీ, యీరోజేమిటి యింత అద్భు తంగా వంట కుదిరింది. మా అమ్మవంట గుర్తు వస్తుంది" అన్నాడు రాముం భోజనానికి కూర్చుని పదార్థాలు చూసి చూడగానే రాముం మాకు

ఫేమిలీ ఫ్రెండు. ఆయనకీ రామానికీ వయసులో చాలా తేడావున్నా-యిద్దరి ఉద్యోగాలు వేరయినా-ఇదివరకుండే వూర్లో చిన్నవూరేమో అక్కడుండే పెద్ద ఆఫీసర్లలో వీళ్ళు ముఖ్యులవడం, క్లబ్బు స్నేహం, కలిసి యింటికి రాకపోకలతో రెండు కుటుంబాల వాళ్ళం స్నేహితులమయ్యాం-మాకు యిక్కడికి ట్రాన్స్ఫర్ అయిం తర్వాత రెండేళ్ళకి మళ్ళీ రామం యిక్కడికి ట్రాన్స్ఫర్ అయి వచ్చాడు. రామం దంపతులని చూస్తే ముచ్చటేస్తుంది. మంచి హోదా ఉద్యోగం, అందమైన భార్య, యిద్దరి పర్సనాలిటీ అందం పుణికి ముద్దులు మూటకట్టే కొడుకు, కూతురు, చాలా సరదాగా కలుపుగోలుగా వదినగారూ అంటూ స్వంత మరిదికన్నా ఎక్కువగా మాలో కలిసిపోయాడు. బంగళాకి షిఫ్టు అయ్యేలోగా ఇన్స్పెక్షన్ బంగళాలో దిగాడు.

"పాపం నర్సమ్మగారు చపటలు కారుతూ వండటం క్రెడిట్ ఏమో యీవిడకా"" అన్నారాయన నవ్వుతూ.

"నర్సమ్మగారా....ఎవరావిడ?" రామం కుతూహలంగా అడిగాడు.

నర్సమ్మగారి గురించి ఆవిడ వంటగురించి ఆయన పొగుడుతూ ఇంగ్లీషులో చెప్పారు. ఆవిడ వంట యింట్లో వుందని.

"మిమ్మల్ని చూస్తే అసూయగా వుంది. ఇంత రుచిగా రోజూ తింటున్నారన్నమాట" అన్నాడు రామం.

"నీకెందుకంత అసూయ నీవు కావాలంటే రోజూ తినొచ్చు. ఆవిడ ఎవరింట్లో వంటవంటలేదు. యిలా ఎప్పుడన్నా కావలిస్తే పెట్టిస్తూంటాను."

"నిజం! అయితే పద్మా ఆవిడని మనం పెట్టుకుందాం, ఆవిడతో అన్నీ మాట్లాడి బంగళాకి షిఫ్టు అయ్యాక కబురు పెడదాం అని చెప్పు. కాస్త జీతం ఎక్కువడిగినా బేరాలాడకు" రామం ఆనందంగా భార్యతో ఇంగ్లీషులో అన్నాడు. ఎవరొచ్చారో చూద్దాం అన్న కుతూహలంతో గాబోలు మామ్మగారు తలుపు దగ్గిరనించి తొంగిచూసింది. ఆవిడని చూసి...."మామ్మగారూ! వేడివేడి బొబ్బట్లు నాలుగు తెచ్చి పెట్టండి" అన్నాను. ఆవిడ తలుపు చాటునించి తప్పుకుంటూ "ఇలారా అమ్మా" అందావిడ! లేచి లోపలికి వెళ్ళాను. పొయ్యిముందు కూర్చుని యింకా బొబ్బట్లు వత్తుతూనే వుంది ఆవిడ. పొయ్యి సెగకి గాబోలు ఆవిడ మొహం ఎర్రబడింది. "చిన్న గుడ్డకట్టుకున్నాను. నీవే పట్టుకెడతావని పిలిచానమ్మా" అంది ఆవిడ. వంటలని పదేపదే మెచ్చుకుంటూ రామం సంతృప్తిగా తిని లేచాడు. "ఎన్నాళ్ళ తరువాత మా అమ్మ వంట తిన్నట్టుంది. థాంక్స్ వదినగారూ" అంటూ లేచాడు. "పద్మా! ఆవిడతో వెళ్ళి మాట్లాడు ఇలాంటి ఆమెని వదులుకోవద్దు" అన్నాడు మరోసారి. "వదినగారూ ఆవిడని పంపే బాధ్యత మీదే-" అన్నాడు, చెక్కపొడి యిచ్చి వంటగదిలోకి పద్మని తీసికెళ్ళి మామ్మగారికి చెప్పాను. "వీళ్ళ యింట్లో పనికి కుదరండి మాకు మంచి మిత్రులు, మీకీ యిల్లు యిల్లు తిరిగే అవస్థ తప్పుతుంది. రెండు మూడు రోజులలో బంగళాకి వెళ్ళాక కబురంపిస్తారు వెడుదురుగాని. జీతం మీరడగండి అన్నాను" నర్సమ్మ గారు సంతోషంగా ఒప్పుకుంటుందని ఆశించాను. కాని ఆవిడ నిర్ల క్ష్యంగా-"వద్దమ్మా! నాకిదే బాగుంది ఎవరింట్లోనో ఒక్కరిదగ్గిరే వుండే కంటే యిలానే బాగుంది" అంది—

"అదేమిటి మామ్మగారూ-ఇన్నాళ్ళూ ఏ ఇల్లు దొరకలేదని ఏదో గడుపుకున్నారు. హాయిగా వుండక ఎందుకీ అవస్థ...." ఆశ్చర్యంగా అంటుండగానే మధ్యలో "చెప్పాను గదమ్మా నా కిష్టంలేదని-బలవంతం పెట్ట నమ్మా" అంది నిష్కర్షగా-హర్ట్ అయ్యాను-పద్మ మొహం చూశాను-పద్మకూడా ఆ నిర్లక్ష్యానికి హర్ట్ అయ్యి మొహం ఎర్రపరచుకుని "పోనీలే,

ఆవిడ కిషం రేసప్పుడు బలవంతం దేనికి-డబ్బుపారేస్తే ఎవరో ఒకరు దొరకరా" అంది దర్పంగా. డ్రాయింగు రూములోకి వెళ్ళాం "అదే మిటి, అదేమిటి, ఎందుకు రానన్నారు జీతం ఎక్కువిస్తామని చెప్పలేక పోయావా" అన్నాడు రామం ఆరాటంగా. ఆ "ఆవిడ రానని అంతలా మొహంమీదే చెపుతుంటే ఇంకేం మాట్లాడను-పోనీండి, ఈవిడ కాకపోతే మరొకర్తి వస్తుంది" అంది పద్మ. "అబ్బే, ఇంతబాగా వండే ఆవిడని అంత సులువుగా వదిలేయడమే-వుండు, నేను అడుగుతాను" అంటూ వంటగదివైపు నడిచాడు. నేను వెనకాతే వెళ్ళాను-గుమ్మంలో నిలబడి ఆవి డని చూడగానే సర్పద్రష్టలా ఆగిపోయాడు చకితుడై ఒక్కక్షణం అలా చూస్తూ వుండిపోయాడు-ఎర్రబడ్డ మొహంతో. అపరిచితుడైన పెద్ద ఉద్యోగస్థుడైన పురుషుడు వచ్చి నిల్చుంటే-నర్సమ్మగారు పొయ్యిముందు కూర్చుని మోకాళ్ళ పైకి దాటిన చిన్న పంచె సర్దుకోలేదు జారిపోయిన పైట లాక్కోలేదు - తొలిగిన ముసుగు లాక్కో లేదు. వున్న ఆ ఒకే కన్నుతో రామాన్ని నిలువునా భస్మం చేసేట్టు తీక్షణంగా చూసింది. ఆవిడ ప్రవర్తనకి, ఆ నిర్లక్ష్యానికి నాకు కోపమే వచ్చింది. ఆవిడమీద సదభిప్రాయం, జాలి దిగజారింది "మామ్మ గారూ-ఈయన వాళ్ళింట్లో పని చెయ్యమని అడగడానికి వచ్చారు...." కాస్త కటువుగానే చెప్పబోయాను. ఆవిడ తుంచేస్తూ-"చెయ్యనని చెప్పాను గదమ్మా" అంది, ఆవిడా కటువుగానే. రామం తడబడిపోతూ...."సరే.... సరే" అంటూ ఎవరో తరిమినట్లు డ్రాయింగు రూములోకి వెళ్ళిపోయాడు. ఆవిడ ప్రవర్తన, మొండితనం కోపం వచ్చినా అంపరిముందు ఏమనలేక తరువాత మాట్లాడొచ్చని డ్రాయింగు రూములోకి వెళ్ళాను. రామం మొహం వాడిపోయి వుంది. మరి ఐదు నిమిషాలు ముళ్ళమీద కూర్చున్నట్టు కూర్చుని వెడతానని లేచాడు. వీధిలోకి సాగనంపాం. కారు ఎక్కబోతూ పద్మ హఠాత్తుగా గుర్తు వచ్చినట్లు ఆగి "వచ్చే ఆదివారం మా అత్తగారి తద్దినం, ఆవిడ ఆరోజు వంటకి వస్తుందేమో అడిగి పంపించగలరా?" అంది. "అలాగే" అన్నాను. రామం ఏదో చెప్పబోయి విరమించుకుని మౌనంగా కారు స్టార్ట్ చేశాడు.

లోపలికి వచ్చి వంటగదిలోకి వెళ్ళాను. "వంటకి వెళ్ళకపోతే కాదు, వాళ్ళత్తగారి తద్దినమంట వచ్చే ఆదివారం, మీకిష్టమైతే ఆరోజు వంటకి రమ్మన్నారు ఆవిడ అన్నాను, ముభావంగా! నర్సమ్మగారు తలెత్తి చూసింది నావంక. ఒక్క క్షణం అలా చూసి తరువాత ఓ వెర్రినవ్వు నవ్వి-"వెడతానమ్మా తప్పకుండా వెడతాను. అందరూ చచ్చాక పిండం తింటారు. నేను బతికుండగానే తినే అదృష్టం పడుతుంటే-అదీ నా చేత్తో నేను వండుకు తినడం-ఎంత అదృష్టం-వెడతానమ్మా వెడతాను" నవ్వుతూ ఆరంభించి ఏడుపుతో ఆపి ఘొల్లుమంది ఆవిడ. "బతికున్న తల్లికి పట్టెడన్నం పెట్టలేని వెధవ, శ్రద్ధగా పిండంపెట్టే కొడుకుండడం ఎంత అదృష్టం తల్లీ" బోరుమంటూ ఆవిడ కొంగుతో మొహం దాచుకుంది. నిర్ఘాంతపోయాను.

—0—

# రచయిత్రి పరిచయం

1962 నించి రచనలు చేస్తున్న రచయిత్రి డి. కామేశ్వరి ఇప్పటికి 300 కథలు, 20 నవలలురాసారు. కొత్తనీరు, విధివంచితలు, అరుణ, చీకటిపొద్దున వెలుగురేఖ, కోరికలే గుర్రాలైతే, శుభోదయం, వివాహ బంధం. కొత్తమలుపు,అగ్నిపరీక్ష, జీవితం చేజారనీకు, ఎండమావులు లాంటి నవలలు — ఏడు కథా సంపుటాలు వానచినుకులు, తల్లి మనసు, అతకని బ్రతుకులు, కన్నీటి విలువెంత, ఇది జీవితం, చీకటి తొలగిన రాత్రి, నయనతార అచ్చయ్యాయి. అనేక కథలకి పత్రికలలో బహుమతులు — అరుణ నవల డాక్టరీ మమత టి.వి. సీరియల్‌గా, కొత్తమలుపు 'న్యాయంకావాలి' సినిమాగా, కోరికలే గుర్రాలైతే నవలలు సినిమాగా వచ్చాయి. న్యాయంకావాలి నాల్గు భాషలలో ఎంతో విజయవంతమై ఆ ఏడు ఉత్తమ సినీ కథా రచయిత్రిగా ఆరు అవార్డులు అందుకున్నారు. గృహలక్ష్మి, స్వర్ణ కంకణం, మద్రాసు తెలుగు అకాడమి అవార్డు, అభినందన మాదిరెడ్డి అవార్డు, తెలుగు యూనివర్సిటీ అవార్డు మొదలైనవి అందుకున్నారు. రచనకి ఓ సామాజిక ప్రయోజనం వుండాలన్న ధ్యేయంతో ముందునించి ఈనాటివరకు. అదే పంథాన రాస్తూ అనేక స్త్రీ సమస్యలని తమ రచనల ద్వారా ఎత్తి చూపాలని రచయిత్రి తాపత్రయపడ్డారు. ఈ కథ సంపుటిని కూడా పాఠకులు ఆదరిస్తారని ఆశిస్తున్నాం.

